## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

శ్రీ

# ఆంజనేయ
# సద్గురు బోధామృత సారము.

*

గ్రంథకర్త :

కంభమ్మెట్టు సోమబ్రహ్మానందరావు

రిటైర్డు ఓవర్సీరు (డి. పి. డబ్లియు), రామచంద్రరావుపేట,

ఏలూరు,

పశ్చిమ గోదావరి జిల్లా.

*

పబ్లిషరు :

కంభమ్మెట్టు మధుసూదనరావు, యఫ్. సి. ఏ.

ఛార్టర్డు అకౌంటెంటు,

బాపట్ల, గుంటూరు జిల్లా.

*

ఏలూరు :

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

*

1950

మొదటి కూర్పు 500 ప్రతులు.

Copy Right Reserved.] [Price Rs. 2-0-0.



రాధాకృష్ణ

Acc. 3654

శ్లో. రాసోల్లాసభరేణ విభ్రమభృతా మాభీరవామభ్రువా
మభ్యర్ణం పరిరభ్య నిర్భర మురః ప్రేమాన్ధయా రాధయా
సాధు త్వద్వదనం సుధామయ మితి వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజా దుత్కట చుంబితస్స్మిత మనోహారీ హరిః పాతు వః॥

—గీతగోవింద కావ్యము, ప్రథమసర్గము.

తా. రాధ ప్రేమాతిశయమున నొడలు తెలియక రాసక్రీడల యందు సంతోషమున మెలగుచున్న విలాసవతులగు గోపస్త్రీలు చూచుచున్నారను భయముగూడ లేక సిగ్గు వదలి శ్రీకృష్ణుని జేరి బాగుగా కౌగిలించుకొని "ఓ కృష్ణా! నీ ముఖము సుధామయము గదా! కాబట్టియే నీనోటినుండి బయలు వెడలు గీతము సుధామయముగనే యున్నది. ఏది చూత మొకటి పాడుము." అని, గీతమును స్తోత్రము చేయుమిషచే దగ్గరఁ జేరి యధరోష్ఠమును జుంబింపఁగా ముద్దుల మూటఁ గట్టు చిఱునగవు మొగమునఁ బ్రకాశించుచుండ నందఱమనస్సులను నాకర్షించు శ్రీకృష్ణుడు మనల నెల్లప్పుడు రక్షించు గాక.

## నగురోరధికం

శ్లో॥ యత్పాదరేణుకలిలం సలిలం నిపీయ । మూకోపి మూకయతి పండితమండలాని
సద్భాగధేయ మమిత స్వపద ప్రబోధ । నిర్ధూత మోహతిమిరం గురు మానతోస్మి.



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య సచ్చిదానంద
జోగీశ్వర ఆంజనేయ రాజయోగ అవధూత సరస్వతిస్వామినః

శ్రీమత్
పరమహంస పరివ్రాజకాచార్య సచ్చితానంద జోగీశ్వర
ఆంజనేయ రాజయోగ అవధూత సరస్వతి
సద్గురు స్వామివారి

# జీవిత సంగ్రహము.

శ్రీ శ్రీ శ్రీ సచ్చితానంద జోగీశ్వర ఆంజనేయ రాజయోగ పరమహంస అవధూత సరస్వతి సద్గురు స్వామివారి జీవితము బహు గోప్యమైనది. వారి చర్యలు మిక్కిలి భావగర్భితమైనవి. వారి బోధ సర్వవేదాంత సార సంగ్రహమై యున్నది. భరత ఖండము ఇట్టి మహా పురుషులతో అనాది నుండియు ప్రకాశించుచున్నట్లు చరిత్రలే చెప్పు చున్నవి. ఈ అవతార పురుషుని జీవితమునకు వారి చర్యలకు వారి బోధామృత సారమునకు సంబంధముండుట చేత వారి జీవితము సంగ్రహముగ నిచట నుదహరింప బడుచున్నది.

శ్రీ ఆంజనేయ సద్గురు మహాప్రభువు 1892 సం॥ లో నవంబరు 15 వ తేది రాత్రి 10 గంటలకు (నందననామ సంవత్సర కార్తీక బహుళ దశమి మంగళవారము) జన్మించిరి. వారి తల్లిపేరు సీతా రామాంబ. తండ్రి జోగీశ్వరులు. తల్లిగారిది కృష్ణాజిల్లా నూజవీడు ప్రాంతము. తండ్రిగారు భైరవభొట్ల వంశములోనివారు. గుడివాడ గ్రామము. వీరు గృహస్థులై వానప్రస్థాశ్రమము స్వీకరించిన పుణ్య పురుషులు. వీరి సతీమణి పేరు లక్ష్మీకాంతమ్మ. వీరిరువురకు రామమ్మ, బాలాత్రిపుర సుందరి (చిన్నామ్మాయి), రాధ అను ముగ్గురు పుత్రికలు గలరు. బాల్యమునుండియు రామనామ సంకీర్తన మన్న వీరికి ప్రీతి మెండు. తమ తండ్రిగారివల్ల సీతారామాంజనేయ సంవాదము నుప దేశమునంది యా పుస్తకమును సర్వకాల సర్వావస్థల యందును తమ ప్రాణములతో సమానముగా యెంచి దగ్గర నుంచుకొనుచుండిరని ప్రతీతి. త్యాగవైరాగ్యములు వారి జననమునుండియు వారి యందుండినవి. పెద్దల సేవయందు లక్ష్యమెక్కువ.

ఇట్లుండగా నొకదినమున మధ్యాహ్న సమయమున వీరియందు బాల్యమునుండి గల భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపన్నతకు ఫలితముగా ఒక మహాపురుషుల సందర్శన భాగ్యము వీరికి యబ్బెను. చూచుట తోడనే మన సద్గురు ప్రభువుతో "నాయనా, నాకు భోజనము పెట్టుదువా?" అని యడుగుచు యింటిలోపలకు వీరి ననుగ్రహింప గాబోలు ఆ పెద్దలు దయచేసిరి. పెద్దలసేవ చేతనే కృతార్థు లవదలచిన మన ప్రభువు వారియందలి భక్తి, విధేయతలతో వారికి అర్ఘ్య పాద్యాదులు సమర్పించి భోజన పదార్థములు వడ్డించి సిద్ధముచేసి నంతలో మరల నొకమారు "నాయనా, నేనొక మాటను నీ చెవిలో చెప్పదలచితిని. అది నీవు మననము చేయుదువా? నన్ను మరువవలదు. నిన్ను మరువను" అని వారు నుడివిరి. అందులకు మన గురుప్రభువు "చిత్తముస్వామీ!" అని జవాబిచ్చి వారివల్ల తారక మంత్రోప దేశమును బొంది వారి కటాక్షమునకు పాత్రులైరి. ఆక్షణము మొదలు వీరి జీవితము ఒక క్రొత్త వికాసమును బొందెనని యీ పైవిషయ ములు ఒకానొక సందర్భమున శ్రీ గురుప్రభువును, వారి ధర్మపత్నియు యీ సేవకునికి సెలవిచ్చిరి. వారు అది మొదలుగ బ్రహ్మ జ్ఞాన సంపన్నులై, తమ పందొమ్మిదవ సంవత్సరము వయసున సర్వయోగ ములను సిద్ధిచేసికొని వారి గురు ప్రభువులవల్ల స్వహస్త లిఖితమై యీ క్రింద ప్రచురింప పడినరీతిని

(అ) ది 21-9-1921 తేదీగల ఆశీర్వాద పత్రిక

(ఆ) ది 6-10-1921 తేదీగల పూర్ణాధికార పత్రిక

(ఇ) ది 17-7-1924 తేదీగల అవధూత శ్రీముఖమును బడసిరి.

వీటి మూలములు మావద్ద నున్నందున వివరములు చదువరు లకు తెలియగలందులకు వాటి ప్రతులను వినయ పూర్వకముగ ప్రచురించితిమి.

౦ ఓ ౦
౦ ౧ ౦

ఓంకారాశ్రమ మండలి,
౨౧-౯-౨౧.

అద్వైత అఖండ సచ్చితానంద పరబ్రహ్మణేనమః.

మా శిష్యులును, జోగీశ్వర సీతమాంబ జేష్ఠ పుత్రుడును అయిన ఆంజనేయ శర్మను పరమహంస అవధూతస్వామి అని నామమిడి వ్రాసి యిచ్చిన ఆశీర్వాద పత్రిక :—

ఈ చిన్నవాడు కొద్ది కాలము మావద్ద చతుర్విధ శిశ్రూషలు చేసుకొని మావలన, హఠరాజయోగములను వీటికి సంబంధించిన స్వర జ్యోతిష, ప్రాణాయామములు మంత్ర సిద్ధులగుటకు కాయసిద్ధికి అనుకూలమయ్యే యోగములు వగయిరాలు అద్వైత ప్రబంధము యావత్తు నిస్సంశయముగా నేర్చుకుని యున్నాడు. యిటుల నేర్చుటే కాక అనుభవములో కూడా పరీక్షించగా కృతార్థుడయినాడు. కావున యితనికి ఏమాత్రము అడ్డుపరుచుటకు వీలులేని స్తితికి వచ్చుట వల్లను, మావద్దనున్న శిష్యులు ౭౦ మందిలో యితనే ఆరితేరిన అనగా మాధకాల్కులకు ఆగి శ్రవణ మనన నిధి ధ్యాసలచేత క్రమ ప్రకారము మనోలయం గావించి చిత్తము బ్రహ్మమం దైక్యము చేయగా మేము చూచి కృతార్థుడు అయినాడని సంతసిల్లి వీనియొక్క నామధేయముమార్చి యితనికితగిన నామధేయము అనగా పరమహంస అవధూతస్వామి అని పేరిడుచు ఆశీర్వాదము సలిపితిమి. యీయన బ్రహ్మానంద సుఖమున మునుంగుగాత ?

నిబంధనలు.

శిష్యా!

నీవు గురువునని తలచి ఒకరిని దూషణ భూషణ తిరస్కారంబులు చేయగట్టదు. ధనమార్జించ (యిందుమూలముగా) తగదు, నీసం గతి ఎవరికైన ఒకవేళ తెలిసి అడిగిన పక్షమున వారలను పరీక్షించి

స్నేహ భావమున చెప్పవలెను, గాని ధనమున తీయగిట్టదు. జ్ఞానకట్టడ, వారివల్ల తీసికోనిది యే హంశమును చెప్పగిట్టదు. నీలోకివచ్చి నేర్చుకుని తరువాత ఉల్లంఘనగాని, తిరస్కార భావముగాని, చూపిన యడల, వారలకు మనోదండన విధించుచు బాహ్యమునకు ఆంక్షలుకూడా చేయవచ్చును. యిట్టివి ధర్మశాస్త్రమునకు వ్యతిరేకముగాగాని గురువు చెప్పిన వాటికి వ్యతిరేకముగా గాని. జ్ఞానకట్టడకు వ్యతిరేకముగా గాని యుండవలెను.—నీవు ఎవరికైనా ఏదికోరితే నీకు తెలిసిన వాటిని కమ్మీ పరచక చెప్పవలెను.—యిందుకు వ్యతిరేకముగా నడువగూడదు. నీశక్తి కొలది పాత్రమునెరిగి ధర్మాచరణ చేయుటయందు ప్రయత్నపడవలెను. యితను మావలన నేర్చుకుని సిద్ధిని బొంది యింతవరకు 10 సంవత్సరములు అయినది.

భద్రాచలం మకాం,
౨౧—౯—౨౧.

ఇట్లు,
సచ్చితానంద జోగీశ్వర
అవధూత స్వాములువ్రాలు.
౨౧-౯-౨౧.

దాఖల్

భ॥ ఆ॥

25-9-21

(అనియున్నది.)

౦ ఓం ౦
౦ ౧ ౦

ఓంకారాశ్రమ మండలి.

ఓం

శ్రీ అద్వైత పరిపూర్ణ బోధామృత ఆశీర్వాదన పత్రిక.

మా ప్రియ శిష్యుండును అద్వైత బోధలోను అనుభవములోను అచల బోధలోను, హఠయోగ క్రియలలోను, అనుభవజ్ఞుడును అయిన హారితస గోత్రోద్భవుండును జోగీశ్వర సీతమాంబ జేష్ఠ పుత్రుడును అయిన ఆంజనేయ శర్మను దీవించి వ్రాయించి యిచ్చిన పూర్ణాధికార పత్రిక—

నీవు యికనుంచి పూర్ణబోధ చెప్పుటకును ప్రాణాయామము వగైరాలు చెప్పుటకును అందులకుభిన్నముగ నడుచువారికి తగిన ఆజ్ఞలు యిచ్చుటకున్ను వప్పుకోవడమయినది.

నిబంధనలు

తాను గురువని తలచక స్నేహభావమున చెప్పవలెను. దీని వలన ధనమును ఆర్జించ గిట్టదు జ్ఞాన కట్టడ, ముందుగా నేర్పవలెను. ప్రాణాయామ, రాజయోగ, తత్వమసి మహావాక్యముల వివరము ఆత్మబోధ యింక నీకు మేము ఏమిచెప్పితిమో అవియన్నియు, నిష్కపటిగా నేర్పవలెను. యిదియె నీకు మేము వ్రాయించి యిచ్చిన పూర్ణాధికార పత్రిక నీశక్తియున్న యెడల దీనిని అచ్చులో వేయించుకోవచ్చును

ఇట్లు అ(న్కే)నేక వేదోక్త
ఆశీర్వాదములు.
జోగీశ్వర అవధూత.
ఓం

భద్రాచలం,
౬-౧౦-౨౧.

శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

నారాయణ గోవింద

ఒ న మ శి వా య అ ఉ మ

గోవింద ౦ ఓం ౦ నారాయణ

౧ ౨ ౩ ౪ ౫ ౦ ౧ ౦ ౧౬ ౨౭ ౩౬

నారాయణ గోవింద

అవధూత నారాయణ శ్రీముఖం

గోవింద గోవింద గోవింద గోవింద

---

హంసస్సోహం సోహం హంసః। హంస సోహం సోహం హంసః

హంసస్సోహం సోహం హంసః

'ఓం' పరమహంసకు 'ఓం'

రామకృష్ణ గోవింద నారాయణ

నేను యీనెల ౧౮ వ తేదీన పూర్ణ సమాధి అవుచున్నాను. పీఠాధిపత్యము నీ కొసంగితి. జాగ్రత్తగా కాపాడుకొనుము. నీ ౪౦ వ సంవత్సరమున, వాన ప్రస్థాశ్రమము స్వీకరించి, యతి ఆశ్రమము నకు వెడలిపొమ్ము మౌనమాశ్రయించే (ది) 10 వ శిష్యుని నీతో సమానుని చేసి సమాధికి అర్హత యిమ్ము. నా జన్మ ఉత్సవము అనగా ప్రతి సంవత్సరము మాఘ శు ౪, ౫ లు చేయుము. సమాధిఅయిన రోజున మట్టుకు గురుపూజ చేసేది. యీ ఎనిమిది సంవత్సరములు ఎట్లో కాలము వెళ్లబుచ్చి తద నంతరము పై ప్రకారము చేసేది. యీ పీఠాధిపత్యము నీ 10 వ శిష్యునికి యిచ్చేది. 8 సంవత్సరములు అతనివల్ల పనులు చేయించేది. పయిసలా ఉత్తర్వులు చేసేది. దండనలు విధించేది. నీకు చెప్పిన 3 వైద్య యోగములు నీ తర్వాత పీఠాధిపతికి చెప్పేది. అంత వరకు అవుసరమయిన యెడల నీ స్వంతముకుచేసేది. యిది నామనః పూర్వకముగా యిచ్చిన శ్రీముఖం.

ఓం ఓం ఓం ఓం ఓం

భద్రాచలం. ఓం ౧౭-౭-౨౪.

నీవు యింకా గృహస్థవు గనుక యిది నీకు పంపడమయినది. లేకుంటే అనవుసరం.

రామ కృష్ణ గోవింద నారాయణ కృష్ణ రామ గోవింద నారాయణ

1928 వ సంవత్సరములో శ్రీ వారియొక్క పాదసేవాభాగ్యము మా తండ్రిగారైన యీ గ్రంథకర్తలకును, వారి కుటుంబ మందరికిని ప్రాప్తించెను. జన్మతరణోపాయముకు మార్గము గాంచితిమి. ఆధ్యాత్మికానుభవము వారి సాన్నిధ్య వారి బోధలచేతను, వారి చర్యలచేతను, జిజ్ఞాసగల ప్రతి శిష్యునికి సంశయము నివర్తిచేయగల్గెననుట అతిశయోక్తి కానేరదు. వారియొక్క బోధ "చెయ్యి-చూడు-ఆనందించు" అను మూడు మాటలలో తరచు వెల్లడించెడివారు. అనుభవము కావలెగాని పూరక శాస్త్రపరిచయము చాలదని వారి దృఢమైన యభిప్రాయము. మరియు, తమ శిష్యులయందలి ప్రేమ అపారము. "నన్ను మరువవలదు - నిన్ను మరువను - నే నీవాడను" అని తరచు వెల్లడించిన మాటలు, వ్రాసిన యుత్తరములు ఎన్నటికిని మరపురానివి. బాపట్లలో నివాసమేర్పరచుకొని, వుద్యోగ వ్యవహారములు జరుపుకొనమనిన వారియాజ్ఞయే 1934 సం॥ నుంచి బాపట్లలో యీసేవకుని నివాసమునకు కారణము. తమ సద్గురువు నాజ్ఞ ననుసరించి 1932 వ సంవత్సరమునుంచి గుడివాడ తాలూకా కొండపర్రు గ్రామములో నొక మామిడితోటయందు శ్రీ ఆంజనేయస్వామివారి విగ్రహములను ప్రతిష్ఠించి వానప్రస్థాశ్రమవాసులై యందుండిరి. వీరి శిష్యులు కృష్ణా, ఉభయగోదావరి, గుంటూరు జిల్లాలలో పెక్కురు గలరు. వారి గృహములు కూడ శ్రీ వారి పాదధూళి సోకి అత్యంత పావనములై అలరియుండినవే. ఇట్లే, మన గురుప్రభువు పైననుదహరించిన జిల్లాలలో తమ శిష్యుల నుద్ధరించుటకు సంచారము చేయుచుండెడివారు. 1940 వ సం॥ లో బాపట్లలో శ్రీ మారుతి ప్రణవాశ్రమ లక్ష్మి భవనమును స్థాపించి అచట సకుటుంబ సపరివారముగా నివశించుచు శిష్యులకు జ్ఞాన బోధలుచేయుచు, కాలము గడపుచు, రామనామామృతమును పానము చేయుచు, జీవితమంతయు లోకోపకారము గావించుచు, సూర్యాస్తమయమైనట్లు 1941 వ సం॥ అక్టోబరు 11 వ తేదీని రాత్రి 9 గం॥ లకు శ్రీ ఆంజనేయ సద్గురు ప్రభువువారు మౌనము వహించి చేతితో తమ చెవిని చూపి అందు నారాయణోపనిషత్తును పారాయణము చేయమని లోగడ యీ సేవకునికిచ్చిన యాజ్ఞను జ్ఞప్తికి

తెచ్చుచు శాంతిని పొందుచుండిరి. ఈ ప్రకారము ఏడు పర్యాయము-
లు నారాయణోపనిషత్తును పారాయణము చేయగా విని తమశిష్యులైన
యీ గ్రంధకర్తలును, యీ సేవకుడు దగ్గరయుండగానే 9 గం॥ 10
నిమిషములకు బ్రహ్మీభూతులయిరి. శ్రీ వారు నివసించిన ఆశ్రమమందే
యిప్పటికిని వారు ప్రతిష్టించిన శ్రీ వల్లీ సమేత బాలసుబ్రహ్మణ్య
స్వామి, శ్రీ ఆంజనేయస్వామి విగ్రహములు, శ్రీ సత్యనారాయణస్వామి
మందిరమును, శ్రీ వారు సకుటుంబముగా నివసించిన వారిగృహమును,
శ్రీ వారి పాదుకాక్షేత్రమై యిప్పటికిని బాపట్లలో ప్రకాశించు
చున్నవి. వారు తమ భౌతిక శరీరము చాలించినను వారి కటాక్షము
ఆచంద్రతారార్కముండునని మా స్వానుభవమే చెప్పుచున్నది.

హరిః ఓం తత్సత్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

కంభంమెట్టు మధుసూదనరావు,

(నిత్యానంద్.)

" ఏకమేవాద్వితీయంబ్రహ్మ "



యత్రయత్ర రఘునాధ కీర్తనం। తత్ర తత్ర కృతమస్తకాంజలిం।
బాష్ప వారి పరిపూర్ణ లోచనం। మారుతిం నమత రాక్షసాంతకం॥

# సందేశము.

(ఈక్రింద చెప్పబోవు సందేశములు 4-6-37 తేదిని శ్రీమారుతి ప్రణవాశ్రమ మందిరమున జరిపిన హనుమజ్జయంతి సందర్భమున అధ్యక్షులైన శ్రీ శ్రీ శ్రీ ఆంజనేయ పరమహంస సద్గురుస్వామివారు ఆశ్రమబృందముతోసహా యందరికిచ్చిన సందేశము.)

సోదర సోదరీమణులారా!

ఈ ప్రపంచమందు ఎన్ని జీవరాసులున్నవో, అందు ఎన్ని జన్మములను మనమెత్తవలసియున్నదో లెక్కించుట మనకు సాధ్యముకాదు. మనకుయిపుడు యీనరజన్మము తటస్థించినదిగదా! మరల ముందు ఏగతినొందుదుమో మనమూహించుటయు కష్టమే! మనకు ప్రతిక్షణమును మృత్యువు వెన్నుపట్టి నంటియున్నది. గాని దానిని మనము తెలిసికొనజాలక ముందుచూపేగాని, వెనకచూపులేక, మాయాప్రపంచ వ్యామోహమునబడి దరిగానక, భాగ్య భోగ్యముల రాకకు సంతోషింపుచు, పోకకు దుఃఖపుచు కాలము గడపుచుండుట అతి విచారకరమగు పనియైయున్నది. మనందరిలో అన్యోన్యప్రేమయే మొదటిమెట్టు. ఇది ముందు అభ్యాసముచేయగా మనలోవుండు కొన్ని దుర్గుణములు నశించి, సద్గుణములు పట్టువడుననుట కెంతమాత్రమును సంశయములేదు. మనలోవుండు దుర్గుణములు పోనిదే, ఏమంత్రముగాని, ఏభక్తిగాని, కర్మగాని, అవిగాక ఎన్నియాగములు చేసినను అవన్నియు వృధాప్రయాసలేగాని, వాటివలన కొంచెమైనను ప్రయోజన

ముండదు. కనుక ముందు మన మనస్సుల యందుండు కల్మషములను పోగొట్టుకొనుట మనకు ప్రథమకర్తవ్యము. తదుపరి పైన చెప్పబడిన అన్యోన్యప్రేమ కలుగగలదు. ఇటుల క్రమముగ అభ్యాసముచేయగా ప్రపంచమందు మనము ఎవరమో తెలిసికొనగలము. ఇది అలవాటుకా నియడల వేరు ఏమిచేసినను వ్యర్థమేయని తెలిసికొనవచ్చును కాన మన మందరము ఏకగ్రీవముగ ఏకాగ్రచింతనము, ఏకాంతసేవయు సాధింపవ లసిన ముఖ్య యవసరము. కేవలము గ్రంథములను పూరక చదువుట యందే మన మనస్సులను జొరపుచో, మనలో ప్రతివాని మనస్సు అల్లకల్లోలమై ఒకదానియందును మనస్సు నిలువక అనేకమార్గములలో బోవును. కనుక మనసును సరియైన మార్గమున పెట్టి జాగ్రత్తగా కాపా డుకొనవలసియున్నది. ఇందుకు ఏకాగ్రచిత్తత (Concentration of mind) మిక్కిలి యవసరము. అదెట్లు కలుగునో మొదట నేర్చుకొన వలసియున్నది. ఆవిధముగ మనసుయొక్క సంచారమును, సంకల్ప విక ల్పములనునిల్పి ("మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను సిద్ధాంతము ప్రకారము) కర్మబంధమునుండి విముక్తగావలసియు న్నది. మనసును జయించినపుడే లోకమంతను జయించినట్లు. మనసును జయింపకుండినయెడల అన్నిటియందును మనకు అపజయమే కలుగును. ఏకాగ్రచిత్తతయు, మనసును జయింప కలుగుటకు—

(i) భగవంతుని సగుణరూపమును సూచించు యిష్టదైవముయొక్క బొమ్మయందుగాని—

(ii) ఎదటనుండు ఏవస్తువుమీదనైనను ఒకచుక్క (point) యుంచి ఆచుక్కయందుగాని,

(iii) శరీరమునందు ఒకస్థానమందుగాని, ఒక చుక్కయందుగాని చూపు నిల్పవలెను.

యోగమును సాధించునాతడు తనదేహము విషయము బాగుగ తెలిసికొని దేహములో మూలాధారమునుండి సహస్రారమువరకును ఏ ఒకచోటనైన మనసును నిల్పియుంచవలెను. అదే ధారణ పద్ధతి. అట్టి ధారణలేనిదే ధ్యానము సరిగజరుగనేరదు. కనుక ధారణ అత్యవస

రము. అట్టి సాధనలో మొదట నీమనోదృక్కును అనాహతచక్రమునందును, తరువాత భ్రూమధ్యమందును, చివరకు సహస్రారమందును నిల్పియుంచవలెను.

సూచన :— మనసును క్రమక్రమముగ పైవిధముగ సాధనచేసి చివరకు సహస్రార కమలమందున్న జ్యోతిర్మండల మధ్యమున నిల్పియుంచవలెను. ఆజ్యోతిర్మండల మధ్యమునే సీతారామాంజనేయ సంవాదమను గ్రంథమున—

" కం॥ ఉపజిహ్వకు ప్రాగ్దిక్కున
త్రిపుటికి మధ్యంబునందు దీపము తానై
జపియించు రామనామము " * *

అని చెప్పబడియున్నది. అందువలన యీవిషయ మతిజాగ్రత్తగ సాధింపవలసియున్నది. అందుకు దయా, సత్య, శౌచము లత్యవసరములు. ఈ మూడుగుణములు గల్గిఁగాని చంచలమగు వయస్సు ఒకచోట నిల్వదు. ఇట్టి యోగ అభ్యాసము కష్టమగుటవలననే గురుసహాయము తప్పక కావలసియున్నది. అనుభవజ్ఞుడగు గురుసహాయములేనిదే యోగమును అభ్యసించిన యెడల తప్పుమార్గము ననుసరించుట తటస్థిపవచ్చును. అట్లు సరియైన మార్గమును తప్పినయెడల దేహారోగ్యముచెడి అనేక వ్యాధులకు కారణమగును. అటుగాక, కేవలము భగవన్నామ సంకీర్తనము చేయుటకు గురువు సాహాయమక్కరలేదు. మార్గము తెలియనివానికి దారిచూపుటకు ఆదారి తెలిసినవాడెటు లవసరమో, అట్లే యోగసాధనమునకుకూడ, యోగానుభవము గలిగిన గురువే అత్యవసరము. ఈ విధముగ అభ్యాసయోగమునకు గురువు తప్పక అవసరము. భగవన్నామ సంకీర్తనమునకు గురువవసరములేదు.

1. పరమేశ్వరధ్యానము చేయని జన్మ ఎందుకు ?

2. వివాహమాడుట పుత్రపుత్రికా సంతతికేనా (ఇహసౌఖ్యములకేనా) ?

3. నాయనలారా, భార్యాభర్తలు యిర్వురు కలసి రామనామము చేయుచుండిన ఎటువంటి సంతతి ఇహపర సౌఖ్యములు కల్గును ?

4. వృథాగా కాలముబుచ్చుట అతి విచారకరము కదా?

5. మనమందరము ముఖ్యముగా మన స్వధర్మానుష్ఠానములు నెర వేర్చుకొనుచు ఇహ వ్యవహారికములు చూచుకుంటూ భక్తిగా ఎందుకు ఉండకూడదు? ఇది తప్పా? నాయనలారా! ఎల్లప్పుడు ముందు చూపేనా? వెనుకకుతిరిగి ప్రతిదినముచేయు తప్పులను చూచుకుని సవరించుకొనకూడదా? ఇది ఎంతపని? ఎన్నిపనులు మనము చేయు చున్నారము? నాయనలారా! లెండు! మేల్కొనుడు! స్వధర్మాను ష్ఠానముచేయుడు! మనము తరించుమార్గము (ఇహపరములను) వెదకు కొందము రండు!

సోదరీమణులారా! ఏమి యీ కాలయాపన, పతిభక్తితో మెలగుడు. పతులను ఉద్ధరింపగల సామర్థ్యము మీలోఉండియు ఇట్లు ఉదాసీనభావమూనుట కడు విచారకరము. ఇంకనైనను, మీధర్మముల నెరవేర్చుకొనుచు భక్తియుతులరై సత్సంతానము బడయుచు, ఇహపర సౌఖ్యము లందుకొనుడు. తల్లులారా! మీదే ప్రపంచము. మీదే యీసంసారము. మీదే యీ జగత్తు, మీదే సర్వము అయియున్నది. ఇట్టి సందర్భములో యివి అన్నియు మనకుకలవని అహంకార భావ మూనక, శాంతియుతులరై పతిసేవా దురంధరులై లోకమాతలైన మీరు ప్రపంచమును ఉద్ధరింపుడు. తల్లులారా! ఏమి యీ ఉదాసీన భావము? ఇట్టి ప్రపంచమను మూలప్రకృతి అయిన మహాతల్లియొక్క అంశయందు మీరు జన్మించి, లోకోద్ధరణ చేయుటకు బదులుగ మీ యొక్క భర్తలను యిట్టి మాయాసముద్రమున బడద్రోయుట మీకు ధర్మమా? సోదరీమణులారా! తల్లులారా! ఇట్టి హేయమయినపని మీకు తగునా? తమ పురుషులు, తమను ఎంత నిందింతురో చూడుడు. పరదూషణలకు మీరు ఎందుకు పాల్గొనెదరు? లెండు తల్లులారా! సోదర సోదరీమణులారా! రామనామము చేయుడు. మీదే యీసొత్తు. మీదే యీలక్ష్మి. స్వధర్మములను నెరవేర్చుకొనుడు. యీ మాయా ప్రపంచములో ఎందరెందరు మహాతల్లులున్నారో చూడుడు. వారలచూచిగాని వారినామము తలచిగాని పవిత్రజీవనము గడుపుటకు

యత్నించకూడదా ? మీరందరు అట్టి మహోత్కృష్టమైన పదవిని పొందరాదా ? పరమేశ్వరుని ధ్యానములేని గృహము అది ఒక రుద్రభూమియని పెద్దలు వక్కాణింతురు. దయ, సత్య శౌచములులేనిగృహము ఒక పాడుపడిన దేవాలయము. ఆచారములేని గృహమునందు పైశాచిక, భూత, ప్రేత పిశాచగణములు ఆవరించియుండును. దీనివలన సుఖములేదు. కష్టము లధికములు. ఊహించుకొనుడు. మీమీ మనస్సులను పవిత్రముగా యుంచుకొనుడు తల్లులారా ! సోదరసోదరీమణులారా ! మోహమును పరమేశ్వర ధ్యానమందు లయముగావించుడు గాని, అనిత్య సుఖమయంబగు యీసంసార చక్రమందు ఉంచి మోసపోకుడు. మోసపెట్టకుడు. మీవల్లనే మీగృహమునకు, గృహయజమానికి మంచిగాని చెడుగాని తటస్థించును. భద్రముసుండి ! యీమాటలనుచెప్పితినని ఆగ్రహపడకుడు నిందించకుడు. పరోపకారమందేమనస్సుంచుడు. అన్ని విధములయిన, ఇహపర సౌఖ్యములు, ఈ రాజయోగమందే యున్నవి. మనము ఎక్కడికిపోయినను, ఏమియురాజాలదు. రాదు. పరమేశ్వరుడు (గురువు) మీహృదయపీఠమందు ఉండి మీలో వెల్తురుగలదా చీకటికలదాయని చూచునుగాని, మీ ఆటలను పాటలను, సౌందర్యములను చూడడు. ఆనందించడు. మీవైపు కన్నెత్తిఅయినా చూడడు. జాగ్రత్త. మీశరీరమనే దేవాలయమందు, సరియైన దీపారాధన (పరమేశ్వర ధ్యానమనే) వెల్గుచున్నదా లేదా అనిమాత్రము చూచునుగాని, అదిలేనిదే, ఆగృహమును, ఆపాడుయింటికి ఆపాడు దేవాలయములోనికి జొరడు. ఆ కటికిచీకటిగల గదిలోనికి జొరబడదు పరేగదా ! యిటుల ఉండు గృహములలో సంచితకర్మవల్ల తమకు గల్గిన ధనద్రవ్యాదులను హరించును. బికారిని చేయును. తరువాత మనలకు దిక్కెవ్వరు ? చూచువారేరి ? గాన జాగ్రత. అమ్మలారా ! యీ వచ్చి రాని మాటలలోనుంచి సారస్యముగ్రహించి, తప్పులున్నయెడల, తమపుత్రిలను క్షమించురీతిని క్షమింప ప్రార్థించుచున్నాను. లోపములకేమిగాని, (తప్పులెన్నువారు తమతప్పులెరుగరు) అన్నట్లు ఎవరితప్పులను వారలు సవరించుకొనుట ముఖ్యవిధి అయియున్నది—గాన సోదరసోదరీమణులారా ! యీక్రింద చెప్పబోవు కించిజ్జ్ఞత్వముతో పలుకు,

శాస్త్రీయు, మాటలను విశ్వసించి తదనుగుణ్యముగా మనమందరము, అనుచరణలో పెట్టిన బాగుండునేమో ఊహించుడు. మనయందరికి మొదటివిధి. తెల్లవారుఝామునలేచి మనకాలకృత్యములను తీర్చుకొని, మనను జన్మింపజేసిన ఆపరమేశ్వరుని, మానసికధ్యానము చేయుట.

(2) తదుపరి ఎలుగెత్తి నామసంకీర్తనసల్పుట.

(3) స్నానమాచరించుట.

(4) భగవన్నిర్మితమయినటువంటి మన స్వకులాచారము నెరవేర్చుకొనుట.

(5) తదుపరి, సంసార సంబంధమైన బాహ్య కృత్యములను నెరవేర్చుకొనుట.

(6) సాయంకాల కృత్యములు నెరవేర్చుకొనుట.

(7) హరినామ సంకీర్తన గావించుట.

(8) భోజనము

(9) మానసికధ్యానము సల్పుట.

తదుపరి విశ్రాంతి. యీ పై విషయములు తాము, అవలోకించి తమకిష్టమైనచో ఆచరించుడు. లేనియెడల దూషింపకుడి. ఇదియే నాప్రార్థన. ఇటుల జరిగించినచో రాజయోగాను సంధానముకు భంగము కలుగదని పెద్దలు వక్కాణించెదరు. శాస్త్రములను దూషింపకుడు. ఎవరిని దూషింపవద్దు. మనతప్పులను మనము వెదకుకొనుట స్వధర్మము. అటులచేయనిచో యిదియే పరధర్మము అని గట్టిగా మనస్సునందు ఉంచుకొనుడు.

— "ఆంజనేయ"

---

•



గ్రంథకర్త : కంభమ్మెట్టు సోమబ్రహ్మానందరావు (సరస్వతిస్వామినః)
సతీమణి : ,, నాగరత్నమాంబ (సరస్వతి)

ఓం.

శ్రీ సద్గురుభ్యోనమః

నగురోరధికమ్.

# స్వవిషయ విజ్ఞప్తి

ఓ మహాశయులారా !

నేను నా బాల్యదశలో పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలూకా చాటపర్రు అనే గ్రామ వాసిని. ఆ గ్రామం ఏలూరుకు రెండు మైళ్ల దూరములో నున్నది. ఆ గ్రామమునకు ఒక మైలు దూరమునకు లోవుగా జాలిపూడి అను మరియొక గ్రామము గలదు. ఆ గ్రామంలో శ్రీ ఆంజనేయ స్వామివారిని ప్రతిష్ఠ చేసిన దేవాలయ మొకటి గలదు. ఆ స్వామివారు ప్రజలకు చాల నిదర్శనమును చూపు స్థితిలో నుండి మిగుల ప్రఖ్యాతిని బడసిరి. నేనును, నా సోదరుడును ప్రతిదినం ఉదయం మాగ్రామంనుండి బయలుదేరి వచ్చి ఏలూరు బస్తీలోనుండు చర్చి మిషన్ హైస్కూలులో ఇంగ్లీషు విద్య నభ్యసించుచు సాయంకాలము మా గ్రామమునకు తిరిగి వెళ్లుచుండెడి వారము. ప్రతి శనివారము సాయంకాలము మాత్రము ఏలూరునుంచి మా గ్రామమునకు బోక మా మేనత్తగారు నివసించియుండు జాలిపూడి గ్రామమునకు వెళ్లి శన్యాది వారములు రెండును ఆ యాంజనేయస్వామి వారి యాలయములో తరుచు భజనలు సేయుచుండు నలవాటు గలదు. ఇట్లు కొంతకాలము జరుగు సరికి కావలసిన పరీక్షలలో గడిదేరి డి. పి. డబ్లియు ఓవర్సీరు ఉద్యోగములో ప్రవేశించి యింగ్లీషు విద్యాభ్యాస ఫలితముగా బాహ్యానాగరిక స్థితి కలవడి యుండెడి వాడను. కొంతకాలమునకు నా పూర్వ జన్మ సంస్కారము వలన నన్ను యుద్ధరించు తలంపుతో నా జాలిపూడి యాంజనేయ స్వామివారు తమ యనుగ్రహమును నామీద ప్రసరింపజేసి కొంత

చిత్ర చర్య జరిపి యున్నారు. ఆ చిత్ర చర్యవలన శ్రీ స్వామివారి యందు భక్తి మెండై ఆ చిత్ర చర్యలోని ముఖ్యాంశముల జేర్చి క్లుప్తముగ నొక ప్రార్థన కీర్తనా రూపముగ లిఖించి, దానిని ప్రతిదినమును పాడుకొనుచుండెడివాడను. ఆ చిత్ర చర్యలోని యావత్తు విషయములను జరిగినవి జరిగినట్లిచ్చుటఁ దెలిపిన యడల గ్రంధ బాహుళ్యమగు నను భీతితో ముఖ్యాంశములఁ దెలుపగల యీ ప్రార్థనా కీర్తనను-నమ్మిక లేనివారలకు నందలి యంశములు విపరీతములుగా గాన్పించినను, నమ్మిక గలవారలకుఁ దెలియునను కుతూహలముతో నీ దిగువఁ బ్రకటించుచున్నాఁడ.

ఇట్లు,

గ్రంథకర్త.



## కీర్తన.

పల్లవి. కృష్ణా ! కృష్ణా! కృష్ణా! ఓ ! కృపాజలనిధే ; కృష్ణా !
కృపా జలనిధే! కృష్ణా ! నీకు ! కృతానేకా భవందనంబులు॥

1. రామానంత ముకుంద నా । రాయణ మధుసూదనా।
వామన । కృష్ణా । కంసారీ । వైకుంఠా । హరి । కేశవా॥ కృ॥

2. సతీమణికి గ్రహసాంకేతికమిష । సంకల్పించి సరసను జేరి।
అతులితంబగు ననుగ్రహముతో । ఆదరించవే ననునావారల॥ కృ॥

3. మాననీయుడౌ మహంకాళి సూ । ర్యనారాయణా ఖ్యుండవై
మానుగ నీవపు డాంజనేయ । మంత్రము నుపదేశింపగలేదా॥ కృ॥

4. అతి దుర్ఘటమౌ నాసంకేతము । నప్రయత్నముగఁ జేపట్టి నీ।
వాంజనేయాఖ్యుండవై నీ। యఖండమహిమచెబోనడచితిగద॥ కృ॥

5. ఆవలనా నారీమణికే । యెవ్వరెరుగకనె రణము గల్పించి।
అవలీలగ రణచికిత్స చేయించి। బ్రోవగలేదానను సతిభిక్షతో॥ కృ॥

6. మూడవ పుత్రినకొకతటి చిన్న। బిడ్డవ్యాధియు నొకతటి మరిడి।
జాడ్య మేర్పరచిముందుగఁ దెలిపి । విడుదలఁ జేసిపుత్రభిక్షమిడవె॥కృ॥

7. పదునేడేడుల పరిమితిరాగా । భైరవభొట్లాంజనేయాఖ్యుడను
పరమగురుడవై యద్వైత । పరిపూర్ణ బోధ లుపదేశింపవె॥ కృ॥

8. సర్వయత్నములు నిరాశమై । భవదీయకృపకు శరణు జొరగ
సువర్చలకు మరల తెల్వినిచ్చి। కావగలేదా కరుణాళుడవై ॥ కృ॥

9. సకల కుటుంబోద్యోగ వ్యవహృతి, నికరంబునకును మార్గదర్శివై
ఒకే మాదరిగ యుండగ నిలచి, సుకముగ నడుపుచునుండగలేదా॥

10. ఔరా నీ మహిమల నెన్నంగను నలవియె యాబ్రహ్మాది దేవతల
కాదిశేషునకు నాజగన్మాత । కహాహా యిదియెంతవందనీయమో॥-

11. ఇప్పటికి ముప్పది యెనిమిదేడులు । ఏకదీక్షగా నాపద యనునది
చొప్పడకుండగ నుద్ధరించితివి యెప్పటికిని నీదే నాభారము॥ కృ॥

12. నీకంటే గతిలేదని నిన్నే । నెఱనమ్మిన యీ దీనుండు
నీవె శరణమని పాదములంబడి । బోర్వు మనగ విడనాడుట
న్యాయమె॥ కృ॥

13. కాలం బాసన్నంబగుచున్నది । జాలముసేయక యింతటనైనను
జాలిగలిగి యాత్మమయత దర్శనము । సంఘటించి నను
కృతార్థు జేయవె॥ కృ॥

ఇట్టి ఘనకార్యములు జేసి నాదైవభక్తిని వృద్ధిజేసి శ్రీమత్పరమ హంసపరివ్రాజకాచార్య సచ్చిదానందజోగీశ్వర ఆంజనేయ రాజయోగ అవధూత సరస్వతీస్వామి యను నామాంకితమును తమ గురువుగారివలన ననుగ్రహింపఁబడిన "భైరవభొట్ల ఆంజనేయ స్వామివార" ను నొక సద్గురువును నా కనుగ్రహించి వారివలన తత్వబోధను చేయించిన యీ పరమేశ్వరున కనేక కృతజ్ఞతాభివందనముల సమర్పించు చున్నాడ.

ఇచ్చట జాలిపూడి యాంజనేయస్వామివారు యిట్టి యనుగ్రహ మును ప్రసరింప జేసినారని చెప్పుచు నీకీర్తనలో "కృష్ణుడు" పేర పల్లవి నేర్పరచుటకు కారణమేమి ? యని సందేహము గలుగవచ్చును. అట్లు సందేహింపఁ బనిలేదు. ఏలయన, నా సద్గురువువారి వలన చేయ బడిన తత్వబోధ సారాంశమైన "సర్వం ఖల్విదం బ్రహ్మ" 'నేహనా నాస్తి కిఞ్చన' 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అను న్యాయము ప్రకారము సమస్త దైవస్వరూపములును పరబ్రహ్మాంశలే యగుట వలనను, ఆ పరబ్రహ్మమును "కృష్ణుడు" అను పదముచే వాడుకలో వ్యవహరింప బడుచున్నదని పెద్దల వలన దెలుప బడుచున్నందు వలన నట్లు పల్లవి యేర్పఱుపఁబడినదని యెఱుఁగునది.

ఇట్లు నా సద్గురువువారివలన తత్వబోధ నెఱింగిన వాడనై వారి పాదసేవ చేయుచుండ నొకనాడు, సద్గురుప్రభువువారు నన్ను బిలచి వారి యనుగ్రహము వలన నేను నేర్చుకున్న యాధ్యాత్మిక బోధ సార మును యొక పుస్తక రూపముగా లిఖించి ప్రచురింప వలసినదని నాకు యాజ్ఞ నొసంగిరి. అంత నాపని నాశక్తికి మించినదిగా నాకు గాన్పించి నందున వారితో నాకు, ప్రచురింపగల సమర్థత లేదని నా యసమర్థ త్వమును వెల్లడి సేయగా నేను ప్రయత్నము చేసిన కొలదిని భగవంతు

డట్టి సమర్థతను కలుగ జేయునని వారు ఆశీర్వదించిరి. అప్పటినుంచి-వారి యాశీర్వాదమునందు గురి గలవాడనై ప్రయత్నించి "ఆంజనేయ సద్గురు బోధామృత సార" మను నీ చిన్ని పొత్తమును లిఖించుటకు సద్గురువు వారిపై భారము వేసి బింకముతో నతి సమర్థునివలెఁ బూను కొంటిని. అట్లు చేయుటలో మాసద్గురు ప్రభువు వారు సెలవిచ్చిన, దారక, సాంఖ్య యోగ సహిత ఆధ్యాత్మిక బోధ మహామహులైన పురుషులవల్ల నిదివరకే యనేక విధములుగ దెలుప బడి యున్నవియే యైనను జనన మాదిగనుండు దట్టమైన యజ్ఞానాంధకారమునఁబడి కొట్టు కొనుచున్న నావంటి యజ్ఞానులకు అట్టి స్థితిలో మహామహులవలన దెలుపబడిన తారక సాంఖ్యాద యాధ్యాత్మిక జ్ఞాన బోధ నొక్క సారిగ చేపట్టి గ్రహించు సమర్థత గలుగు నావకాశము లేకుండినందున నట్టి యజ్ఞాన దశాస్థితిని వివరించి, భగవత్తత్వమును ముందు దెలిపి యీ యజ్ఞానమును పోనడచుటకు పెద్దల వలన నేర్పరుపఁబడిన మార్గములఁజూపుచు, నాధ్యాత్మిక బోధ నెరుంగవలెనను కుతూహలము నంకురింపఁజేసి, జ్ఞాన మార్గమం దభిరుచిని గలుగ చేసి మహామహుల వలన దెలుప బడిన యాధ్యాత్మిక బోధను సులభముగా గ్రహింప నావకాశముండునటుల నాకు తెలిసినంతవరకు సద్గురువు వారి కరుణకు పాత్రుడనై నేనొక మొనగాని వలె నీ పొత్తమును లిఖింపఁగలిగితిని. ఇట్లు చేయుటలో నెక్కుడు జ్ఞానవంతుడను కాని కారణము చేత తెలివి తక్కువగా నెచ్చట నైనను తప్పులు పడి యుండ వచ్చును. విజ్ఞాన వంతులగు మహా మహులు మాటలు వచ్చీ రాని స్థితిలో సద్గురువు వారి యాజ్ఞోల్లంఘన చేయక వారి సంకల్పమును కొనసాగించు ముఖ్యోద్దేశముతో నీ పుస్తకము వ్రాయ సమకట్టిన యీ యజ్ఞాని తప్పులను సైరించి, వారి కరుణకుఁబాత్రునిగా జేసి, ఆదరించి ప్రోత్సహించు నుద్దేశ్యముతో నీ తప్పులను సవరించు విధములను దెలుపుచు జ్ఞానమును గలుగఁజేసిన యడల వారి యభిప్రాయాను సారముగ సవరించి కొని నాకు జ్ఞానమును గలుగ చేసినందులకు వారికి ననేకాభివందనముల సమర్పింప నుద్యుక్తుడనై యున్నాఁడనని వినయపూర్వకముగ మనవిఁజేయుచుంటి.

ఈ పుస్తకమును నాలుగు ప్రకరణములుగ విభజించితిని.

———:o:———

ప్రథమ ప్రకరణమందు :—అజ్ఞాన నిరూపణ ; దానిని బోనడచు మార్గములు ; భగవత్తత్త్వము ; భక్తి యోగమును

ద్వితీయ ప్రకరణమందు :—భగవంతుని స్థితి ; బ్రహ్మాండ జీవసృష్టి వివరణ ; సాంఖ్యయోగ విచారణ ; కర్మయోగమును

తృతీయ ప్రకరణమందు :—గురు స్వరూపము ; జ్ఞానయోగము, విజ్ఞాన బోధ ; మహా వాక్య విచారణయును

చతుర్థ ప్రకరణమందు ;—సద్గురు బోధామృతసారమును వివరింపబడినది.

ఇట్లు,

ఏలూరు. కంభమ్మెట్టు సోమబ్రహ్మానందరావు.



•

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

నగురోరధికం

## పరబ్రహ్మ స్తుతి

### కీర్తన.

1. నిగమ గోచరా! నిరంజనా! ఓ। నిగమాతీతా! నమోనమో।
నిష్కళంకా। నిర్వికారా। నిర్మలాత్మా నమోనమో॥

2. పరమపురుష। యో త్రిగుణాతీతా। భవాబ్ధితరణా। పాపవినాశా।
నిరతానందా। దురిత నివారక। నిర్మలహృదయా నినుధ్యానించెద॥

3. కృష్ణజనార్దన ముకుందమాధవ। కేశవమురారి పరమాత్మా।
కృతాంజలినై నేనీపదముల। కెరగితి బ్రోవుము కృపతో శ్రీపతి॥

## గాయత్రీ స్తుతి

4. ఇక్షుచాప ప్రసూనవిశిఖ పా। శాంకుశ పుస్తకమాణి।
క్యాక్షసరోరుహ మణిమయ వీణా। కరా కరస్థితాభయవరదా॥

5. బ్రహ్మవిష్ణ్వీశ్వరాది దివిజ। ప్రముఖతతిసేవితాం పరాం।
బ బ్రహ్మాండసృష్టికారిణీ! భగవతి సిందూరారుణరూపిణి॥

6. భగవతి నీపాదాబ్జంబులపై। బడి మ్రొక్కిన యీపాదాక్రాంతుని
భయముదీర్చి దాటింపుమి యీ। భవసాగరమునుభవేశ్వరి॥

7. మద్గురు బోధామృతసారమునే। సద్గురునాజ్ఞకు సవినయుండనై
ఔదలదాల్చి లిఖింపబూనితి। హృదయంబున నిల్వుమి యోభారతి॥

## సద్గురు స్తుతి

8. గురుమహారాజ గురుమహారాజ। గురుప్రభుశ్రీమత్పరమహంసపరి।
వ్రాజకాచార్యసచ్చిదానంద। జైజోగీశ్వర ఆంజనేయప్రభో॥

9. యుష్మచ్చరణం భూయాచ్ఛరణం। యుష్మచ్చరణం మమభవ
హారణం।
యుష్మచ్చరణం మోక్షదాయకం। యుష్మచ్చరణం మమసర్వం॥

10. భక్తిజ్ఞానవైరాగ్యయోగ । ప్రతిబంధవినాశిని యా ।
ఆత్మజ్ఞాన సిద్ధ్యర్థం । బాతురముతో నీయుండ జేరితివి॥

11. రత్నఖచిత సింహాసనమును యును । రక్తితోడ నామానసంబున ।
రమణీయంబగునటు లమర్చి నీ । రాక కెదురుచూచుచుంటి దేవా॥

12. ఆనందముతో నాహ్వానించితి । యాహ్వానంబును గైకొని యీ ।
ఆసనమున నీ తేజోమూర్తిని । ఆదరముతో మూర్తీకరించుమి॥

13. గురువే బ్రహ్మవిష్ణుమహేశ్వరుడు । గురువే సాక్షాత్పరబ్రహ్మము ।
గురువుకంటె నధిక మేమిలేదు । గురుమయబ్రహ్మమె సమస్తంబును॥

14. ఎక్కడజూచిన నొక్కబ్రహ్మమే । దక్క యితర మీజగమున లేదు ।
నిక్కమునిక్కము నిక్కంచిదిగా । నెరిగితి మరినిదె గురుపదంబనియు॥

15. కరచరణేంద్రియశూన్యంబై । గోత్రసూత్రాకారవికార ।
వర్ణనామజాత్యాదిమధ్యాం । తరహితమై, జననమరణములు॥

16. పుంస్త్రీనపుంస పుణ్యాపాప । తత్వహీనమై, సహజసమరస ।
తత్వ మొకటితో దనరుచునుండు । తత్సద్గురు మహరాజ నమామి॥

17. నీ యాజ్ఞానుసారముగనునే । నీహస్తమును లిఖింపగడంగితి ।
నీ కరుణకు పాత్రునిగా జేసి । నెమ్మదినిల్పి ముగింపజేయుమి॥

18. మద్గురువాదిగ సమస్తగురు సాం । ప్రదాయమునకిడువందనములచే ।
నందుచునాశీర్వాదంబులను । పొందుగ యనుగ్రహింపవేడితిని॥

గణనాయక స్తుతి

19. పార్వతీపరమేశతనూజ । సర్వకార్యసాఫల్యదురంధర ।
భవదీయకృపావీక్షణముతోనన్ । బారజూచినా మొరాలకించుమి॥

20. లంబోదరనా లేఖనకా । ర్యంబున కే విఘ్నంబురాకుండ ।
అంబాసుతనేనిన్ బ్రార్థించెద । నన్ బ్రోవుమి నాప్రార్థనగైకొని॥

ఓం.

శ్రీ సద్గురుభ్యోనమః

నగురోరధికం.

# శ్రీ
# ఆంజనేయ
# సద్గురు బోధామృత సారము.

## ప్రథమ ప్రకరణము.

---

చతుస్సముద్రములచే నావరింపబడియున్న యీ భూమండల మందు మనము జన్మించినదాదిగ జరాయుజ (మావి వలన బుట్టినవి), అండజ (గుడ్డువలన బుట్టినవి). స్వేదజ (చమట వలన బుట్టినవి). ఉద్భిజ్జము (భూమిని బద్దలు చేసికొనిపుట్టినవి) లయిన మానవ, మృగ, పశు, పక్షి, క్రిమి, కీటక, తరు, గుల్మ, లతాదులను యెనుబది నాలుగు లక్షల జీవరాసులను మనకంటితో జూచుచున్నాము. ఈ యెనుబది నాలుగు లక్షల జీవరాసులలో మానవజన్మ ముత్తమ జన్మగా నెంచబడుచున్నది. ఏలయన, నితర జీవరాసులన్నింటికిని నియతమైన (మితి గలిగిన) జ్ఞానశక్తిమాత్రమే అనుగ్రహింపబడి మానవులకు నియతము లేక (మితిలేక) క్రమక్రమముగ ప్రయత్నముచేసిన కొలదిని అభివృద్ధిని జెందుస్వభావము గలిగిన జ్ఞాన మనుగ్రహింపబడియున్నది.

పూర్తి అజ్ఞానమును నియత జ్ఞానమును గలిగిన యితర జీవరాసుల జన్మలన్నియు నెత్తిన పిదప యీ మానవజన్మ నెత్తించి మానవుల కట్టినియతములేని జ్ఞానమును అనుగ్రహించుట చూడగా, యీ జన్మమందు దానిని సరిఅయిన త్రోవలయందుపయోగించి వారి వలన జూడబడు నీ ప్రపంచమును గురించి పెద్ద విచారణజేసి యేదియో నేర్చుకొని జరుపవలసిన భారమొకటి వారియందు యేర్పాటుచేసి దీనిని అనుగ్రహించినటు లూహించవలసియున్నది. అట్లుచేయక

యుపేక్షించిన " జ్ఞానేనహీనః పశుభిః సమానః " అనుయార్యోక్తి ననుస రించి అట్టి మానవులకును పశువులకును భేదమించుకయు లేనట్లు పెద్దలు పల్కుచున్నారు. ఇదియునుంగాక " పరోపకారాయ ఫలంతి వృక్షాః । పరోపకారాయ వహంతి నద్యః । పరోపకారాయ చరంతి గావః । పరోపకారార్థ మిదం శరీరం " అను నార్యోక్తి ననుసరించి యీ ప్రపంచములో పైన చెప్పబడినవన్నియు యేదోవిధముగా ప్రపం చమున కుపకారము చేయుచున్నట్లు కనఁబడుచుండగా నీ శరీరమునిచ్చి జ్ఞానశక్తినిగూడ మానవుల కనుగ్రహించినది యీ ప్రపంచోపకారము నిమిత్తమే యని యెంచక తప్పదు. కర్తవ్య మిట్లులుండ మనము అట్టి విచారణ చేయుటకు లేశమైన సావకాశము నేర్పరచుకొనుటకు ప్రయ త్నముచేయక మనజీవితము యావత్తును వృధాపుచ్చుచుంటిమి. ఎట్లు లన మన జీవితములో మొట్టమొదటిదైన బాల్యదశయందు పూర్తి యయిన అజ్ఞానముతో గూడుకొని ఆటపాటలయందుతప్ప మరవేం యందును దృష్టిపోక సంచరించుటవల్లను ఆదశ వదలి యౌవనదశ ప్రారంభించిననాటనుండి, కలిగిన జ్ఞానాంకురమైనను సరియయిన త్రోవను బెట్టక ప్రపంచ సంబంధమైన స్త్రీలోలత్వములో జిక్కి సంతానవృద్ధి బడయుచుండుటలోను ఆదశపోయి కౌమారదశవచ్చి నప్పటినుండి సంసార బంధములలోఁ దగులుకొని శరీరశ్రమజేసి ధనము సంపాదించి కుటుంబపోషణ చేసికొనుటలోను, పిమ్మట వార్ధక దశలో సైతము కుటుంబ సంరక్షణకై పాటుబడుటకు ఇతరులున్నను సంసారమందలి మమకారమును వీడలేక ఆ బంధములలో జిక్కుకొని బయటబడుటకు సామర్థ్యములేనివారమై సంసార సాగరమునఁబడి గిలగిల తన్నుకొనుచుంటిమి. తుద కెవ్వరికిని తెలియకుండ కాలమాసన్నము కాగా మృత్యువాతనుబడి చనిపోవుటయు తటస్థించుచున్నది.

ఇట్టులే జరుగుచుండుటవలన యెన్నటికిని సంసార సాగరమును దాటి కృతార్థుల మగుటకు వెరవుగానక తిరుచు పుట్టుచు జచ్చుచు అనేక జన్మపరంపరలను బొందుచుండుటయేగాని యీ ప్రపంచములో పుట్టినందుకు మనము చేయవలసిన పనిని చేయుటలేదు కాన మన కను గ్రహింపబడిన యీ జ్ఞానశక్తిని యుపయోగించి మనకంటియెదుటనున్న

యీ ప్రపంచమును గురించి విచారణజేసి దానివలన మనమెరుంగవలసిన యంశములను తెలిసికొని మానవకోటి అనుభవించు భవసాగరమును దాటుటకు తగిన వెరవును వెదకికొనుచు మనము కృతార్థులమగుటయేగాక యీ మానవకోటినంతయు నుద్ధరింపజేయుట మన కర్తవ్యాంశమని యెఱింగి మనకు నియమింపబడిన పనిని పూర్తి చేయుటకు ప్రయత్నించి దానివలన మనమేమి ఫలితమును బొందుదుమో చూడవలయును. మునుముందు మనము జూచు తరుగుల్మలతాది సహితమైన యీ ప్రపంచమును గురించియు, అందలి యెనుబదినాలుగులక్షల జీవరాసులయొక్క చిత్రవిచిత్ర స్థితిగతులను గురించియు, పరిశీలింతము. ఇట్టి విచిత్ర సృష్టిగల జీవరాసులతో గూడిన ప్రపంచమెట్లు వచ్చినది? దీని నేర్పరచుట కెవరైన కర్తలుండిరా? ఉన్నయెడల వారెట్టివారు? వారి స్థితిగతులెయ్యవి? ఈ ప్రపంచ సృష్టి యెందులకు జేయబడినది? దానివలన మనము నేర్చుకొనవలసినది యేమిటి? అనునవి ప్రస్తుత విచారణకు ముఖ్యాంశములు.

సృష్టిచేయబడిన యెనుబదినాలుగులక్షల జీవరాసులలోను ఏజాతి పోలిక యాజాతికేగాని మరియొక జాతికి లేక, యేజాతికాజాతి వేర్వేర నానావిధములగు రంగులతోను రూపములతోను సృష్టింపబడుట మన మందరము జూచుచున్న యంశమేకదా! ఇంతియుగాక మరియొక చిత్రమైన యంశమేమన యీజాతులలో స్త్రీ పురుష వ్యక్తులేర్పరుపబడి వాని కలయికవలన ఇతరజాతి వ్యక్తిగాక ఆజాతి వ్యక్తియే ఆయా వర్ణరూపముల కేమాత్రమును భేదములు లేకుండ జన్మించుచుండుటయు మనము జూచుచుంటిమిగదా! మఱియు మిగిలిన వృక్ష లతాదులలో సైతము యేయే జాతిబీజములు భూమియందు నాటితిమో వానికి ఇతరజాతి తరుగుల్మలతాదులు బుట్టక ఆయా జాతిరంగురూపములతో మొక్కలు మొలచుచుండుటయుగూడా జూచుచుంటిమికదా! ఆహా! యిదియెంతటి యాశ్చర్యమో యాలోచింపుడు!

ఇట్టి కట్టుదిట్టములు ఏర్పాటుచేసి ఆకట్టుదిట్టముల కేమాత్రమును భంగపాటులేకుండ నీప్రపంచ సృష్టిని నడుపుచుండుటకు కర్తలెవరైన నొకరుండి తీరవలయునుగదా? ఏలయన మన మొకప్పుడు

ఆ ప్రపంచకర్తయైన మహానీయునికి నిర్గుణస్థితి-సగుణస్థితి అని రెండు స్థితులు గలవు. అందులో నిర్గుణస్థితిలో నుండునంతకాల మీప్రపంచమనునదియే యుండదు. అందు దానొక్కడే అద్వితీయుడై నామ, రూప, గుణాది వికారము లేమియులేక యుండును. ఇట్లు కొంత కాలముండిన పిదప ఆయనకు తన లీలా వినోదార్థమై ప్రపంచ సృష్టిని చేయవలెనను సంకల్పము కలుగును. అట్లు సంకల్పము కలుగగనే సత్వ, రజ, స్తమోగుణములను కలిగిన "మాయ" ను తనయందు గలవాడై సగుణస్థితిని బొంది నామ, రూప, గుణాది వికారములను గలవాడగును అట్టి స్థితిలో "సగుణ బ్రహ్మము" అని పిలువఁబడును. అంతట ఆయునయందున్న మాయ ఆయన సాన్నిధ్యమున నిలచి భగవదిచ్ఛ ననుసరించి మన కంటి యెదుట గనబడు నెనుబది నాలుగు లక్షల జీవరాసులతోఁగూడిన వృక్ష, లతాది సహితమైన యీప్రపంచమును సృష్టిజేయును. ఇట్లు జేయఁబడిన సృష్టిలో "మాయ" సూత్రధారియై నిలచి ఆసగుణబ్రహ్మ వినోదార్థము జీవులమగు మనచే ప్రపంచ నాటక మాడించుచు లీలలను గల్పించి యాయనకు ఆనందము కలుగజేయుచుండును. ఆ సగుణబ్రహ్మ మాసృష్టియందు నిలచి ఆలీలలఁజూచి యానందించుచుండును. కొంతకాలమట్లు ఆనందించిన పిదప తిరిగి సంకల్ప రహితుడగును. అట్లు సంకల్ప రహితుడుకాఁగానే తిరిగి తాను నిర్గుణ స్థితిని బొందును. అంత బ్రహ్మాండభాండమంతయు అంధకార బంధురముగాఁగా తానందు యథాప్రకార మద్వితీయుడై నిలచును. అదివరకులేని ప్రపంచమును గల్పించుటయే "సృష్టి" యనియు దానిని వృద్ధిబొందించుటయే "స్థితి" యనియు, దాని నేమియు లేకుండ జేయుటయే "లయము" అనియు చెప్పబడుచున్నది. ప్రతి సృష్టి, స్థితి, లయాంతమే ప్రళయ మనియు, అదియే నిర్గుణ స్థితిని బొందుట యనియు నెరుంగునది.

ఆ భగవంతుడు నిర్గుణ స్థితిలో నామరూపములు లేనివాడైనను వాడుకలో "కృష్ణుడు" అని బిలువబడుచున్నాడు. ఈయన సగుణ స్థితిలో నుండునపుడు "శ్రీకృష్ణుడు" అనియు ఆయన మాయాశక్తి "శ్రీకృష్ణ శక్తి" యనియుఁ బిలువబడుచున్నట్లు తెలియువచ్చుచు-

న్నది. అనగా యాదవ వంశమున దేవకీదేవి కుమారుడైన "కృష్ణుడు" అని పొరపాటు పడకుడు. ఈ సగుణ స్థితిలోనుండు "శ్రీకృష్ణుడు" "సగుణ బ్రహ్మము, పరమాత్మ" యను పేర్లతోఁ గూడఁ బిలువఁ బడుచుండును. పైన చెప్పిన యాదవ కృష్ణుడీ సగుణ బ్రహ్మమగు శ్రీకృష్ణుడే కాడుగాని, ఈయన అవతారాంశయే యని యెరుంగునది. ఆ యాదవ కృష్ణావతార మెత్తవలసివచ్చినప్పుడు తన ప్రకృతియైన "రాధ" ను తనకన్న ముందుగా భూలోకములో "వృషభానుడు" అనువానికి పుత్రికగా జన్మించవలసినదని శ్రీకృష్ణ పరమాత్మ రాధతో చెప్పగా ఆమె "శ్రీకృష్ణుడవైన నీవుగాని, రాధనైన నేనుగాని, భూమండలములో నెన్ని అవతారము లెత్తవలసివచ్చి యెత్తినను, నీపేరు కృష్ణుడే యనియు, నాపేరు రాధయే యనియు ఇందుల కెట్టి మార్పును లేకయుండునట్లు వరమీయుమని" కోరగా, ఆవర మొసంగి నందువలన, యాదవ వంశములో నెత్తిన అవతారమునకుకూడ "శ్రీకృష్ణుడు" అను నామము వచ్చినది. ఆసమయమున ఆమెకుకూడ "రాధ" యను నామమె వచ్చినది. కనుక సగుణ బ్రహ్మమైన శ్రీకృష్ణుని యింతటినుండి సగుణ బ్రహ్మము" అనిగాని "పరమాత్మ" యనిగాని "శ్రీకృష్ణ పరమాత్మ" యనిగాని పిలుచుకొనుచుందము.

ఈదిగువ దెలుపబడిన "గోలోక వర్ణన" మొదలుగ భగవత్తత్త్వము తుదివరకు "కృష్ణావతార తత్త్వము" అను గ్రంధమును రచించిన బ్రహ్మశ్రీ కావ్యతీర్థ జనమంచి శేషాద్రి శర్మగారికి అనేక అభివందనము లాచరించుచు అందలి సారాంశముల ననుసరించి పాఠకుల యుపయోగార్థము ఇందు జేర్చబడినవి. "ఆ సగుణ బ్రహ్మమగు శ్రీకృష్ణ పరమాత్మ మూల ప్రకృతిచే సృష్టి చేయబడిన బ్రహ్మాండ భాండ సృష్టి కతీతంబై దానికి పైభాగంబున యేలోకమును లేక శూన్యంబై అంధకార బంధురమైయుండి అందు జొర నెవ్వారి కశక్యంబైయున్న తావున నిర్గుణంబుగను, నిర్మలముగను, విశాలముగను నుండునటుల రాధికా వాంఛితంబుతీర్ప తన యిచ్ఛామాత్రమున "గోలోకము" అనుపేర నొక లోకమును నిర్మించుకొని తన నిత్య విహారస్థానముగా నేర్పరచుకొని, యందుండునని దెలియవచ్చుచున్నది.

ఆ గోలోకమునకు చుట్టును, విరజానది యను నొక నది ప్రవహించుచుండును. ఆ నదీతీరమునందు లోపలి భాగమున నూరు శృంగములు గలిగిన యొక పర్వతము ఆగోలోకమునకు చుట్టును నొకకోట యాకారమును బొంది యొప్పుచుండును. అందు అనేక దేవతా వృక్ష సముదాయములు క్రిక్కిరిసి నట్లుండును. ఆ పర్వత శిఖరమున ఆశ్చర్యమును గలుగజేయుచు, పదియోజనముల విస్తీర్ణము గలిగి ప్రఖ్యాతి వహించిన "రాసమండలము" అనునది యొకటిగలదు. ఆరాసమండలమును జుట్టి అనేక పరిమళ పుష్పజాతులతో గూడిన తీగెలతో నొప్పు నుద్యానములును పెక్కు గలవు. అందు రాధాదేవి తన చెలికత్తియలైన గోపికలతో గూడి శ్రీకృష్ణ పరమాత్మ పాదారవింద నిరంతర భక్తిని వెల్లడి చేయుచు విహరించుచుండును. ఆ రాసమండలము చెంత గోలోకము నావరించి వలయాకారముగ శ్రీరాధా మాధవులకు నిత్య విహార యోగ్యంబై పరమ పవిత్రమై యొప్పు బృందావనము గలదు. అందు శ్రీకృష్ణ పరమాత్మ తన లీలా విహారములను సల్పుచు మనోమోదమును సదా గల్పించుచుండుననియు, అది అయిదు యోజనముల విస్తీర్ణము గలిగి ఆవిర్భావ, తిరోభావములు (పుట్టుట, గిట్టుట) గలదియై తేజోమయమగు స్థానమై, మానవ చక్షువులకు గానరానిదై, అతిరహస్యమై, బ్రహ్మాది దేవతలకునైన సులభముగా దెలియుటకు నలవిగానిదై యుండుననియు, దేవతా స్వరూపమైనదనియు, శ్రీకృష్ణ పరమాత్మ సకల బ్రహ్మాండ భాండముల యందంతయు వ్యాపించియుండు భగవంతుడే యైనను, నా బృందావనమం దెక్కువ ప్రీతిగానుండుననియు దెలియవచ్చుచున్నది.

"ఇట్లు పరమ పవిత్రమైన రాసమండల, బృందావనములతో నొప్పు నీ గోలోకము, భరత ఖండమున బుట్టి నూరు జన్మములందు, పట్టుదలతో తపస్సుచేసి సమస్త కర్మ ఫలితములను భగవంతుని కర్పణముచేసి, సర్వకాల సర్వావస్థలయందు శ్రీకృష్ణ పరమాత్మయందు నెడతెగని నిర్మల భక్తిని గలిగి తన్నామ స్మరణమును సదా జేయుచు, తమకు భూలోకములోనున్న తనువులను వదలి, యీలోకమును జేరి, దివ్య తనువులను బడసి సదా శ్రీకృష్ణదర్శన ఫలితానందంబులచే నొడ

లెరుగక యుండు పుణ్యాత్ములతోను, పరమాత్మ పాద పద్మములను తమ మనోవీధుల నెల్లప్పుడు నిల్పుకొని, ఏకాంత భక్తితో ధ్యానము చేయు భక్తవరులతోను, శ్రీకృష్ణ పరమాత్మ దివ్య శరీరములను బోలిన తనువులను గలిగిన భక్త పార్షదులతోను, విలసిల్లుచు, జరా మరణ భీతిలేని జీవ జంతువులను గలిగి సర్వోత్కృష్టమై, ఆశ్చర్యమును గలిగించునదియై యుండును. ఇందు రాధాకృష్ణ కింకరులకు నివాస యోగ్యమగు, పెక్కు మేడలు గలిగి, వాని మధ్యభాగంబు రాధాదేవి యొక్కయు, శ్రీకృష్ణ పరమాత్మ యొక్కయు, సౌధంబులచే నొప్పు చుండును. శ్రీకృష్ణ పరమాత్మ సౌధ మధ్యభాగంబున మనోహరతమ మైన యొక సింహాసనంబున అద్భుతమైన యొక తేజోరాశి ప్రకాశించు చుండ శ్రీకృష్ణ పరమాత్మ యాజ్యోతిర్మయుండై యుండునని దెలియ వచ్చుచున్నది.

"ఈ గోలోకంబున నొకనాడు శ్రీకృష్ణ పరమాత్మ, రాస మండలమందు జగత్కారణ భూతుడైయుండి, విహరించుచుండగా, ఆదిసృష్టియందు ఆయన యెడమ భుజ శిఖరమునుండి యొక దేవి పుట్టెను. తిరిగి వెంటనే భగవదిచ్ఛవలన ఆదేవి రెండు రూపములా యెను. ఆరెంటిలో యొకటి "రాధిక" యనియు, రెండవది "మహా లక్ష్మి" యనియు నెరుంగబడుచున్నది. అంత నారాధిక పరాత్పరుడగు శ్రీకృష్ణుని ద్విభుజుడుగా నుండునటుల వరించెను. మహాలక్ష్మి యా పరా త్పరునే మనోహరాకారుడుగను, చతుర్భుజుడుగను నుండునటుల వరించెను. ఇట్లు వరింపగా వెంటనే శ్రీకృష్ణ పరమాత్మ ఆ యుభయుల యిచ్ఛా సాఫల్య పూర్తికై లీలా పరిగృహీత దేహుడు గావున తాను రెండు రూపములు ధరించి, యొకదాన ద్విభుజుడుగను, రెండవదాన చతుర్భుజుడుగను అయి ఆ చతుర్భుజుండగు శ్రీహరికి మహాలక్ష్మి నొసంగి నీవు లక్ష్మీకాంతుడవై మహావిష్ణువనుపేర వైకుం ఠమునందుండి లోకపాలనము చేయుచుండుమని పలికెను. ఈయనయే నారాయణుడనుపేర శ్వేతద్వీపమునగూడ నుండును. పిమ్మట ద్విభుజు డగు శ్రీకృష్ణుడు ఆ రాధిక తనకు ప్రకృతియై నిత్యాన పాయినియై యెల్లప్పుడు తన చెంతనుండ గోలోకమున నుండెను. అంత నా శ్రీకృ

ష్ణుడు లోమరంధ్రములనుండి లెక్కించుటకు సాధ్యములేని సంఖ్యను గలిగి గోపాలకులు శ్రీకృష్ణుని వయస్సుతో సమాన వయస్సుగలవారలై ప్రాణ మిత్రులుగను భక్త పార్షదులుగనుండ, రాధికా లోమ వివరంబులనుండి పెక్కుమంది గోపకన్యక లామె వయస్సుతో సమాన వయస్సు గలవారై బుట్టి వారికి పరిచారకులై సేవించుచుండ, శ్రీకృష్ణ పరమాత్మ రాధికా కాంతుడై గోలోకమున విలసిల్లుచుండెను. అట్టి తరి శ్రీకృష్ణుని శరీరమునుండి 'దుర్గ' యను నొక శక్తి యుదయించెను. ఈమెయే విష్ణుమాయ యనియు, సనాతని యనియు, జగన్మాత యనియు, సర్వమంగళప్రదాయిని యనియు ఖ్యాతి వహించెను. ఈమెయే దేవీ సముదాయమునకు బీజ స్వరూపిణి యనియు, తేజ స్వరూపురాలు, పరిపూర్ణురాలు, త్రిగుణాత్మిక యనియు దెలియఁబడు చున్నది. ఈమెయే అనేక విధములైన శస్త్రములచేతను, అస్త్రముల చేతను, అలంకరింపబడిన వేయి చేతులు గలదియై, మూడు నేత్రములు గలదై, సమస్త ప్రపంచ వృక్ష బీజస్వరూపురాలై శాశ్వతముగానుండు దేవతయై యున్నట్లు తెరుంగబడుచున్నది. ఈమె పుట్టగానే రత్న సింహాసనమున గూర్చుండుమని శ్రీహరి గౌరవించెను.

తదుపరి శ్రీకృష్ణుండు రెండు రూపను లాయెను. అందులో యెడమవైపు సగము శరీరము అయిదు ముఖములు, మూడు నేత్రములుగల మహాదేవుండుగను, కుడివైపు సగము శరీరము, గోలోక నాథుండగు శ్రీకృష్ణుండుగనుండెను. అంత నామహాదేవుండు శ్రీకృష్ణుని స్తుతించి ఆయన కెదురుగానుండు సింహాసనము నధిష్టించెను.

ఇట్లుండగా శ్రీహరి నాభి కమలమునుండి స్త్రీ సహితుడై నాలుగు ముఖములు గలవాడై, జ్ఞానవంతులలో శ్రేష్ఠుడై "ఓం" కారమును జపించుచు కమండలమును చేత బట్టుకుని తపోనిష్ఠ గలవాడై బ్రహ్మ యుదయించెను. ఆయన తన భార్యయైన సావిత్రితో గూడి శ్రీహరిని వేదవాక్కులతో అనేక విధముల స్తుతించెను. అంత శ్రీహరిచే నియమింపబడిన రత్నపీఠ మందతఁడుఁ గూరుచుండెను.

"మరి కొంత కాలమునకు శ్రీకృష్ణపరమాత్మ ముఖమునుండి సరస్వతి యుదయించెను. ఆమె తన కరములయందు వీణెను పుస్తకము ను ధరించియుండెను. అంత శ్రీకృష్ణపరమాత్మ యా సరస్వతినిజూచి నీవు వైకుంఠమునయందు చతుర్భుజుండగు నారాయణు నాశ్రయించి లక్ష్మికి చెంతనుండుమని యాజ్ఞాపింపగా, నామె ఆయనకు నమస్కరించి నారాయణుని వద్దకు వైకుంఠమునకు బోయెను.

"బ్రహ్మను జూచి శ్రీకృష్ణపరమాత్మ, నీవు సత్యలోకము నివాసముగా జేసికొని అందు నన్ను సదా స్మరించుచు సృష్టిచేయుచుండు మని పలుక, నాపద్మభవుడు హరి యానతిగైకొని నమస్కారము జేసి సత్యలోకమునకు బోయి సృష్టిచేయ నారంభించెను.

"అంత మహాదేవుని జూచి ఓయీ శంకరా! యీ దుర్గను నీ యొద్దయుంచుకొని శివలోకమున ప్రమథగణంబుల కధిపతివై యుండి నీవు తపస్సు చేసుకొనుచుండుము. సృష్టి కంత్య కాలమున దానిని సంహరింపుమని పలుక యా మహాదేవుండు వల్లెయని శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కరించి దుర్గా సహితుడై శివలోకమునకు బోయెను. ఈయనకు రెండు దేహములు గలవని మహర్షులు చెప్పుచున్నారు. అందులో నొకటి ఘోర రూపము. రెండవది శాంత రూపము. ఘోర రూపము రుద్రనామమును ధరించి జగత్సంహార కార్యమును నెరవేర్చును. శాంత రూపము బ్రహ్మచర్యాది తపోనియమమున నుండును.

ఇట్టులా సగుణ బ్రహ్మమగు శ్రీకృష్ణ పరమాత్మ సత్యలోకమున బ్రహ్మను సృష్టికర్తగను, వైకుంఠమున మహావిష్ణువును పాలన కర్తగను, శివలోకమున మహాదేవుని లయ కర్తగను, శ్వేత ద్వీపమున నారాయణాహ్వయుండై నారాయణ ముని యనుపేర "శాంతి" యే లక్ష్మి రూపమున ధర్మిష్ఠయై, ధర్మమె నరుండనగా, పరమ పావన క్షేత్రంబగు భరత వర్షంబున ధర్మమును బోధించుచు, ధర్మము నాచరించుచు, ధర్మ ప్రవర్తకుండుగ నుండుచు, తపోనిష్ఠ నుండునటులను నియమించి, నిజాంశ జనితులైన సావిత్రిని బ్రహ్మకును, మహాలక్ష్మిని

సరస్వతిని మహావిష్ణువునకును, దుర్గను మహాదేవునికిని, స్త్రీ ప్రకృతు లుగానుండి సృష్ట్యాదికార్యములయందు సహాయినులుగానుండి వర్తించు చుండునటులఁ జెప్పి యీ ప్రపంచ సృష్టి, స్థితి, లయ నిర్వాహకత్వము జరుపుచుండునటుల యేర్పాటు చేసెను.

వీరలందరు నామ, రూప, భేదములు గలవారలేగాని, ఆత్మ భేదములు గలవారలు గారు. ఇందలి పురుష వ్యక్తులందరు శ్రీకృష్ణాంశ జనితులనియు, స్త్రీ ప్రకృతులందరు మూల ప్రకృత్యాంశ జనితులై. ఆయా లోకములనుండ శ్రీకృష్ణ రాధిక లిరువురు గోలోకమున నుందు రని యెఱుంగునది.

దీనినిబట్టి చూడ, శ్రీమహావిష్ణువును, మహాదేవుడును శ్రీకృ ష్ణాంశ జనితులైయుండగా, నిందులో నొకరు గొప్పవారని మరి యొకరు కొద్దివారని, భావములు మదిని గల్పించుకొని వైష్ణవులు, శైవులు, అను రెండు తెగలవారు కలహములకు కాలు ద్రవ్వుట వట్టి వెఱ్ఱితనముగా గాన్పించుచున్నది. దీని నెఱింగి యైనను, నట్టి వెర్రితన మునకు చోటియ్యక యుండుట, యుభయులకు శ్రేయస్కరముగా తోచుచున్నది.

ఇట్లు సృష్టి, స్థితి, లయ నిర్వాహకత్వముల కేర్పాటు చేసిన యా "పరాత్పరునకు" "నారములు" అనగా "జలములు" నివాస స్థానముగాన "నారాయణుఁడు" అను పేరు గలిగెను. ఆ నారాయణ మూర్తి సర్వ బ్రహ్మాండ భాండంబులం దంతటను వ్యాపించి ప్రభువై యుండి, నిర్గుణుఁడు, సగుణుఁడు నయి యీ క్రింద చెప్పబడిన విధముగా నాలుగు మూర్తులుగా విభజనయై యున్నటుల నెఱుంగునది. నిర్గుణ తత్త్వము-మొదటమూర్తి. శుక్ల వర్ణమును బొంది, ఇట్టిదని యూహింం చుటకు నావకాశములేని స్థితిలో నుండునని వర్ణింపఁబడుచు, యోగు లకు జ్యోతి స్వరూపుడై ధ్యానింప దగినవాడుగా నొప్పుచు, నామ, రూప, గుణాతీతమని చెప్పదగిన స్థితిని గలిగి, కృష్ణ నామమును వహించి, నిర్మలత్వముతో ప్రకాశించుచుండును. కనుకనే యిది పరి శుద్ధమని, సుప్రతిష్ఠైక రూపమని చెప్పఁదగి యున్నది.

సగుణ తత్వము, రెండవమూర్తి. ఆదిశేషుడను పేరును గల్గి, తామసి యని లెక్కింపబడుచు, తిర్యక్త్వమును బొంది, భూమిని తన తలతో మోయుచున్నది.

సగుణ తత్వము, మూడవమూర్తి. ప్రజా పరిపాలకత్వమును వహించి, సత్వ స్వభావమును గలిగి, ధర్మ సంస్థాపన చేయునదియై, కర్మమును జేయుచున్నది.

సగుణ తత్వము, నాల్గవ మూర్తి. జల మధ్య స్థితిని బొంది పన్నగతల్పశాయియై యుండి సృష్టి నొనర్చుచుండును. ఇదియే రజోగుణ ప్రకృతి.

ఏయే కాలమందు అధర్మము వృద్ధియై, ధర్మ నాశనము గలుగునో అప్పుడు మూడవ మూర్తి భూమండలమున నవతరించి తిరిగి ధర్మస్థాపనము చేయుచుండును.

ఆ మూర్తియే మత్స్యరూపమును దాల్చి, వేదముల నపహరించి సముద్రమున దాగిన సోమకాసురుని జంపి వేదముల తెచ్చి బ్రహ్మకు నొప్పగింత జేసెను. ఆ మూర్తియే వరాహరూపమును దాల్చి భూమిని చాపగా జుట్టుచున్న హిరణ్యాక్షుని వధించి భూమిని కాపాడెను. ఆ మూర్తియే నృసింహ రూపమును దాల్చి హరి భక్తుడై సదా హరిని భజించు తన కుమారుడైన ప్రహ్లాదుని బాధించు హిరణ్యకశిపుని విప్రజిత్యాది దానవ సహితముగా బొలియించి ప్రహ్లాదుని గాపాడెను. ఆ మూర్తియే వామన రూపమును దాల్చి స్వమాయచే బలిచక్రవర్తిని బంధించి త్రిలోకముల నాక్రమించెను. ఆ మూర్తియే జమదగ్ని మహర్షికి బుత్రుడై జన్మించి రామ నామమును ధరించి తన తండ్రి మరణమును స్మరించి కౄర క్షత్రియుల నందర వధించెను. ఆ మూర్తియే దశరథ మహారాజునకు బుత్రుడై జన్మించి శ్రీరామ నామమును ధరించి మూడు లోకములను చికాకు పరచు రావణాసురుని పుత్ర మిత్ర కళత్రముగా సంహరించెను. ఆ మూర్తియే అత్రి మహామునికి దత్తాత్రేయుడను పేరుతో బుట్టి అలర్కుడను మహాత్మునకు సాష్టాంగ యోగము నుపదేశించెను. ఆ మూర్తియే యే సమయమున సృష్టి

యావత్తు లయమై సర్వ బ్రహ్మాండ భాండములును జలమయముల గునో, అప్పుడు సర్వలోకములను తన యుదరమున నుంచుకొని ఆ జల మధ్యమున పన్నగ శాయియై సహస్ర యుగ పర్యంతము యోగనిద్ర నాశ్రయించియుండి సకాలమున కాల శక్తిచే ప్రేరితుడు కాగా తన నాభి కమలమున చతుర్ముఖములు గలిగిన బ్రహ్మను నుదయింపజేసి యథాప్రకారముగ సర్వ బ్రహ్మాండ భాండములను మరల సృష్టి చేయించుచుండును.

ఆ మూర్తియే ప్రద్యుమ్నుడను నామముతో లోక రక్షణ కృత్యమును సదా చేయుచుండును. ఇట్టులే యనేక చిత్ర విచిత్ర కార్యముల నొనరించుచుండును. ఆ మూర్తి, దేవ, మనుష్య, తిర్య గ్యోనులలో దేనిని బొందినను పరాత్పరు నిచ్ఛ ననుసరించి యాయా స్వభావముల గలిగియుండును.

ఆ మూర్తియే భగవద్భక్తులచే బూజింపబడుచు, వారి కోరికల నెల్ల దీర్చుచుండును.

ఇట్టులా ప్రపంచకర్తయైన భగవంతుని స్థితిగతులను గురించియు, తత్వమును గురించియు తెలిసికొనిన వారలమై ఆ భగవంతుడును, సగుణ బ్రహ్మమును నగు శ్రీకృష్ణ పరమాత్మను తెలిసికొని తదనుగ్రహమును సంపాదించు మార్గాన్వేషణమునకై ప్రయత్నింతము. ఇదివరలో అట్లు ప్రయత్నముచేసి కడతేరిన వార లెవరైనను గలరా యనిన, అనేక గ్రంథముల యందట్టి భగవద్భక్తుల చరిత్రముల చూచుచు, చదువుచున్నారము. కాన కలరనిచెప్పుట కెంతమాత్రమును సందియములేదు. కాని యీ సందర్భములో నొక చిన్ని యంశమును మీకు జ్ఞప్తికి తేకుండుట సమంజసముగాదు. కాన దానినిచట దెలుపు. చున్నాడ.

మనలోనే దట్టమైన యజ్ఞానములో మునింగియున్న కొందరు " భగవంతుడు కలడని చెప్పినంత మాత్రమున దృష్టాంతము లేకయే నమ్ముటకు వీలులేదనియు, ఒకవేళ భగవద్భక్తులను నొక తెగవారు ఆ భగవంతుని కనుగొన గలిగిరని చెప్పగలిగినను అదియు పైయంశ మును సమర్థించుకొను కొరకు తాంత్రికముగా చెప్పబడునంశమే గాని

సగుణ తత్వము, రెండవమూర్తి. ఆదిశేషుడను పేరును గల్గి, తామసి యని లెక్క౯ంపబడుచు, తిర్యక్త్వమును బొంది, భూమిని తన తలతో మోయుచున్నది.

సగుణ తత్వము, మూడవమూర్తి. ప్రజా పరిపాలకత్వమును వహించి, సత్వ స్వభావమును గలిగి, ధర్మ సంస్థాపన చేయునదియై, కర్మమును జేయుచున్నది.

సగుణ తత్వము, నాల్గవ మూర్తి. జల మధ్య స్థితిని బొంది పన్నగతల్పశాయియై యుండి సృష్టి నొనర్చుచుండును. ఇదియే రజోగుణ ప్రకృతి.

ఏయే కాలమందు అధర్మము వృద్ధియై, ధర్మ నాశనము గలుగునో అప్పుడు మూడవ మూర్తి భూమండలమున నవతరించి తిరిగి ధర్మస్థాపనము చేయుచుండును.

ఆ మూర్తియే మత్స్యరూపమును దాల్చి, వేదముల నపహరించి సముద్రమున దాగిన సోమకాసురుని జంపి వేదముల తెచ్చి బ్రహ్మకు నొప్పగింత జేసెను. ఆ మూర్తియే వరాహరూపమును దాల్చి భూమిని చాపగా జుట్టుచున్న హిరణ్యాక్షుని వధించి భూమిని కాపాడెను. ఆ మూర్తియే నృసింహ రూపమును దాల్చి హరి భక్తుడై సదా హరిని భజించు తన కుమారుడైన ప్రహ్లాదుని బాధించు హిరణ్య కశిపుని విప్రజిత్యాది దానవ సహితముగా బొలియించి ప్రహ్లాదుని గాపాడెను. ఆ మూర్తియే వామన రూపమును దాల్చి స్వమాయచే బలిచక్రవర్తిని బంధించి త్రిలోకముల నాక్రమించెను. ఆ మూర్తియే జమదగ్ని మహర్షికి బుత్రుడై జన్మించి రామ నామమును ధరించి తన తండ్రి మరణమును స్మరించి క్రూర క్షత్రియుల నందర వధించెను. ఆ మూర్తియే దశరథ మహారాజునకు బుత్రుడై జన్మించి శ్రీరామ నామమును ధరించి మూడు లోకములను చికాకు పరచు రావణాసురుని పుత్ర మిత్ర కళత్రముగా సంహరించెను. ఆ మూర్తియే అత్రి మహామునికి దత్తాత్రేయుడను పేరుతో బుట్టి అలర్కుడను మహాత్మునకు సాష్టాంగ యోగము నుపదేశించెను. ఆ మూర్తియే యే సమయమున సృష్టి

యావత్తు లయమై సర్వ బ్రహ్మాండ భాండములును జలమయముల గునో, అప్పుడు సర్వలోకములను తన యుదరమున నుంచుకొని ఆ జల మధ్యమున పన్నగ శాయియై సహస్ర యుగ పర్యంతము యోగనిద్ర నాశ్రయించియుండి సకాలమున కాల శక్తిచే ప్రేరితుడు కాగా తన నాభి కమలమున చతుర్ముఖములు గలిగిన బ్రహ్మను నుదయింపజేసి యథాప్రకారముగ సర్వ బ్రహ్మాండ భాండములను మరల సృష్టి చేయించుచుండును.

ఆ మూర్తియే ప్రద్యుమ్నుడను నామముతో లోక రక్షణ కృత్యమును సదా చేయుచుండును. ఇట్టులే యనేక చిత్ర విచిత్ర కార్యముల నొనరించుచుండును. ఆ మూర్తి, దేవ, మనుష్య, తిర్య గ్యోనులలో దేనిని బొందినను పరాత్పరు నిచ్ఛ ననుసరించి యాయా స్వభావముల గలిగియుండును.

ఆ మూర్తియే భగవద్భక్తులచే బూజింపబడుచు, వారి కోరికల నెల్ల దీర్చుచుండును.

ఇట్టులా ప్రపంచకర్తయైన భగవంతుని స్థితిగతులను గురించియు, తత్త్వమును గురించియు తెలిసికొనిన వారలమై ఆ భగవంతుడును, సగుణ బ్రహ్మమును నగు శ్రీకృష్ణ పరమాత్మను తెలిసికొని తదనుగ్రహమును సంపాదించు మార్గాన్వేషణమునకై ప్రయత్నింతము. ఇదివరలో అట్లు ప్రయత్నముచేసి కడతేరిన వార లెవ్వరైనఁ గలరా యనిన, అనేక గ్రంధముల యందట్టి భగవద్భక్తుల చరిత్రముల చూచుచు, చదువుచున్నారము. కాన కలరనిచెప్పుట కెంతమాత్రమును సందియములేదు. కాని యీ సందర్భములో నొక చిన్ని యంశమును మీకు జ్ఞప్తికి తేకుండుట సమంజసముగాదు. కాన దానినిచట దెలుపు-చున్నాడ.

మనలోనే దట్టమైన యజ్ఞానములో మునింగియున్న కొందరు "భగవంతుడు కలడని చెప్పినంత మాత్రమున దృష్టాంతము లేక యే నమ్ముటకు వీలులేదనియు, ఒకవేళ భగవద్భక్తులను నొక తెగవారు ఆ భగవంతుని కనుగొన గలిగిరని చెప్పఁగలిగినను అదియు పైయంశ మును సమర్ధించుకొను కొరకు తాంత్రికముగా చెప్పబడునంశమే గాన

అట్టులే విశ్వసింప దగినదిగ నుండలేదనియు నందురు. ఏలనన, మానవ కోటినంతయు సమదృష్టిచే జూచి భగవంతుడున్న యెడల, నట్టి పక్షీకర భావమును జూపి, కొందరికి గనబడి మరికొందరికి గనబడక యుండ డనియు, బలుకుచు, భగవంతు డుండుటయే వాస్తవమైన యెడల అట్టి భగవంతుడు తమ కంటికి గాన్పించ నంతవరకు తాము నమ్ముటకు నెంతమాత్రము నావకాశము లేదు."

అనియుఁజెప్పు మూర్ఖవాదులుగూడ నీ ప్రపంచమందు గలరు. భగవంతుని కనుగొన గలిగితిమని చెప్పు భగవద్భక్తుల వలెనే తాము తమ యందలి దట్టమైన యజ్ఞానమును నివృత్తి చేసికొనుటకు తను కనుగ్రహింపబడిన జ్ఞాన శక్తిని ప్రయత్నముచేత శ్రమపడి వృద్ధి చేసుకొని చూచుకొనినగదా దాని పర్యవసానము తెలియుట. అట్టి ప్రయత్నము లేకయే భగవంతుని కనుగొనుట యున నంత సులభముగా నున్నదనియెంచి పలుకు నిట్టి మూర్ఖవాదముల వలన ఫలమేమి రాగ లదు? ఇట్టి సందర్భములో నొక చిన్న ప్రపంచ దృష్టాంతమును చూపించెద. మన జన్మకు నాదియైన మన పుట్టుక యను సాధారణాం శమునే కొంచము విచారించి చూడుడు. మనము మొట్ట మొదట పురుషుని గర్భమునుండి జన్మించితిమో లేక స్త్రీ గర్భమునుండి జన్మిం చితిమో ఆ యంశమే మనము కంటితో చూచి తెలిసికొనుటకు నావ కాశములేక ప్రపంచములో జన్మించు నితరుల జన్మలను జూచి స్త్రీ గర్భవాసమున బుట్టితిమని యెరుంగ గలిగిన వారల మగుచు న్నాము. ఇది యిటులుండ ప్రపంచములో నుండు నందరి స్త్రీలలో నే స్త్రీ గర్భమునుండి మనము జన్మించినది మన కంటితో జూచి యెరుం గుటకు నావకాశ మేమైన గలదా? లేకపోయినను మనము నిత్య కృత్యములో 'అమ్మా' యని పిలుచుచుండు నా స్త్రీ గర్భవాసము నుండి జన్మించితిమని గదా అట్లు, పిలుచుచుంటిమి. మనకంటితో చూడని యీ యంశమును మనమెట్లు నమ్ముచుంటిమి? మనమే స్త్రీకి జన్మించితిమో యది కంటితో జూచిన మన పెద్దల వలన నిప్పుడు "అమ్మా" యని పిలుచుచున్న స్త్రీకి జన్మించితిమని తెలుపబడి, ఆ యంశము మన కంటితో జూడకపోయినను ముందుగా

విశ్వసించి, పిమ్మట ప్రపంచములో నెంతమంది స్త్రీలున్నను అందరిలో నీమె యొక్కతెయే మనల నతి ప్రేమతో సంరక్షణ జేయుచుండుటను మన ప్రయత్నము వలన తెలిసికొని మన పెద్దలవల్ల తెలుపబడిన యీ యంశము ధృవపఱచుకుని సందేహ నివృత్తి జేసికొని మన జీవితములను గడుపుచుంటిమిగదా? ఇట్టియే యే వ్యక్తి కావ్యక్తి చేయుచున్నపని. కాన అట్టి మూర్ఖవాదములకు బోక బుద్ధిమంతులై భగవంతుని తమ కంటితో చూచిననే గాని నమ్మమని చెప్పక తాము జూచినామని చెప్పు భక్తుల మాట ముందు విశ్వసించి యీ యంశమును ధృవపఱచుకొన వలెననే కుతూహలము గలవారలై ఆ భగవద్భక్తులు చెప్పు త్రోవలను నడుచుకొనుచుండి యీ భగవంతుని చూడగల్గు సమర్థతను బొంది చూచి యానందించుట శ్రేయోదాయకము.

ఇదియునుం గాక మరియొక చిన్న యంశమును చూడుడు. మన దేశము నేలు ప్రభువును దర్శించ వలెనని వీధులలో తిరుగు నొక సామాన్యపు మనుష్యునికిని, ఆ ప్రభువువద్ద ఉద్యోగము చేయుచుండు నొక యుద్యోగికిని అభిలాష గలిగిన దనుకొనుడు. వీరిలో ఆ ప్రభువు సేవ యెంతకాలమునుండియో చేయుచున్న హేతువుచేత ఆ ప్రభువును దర్శించుటకు చేయవలసిన పద్ధతులను చాలవరకు తెలిసియున్నవాఁ డాయుద్యోగియుడు. అట్టి పద్ధతుల నేమాత్రము నెఱుంగని వాడీ సామాన్యపు మనుష్యుడు. అట్టి స్థితిలో నీ యిద్దరిలో నెవరికి సులభముగా ప్రభువు దర్శన మగుటకు నావకాశము గలదు? ఉద్యోగియునికి దర్శన మగుట సులభమును సామాన్యపు మనుష్యునకెంతయో శ్రమపడనగాని అంత సులభముగా దర్శనము గాదనియు అందరెరిగిన యంశమేకదా. కాన సామాన్య మనుష్యమాత్రుడైన ప్రభువు దర్శనమునకే యింత తారతమ్యము గలిగియుండ భగవద్దర్శన విషయములో నెట్టులుండునో మీరే యాలోచింపుడు.

కాన యెంతయో శ్రమపడి భగవంతుని దర్శనము నొందుటకు తగు త్రోవల పెద్దలవల్ల తెలిసికొని ఆ మార్గమున నడచుచు సులభముగా భగవద్దర్శనమును బొంద గలిగిన భగవద్భక్తుల వలె నెట్టి

ప్రియత్నమును శ్రీమను చేయని మూర్ఖవాదులైన తమకంత సులభ ముగా దర్శన మీయలేదనే నెపము పెట్టుకొని భగవంతుడు లేనే లేడని చెప్పుట యెట్టి సాహసమో యోచింపుడు. అట్లుగాక యీ మూర్ఖవాదులు సైతము తమ యందలి దట్టమైన యజ్ఞానమును బోనడచుకొను మార్గము నవలంబించుచు, అట్టి శ్రీమచేసి ప్రియ త్నము చేసిన, వారివలె తమకును నా భగవద్దర్శన మగునని నమ్మిక గలవారై ప్రియత్నము చేసిన సఫలమనోరధులగుదురని నా నమ్మిక. నాయనలారా! యింత విశదముగా దెలిసినను అట్టి మార్పును బొంద నిచ్ఛలేక "తాపట్టిన కుందేటికి మూడే కాళ్లు" అను సామెత ప్రికారం తమ మూర్ఖ వాదములను వదలకయున్న యెడల అట్టివారిని "నాస్తికులు" గా నెరింగి వారికి మార్పును కలుగ జేయుటను భగవ త్కృపకే వదలి వేశి ఆ విషయమున అంతటితో ముగించి లోగడ జెప్పిన భగవంతుని యనుగ్రిహమును సంపాదించు మార్గాన్వేషణ ముకై తిరిగి మరలుదము. భగవంతుని యనుగ్రిహము సులభముగా లభించునదికాదు. ప్రిస్తుతము మనకున్న యీ దట్టమైన యజ్ఞానమును ముందు వదలించుకొనవలెను. అట్లుగాక ఒక్కసారిగా యెగిరి భగవం తుని యనుగ్రిహమును సంపాదించ వలెనని ప్రియత్నించుట వట్టి వెఱ్ఱి తనము. ఒకవేళ అట్లు చేసినను నది లభించునదికాదు. చాల యెత్తైన ప్రిదేశములో నున్న యొక వస్తువును అందుకొనవలెనన్న నిచ్చెన వేసికొని ఆ నిచ్చెనకున్న మెట్లన్నిటిలోను క్రింది మెట్టునుండి పైమెట్టు వరకు ఒకటొకటిగా నెక్కి తుదకు పై మెట్టెక్కిన పిదపగదా మనకా వస్తువు చేతి కందునది! అట్టులే దట్టమైన యజ్ఞానమును ముందు వద లించుకొనుట ముఖ్యావశ్యకము. అట్లు చేయుటకు ముందు పైనం జెప్ప బడిన హేతు భూతములను పూర్తిగా జీర్ణింప చేసుకుని భగవంతుడు కలడని నిర్ధారణ చేసికొని తదుపరి ఆయన స్థితి గతులను తత్వమును పూర్తిగా తెలిసికొనిన వారలమై ఆయన యఖండ సామర్థ్యమునకు గౌరవమునిచ్చి ఆయన వలన నేర్పరుప బడిన ధర్మముల నుల్లంఘున చేసిన యెడల రోగబాధ, మృత్యుబాధ, నరకబాధ యను వాని వల్ల మనము బాధపడవలసి వచ్చునని యెరింగిన వారలై ఆయున

యెడల నొక విధమైన భయమును గలిగిన వారలమై యుండఁ
నప్పుడాయన యనుగ్రహమును సంపాదించుటకు ప్రయత్నించవలసిన
తరుణమై యుండునని యెరుఁగునది.

ఆ యనుగ్రహమును సంపాదించుటకు భక్తి ముఖ్యావశ్యకము.
భక్తి యనగా భగవంతుని యందంలి ప్రేమ, విశ్వాసమును కలిగి
యుండుట యని తెలిసికొననగును. పైన చెప్పబడిన భయమును
కలిగియున్న స్థితిలో "భక్తి" యనునది యంకురించును సంసార బంధ
ములలో తగులుకొనియున్న స్థితిలో "భక్తి" అంకురమైన కొంత కాల
మునకు కుటుంబసుఖము, కుటుంబఋచ్చ, జనువాటియందలి "యాశ"తో
వాటికై ఆ భగవంతుని ప్రార్థించుట మొదలగు కార్యములను చేయుచు
రాగా రాగా నానాటికి భక్తి వృద్ధి జెందును- పిమ్మట ఆ కార్యములవలన
గలుగు ఫలితానందములచే భగవంతుని యెడల కృతజ్ఞతను సూచించు
కర్తవ్యబుద్ధిని బడసి దైవారాధనయందు అనురాగము గల వారల
మగుదుము. అప్పుడు భగవద్ధ్యానము, పూజలయం దాసక్తిగలుగును.
భగవంతుడు నిర్గుణ స్థితిలో నామ, రూప, గుణ, రహితుడుగాన, అట్టి
స్థితిలో ఆయనకు ధ్యానము, పూజలు చేయ వీనుబడదు. సగుణ
బ్రహ్మమును ధ్యానించి పూజించిన మనము భగవంతుని యనుగ్రహ
మును పొందగలమని పెద్దలవలన దెలుపబడినది. అందులకే ప్రపంచ
సృష్టితోపాటు సగుణ బ్రహ్మాంశ సంభూతులైన అనేక దేవతా స్వరూ
పములతో నీశ్వర సృష్టి గూడ మానవుల యుపయోగార్థము చేయ
బడినది. గాన ప్రపంచ సృష్టిలోని మానవకోటిలో ప్రతి మనుజుడు
తన యిచ్ఛ ననుసరించి యేదియో యొక దేవతా స్వరూపమును భగ
వంతునిగా నియమించుకొని యా భగవంతుని ధ్యానించుచు పూజలు
చేయుచుండిన యెడల అట్టి ధ్యానపూజలు సగుణ బ్రహ్మముకే చేరు
ననియు, అట్లు చేయువారి కోరికలను వారు వారు పూజచేయుచున్న
యిష్ట దేవతా స్వరూపములతో యా సగుణ బ్రహ్మమే వచ్చి తీర్చు
చుండుననియు పెద్దలవల్ల నెరుంగబడుచున్నది. ఈ కారణముచేతనే
మన పూర్వులు ప్రతి పల్లె, గ్రామము, పట్టణమునందును, ఈశ్వర

సృష్టిలో నేర్పరుపబడిన దేవతా స్వరూపములను గ్రంథములరీత్యా
దెలుపబడిన విధముగ రాతిమీద చెక్కించిగాని, లోహములతో పోత
పోయించిగాని, దేవాలయములను గట్టించి యీ మానవకోటి యువ
యోగార్థమై వానిలో ప్రతిష్ఠలుచేయించి నిత్యము వానికి షోడశోప
చార పూజ, ధూపదీప నైవేద్యాదులు జరుగునటుల యేర్పాటుచేసి
యున్నారు. పైన చెప్పబడిన భగవధ్యానమునందు, పూజయందు,
ఆసక్తిగలుగు స్థితి మనకురాగనే మనయిష్టదేవతా స్వరూపములుగల,
దేవాలయములకు బోయిగాని లేక యట్టి స్వరూపముతో నొక ప్రతి
మను తయారుచేయించి మన యిండ్లయందు నిల్పుకొనిగాని ఆ స్వరూ
పముకు దేవాలయములలో చేయు పద్ధతి ననుసరించి పూజయు, ధ్యాన
మును, నిత్యము భక్తితోచేయుచుండిన యెడల మనలోనుండు దట్ట
మైన యజ్ఞానము నశించి సదా దైవచింతన కలవాటుపడి మనశ్శుద్ధిని
పొంది, భగవదనుగ్రహమునకు పాత్రులమగుదుము. మనముచేయు
ధ్యానము పూజయు నితరులు మనలను చూచి మెచ్చుకోవలెనను
నుద్దేశ్యముతో చేసెయెడల పైన చెప్పబడిన ఫలితములలో దేనికి
అర్హులముగాకపోగా మనశ్శుద్ధికి బదులు అజ్ఞానము మునుపటికంటె వృద్ధి
యగునని తెలిసికొనునది. కాన భక్తికి శ్రద్ధ ముఖ్యావశ్యకమని యెరం
గినవారమై ఆధ్యానము పూజయు శ్రద్ధతోగూడిన భక్తితో చేయు
చుండిన యెడల అంతకంతకు భగవద్భక్తి వృద్ధియై భగవదనుగ్రహ
మును తప్పక సంపాదింప గలుగుదుము.

శ్రద్ధతో గూడిన భక్తి యనగా, నిత్యమును మనము నిద్ర
నుండి లేచినది మొదలు తిరిగి మనము పరుండబోవు సమయము వరకు
చేయు నితర పనులకన్నను మన యిష్ట దేవతాధ్యాన పూజలకే
ప్రాముఖ్యత నిచ్చి, మనమెంత కష్టదశలో నున్నను, మన కతి త్వరిత
ముగా ముగించవలసిన పను లెన్ని యున్నను, మునుముందుగా నీ
ధ్యాన పూజలను జరిపి అటుపిమ్మట మరియొక పనిని చేత బట్టుట
యనియు, ఆ ధ్యాన పూజలు చేయుతరి మన మనోదృష్టుల నటునిటు
చెదరనీయక మన దేవతా స్వరూపమునందే నిలిపి పూజా విధాన
మును జరుపుట యనియు యర్థము. ఈ పూజా విధానమును మొదట

మనము మన పెద్దల వలన నేర్చుకొనునపుడే దానితోఁబాటు లఘు పూజా విధానము, అతి లఘు పూజా విధాన పద్ధతులనుకూడ నేర్చుకొనియుండి మనకుండు సావకాశము ననుసరించిన విధానము చేత స్వల్పకాలమైనను నిత్యము ముందుగా దేవతా ధ్యాన పూజలను నిరాటంకముగా జరుపుచుండుట ముఖ్య కర్తవ్యము. ఇటుల చేయుట వలన మనము తదుపరి చేతబట్టు పనుల సానుకూలత విషయములో భగవదనుగ్రహమునకు పాత్రులమై భగవత్సహాయమును కోరిచేయుట యనికూడ అందుల భావన యని యెఱుంగునది. ఈ ధ్యాన పూజల సందర్భములో నింకొక చిన్న యంశము ముఖ్యముగా తెలుపవలసి యున్నది. అది యెద్దియన:—

సగుణ బ్రహ్మాంశ సంభూతములైన సర్వదేవతా స్వరూపము లలో నొకటి యెక్కువ సమర్థత గలదనియుగాని మరియొకటి తక్కువ సమర్థత గలదనియుగాని లేక, యొక్కొక్క దేవతా స్వరూపము ఒక్కొక్క ఫలితము నిచ్చుననియు, ఆ ఫలితముగాక మరియొక ఫలిత మును బొందుటకు మరియొక దేవతా స్వరూపమునకు ధ్యాన పూజలను జరిపి ఆ ఫలితమును బొందవలసి యుండుననియు తలంచుట వెఱ్ఱితనమే గాని వేరుగాదు. ఏలయన, ఈ స్వరూపము లన్నియు, ఒకే సగుణ బ్రహ్మాంశ స్వరూపములే యనియు, వీనిద్వారా ధ్యాన పూజలనంది ఫలితముల నిచ్చునది యా సగుణ బ్రహ్మమే యనియు ఆయనయే వారు వారు పూజించు నిష్టదేవతా స్వరూపములయందు భక్తి అభి వృద్ధి జెందుటకై ఆయా యిష్టదేవతా స్వరూపములతో వచ్చి ఆయా ఫలితముల నిచ్చుచుండుననియు రూఢిగా నమ్మవలసినది. అట్టి స్థితిలో నీ దేవతా స్వరూపములలో దేనికైనను హెచ్చు తగ్గు సమర్థతలకు సావకాశ మెక్కడిది? దీని నెరింగిన వారలై ప్రతివారును తాము పూజించు తమ యిష్ట దైవమె సర్వ ఫలితముల నిచ్చునని గట్టి నమ్మ కముతో ధ్యాన పూజలను సల్పుచుండవలెను. అట్లు చేయక హెచ్చు తగ్గు సమర్థతలను మది నెంచి యేఫలితమునకైనను నితర దేవతా స్వరూపమును మదిని నిల్పి దానికి ధ్యాన పూజలు సేయదలచు నెడల దానివలన వారతిశయ ఫలితమును బొందకపోగా, అంతవరకు తన

యిష్టదేవతా స్వరూపము నొక్కదానినే తన హృత్కమలమున నిల్పి చేయుధ్యాన పూజలవలన అంతవరకు గలిగిన మన స్థిరత్వమునకు భంగ పాటును కలుగజేసి మనశ్చాంచల్యత నేర్పరచి కొంత నష్టమును కలుగ జేయునని యెరుంగవలెను. ఇట్లు చెప్పుట వలన, తమ యిష్టదేవతా స్వరూపము గాక యితర దేవతా స్వరూపముల యందు అసూయతను గలిగి యుండుమని యర్థముగాదు. అన్ని దేవతా స్వరూపములును సగుణ బ్రహ్మాంశలేయనునది మదిని బదిలపరచుకొని అన్నిటియందును సమాన బుద్ధి గలవారలై యెచ్చటనైనను తమ పూజ నిమిత్తము తమ యిష్టదేవతా స్వరూప విగ్రహము తటస్థింపని యెడల అచ్చట తటస్థించు విగ్రహమునకే తమ యిష్టదేవతా స్వరూపమునే మదిని నిల్పుకొని ఆ యిష్టదేవతా నామములతోనే అసూయత లేకుండ పూజించుట సమంజసమని తెలిసికొనునది. అట్లు చేయుటవలన తన కదివర కేర్పడిన మనోదృఢత చెదరక నిలచియుండుటయే గాక ముందుమెట్టుకు గావలసిన భావదేకత్వ భావన బలపడుటయు, తనకు కావలసిన సమస్త కార్యసిద్ధియు, తన యిష్టదైవము వలననే గలుగు ననియు దూఢిగా నమ్మవలసినది.

ఇట్లుచేయు ధ్యానపూజకు బాహ్య విగ్రహపూజ యని పేరు. భగవంతుని యనుగ్రహమును సంపాదించుట కిది మొదటి మెట్టు. ఈ ధ్యానపూజలను కొంతకాలము శ్రద్ధతో కూడిన భక్తితో చేయుచు రాగా మనము కన్నుమూయుసరికి మన యిష్టదేవతా స్వరూపము మన కంటియెదుట కొంతసేపు నిలచియుండి పిమ్మట మాయమగు స్థితిని బొందుదుము. అట్టి సమర్థతను బొందగలిగి నప్పటి నుండి ఆ యిష్టదేవతా స్వరూపమును మన హృత్కమలమున నిల్పు కొని మానసికముగా ధ్యానము చేయుచు సమస్తమైన అర్చనలను భావనా పూర్వకముగ చేయనగును. దీనికి మానసిక ధ్యానపూజ యని పేరు. యిది రెండవ మెట్టు. ఇంతవరకు దెలిపిన రెండు పూజావిధా నములలో బాహ్యపూజా విధానమునకన్న మానసిక పూజా విధాన మునకు ఫలము మెండు. అనగా బాహ్య పూజా విధానమునకు ఫలము బొత్తిగా లేదని యభిప్రాయ పడకుడు. ఇట్లొక మెట్టు నుండి

మరియొక మెట్టు యెక్కిన కొలదిని, భగవదనుగ్రహమును, నధిక ఫలిత మును బొందగలరని యెరుంగునది.

ఈ ప్రకారముగా బాహ్య, మానసిక పూజా విధానముల కలవడి కొంతకాలము చేయుచురాగా శ్రద్ధయు, భక్తియు, అతిశయించును. అట్టి స్థితిలో తన యిష్టదేవతా పునశ్చరణ మంత్రము నుపదేశింపగల యొక మహానుభావుని చెంతిచేరి వారివలన నా మంత్రము నుపదేశ మును బొంది దానిని ప్రతిదినము పై ధ్యాన పూజాదులతో పాటు కొంతకాలము పునశ్చరణ చేయుటకు ఆరంభించవలెను.

మన మనస్సునకు రెండు స్వరూపములు గలవు. అందులో ఒకటి యజ్ఞాన స్వరూపము. రెండవది జ్ఞాన స్వరూపము.

ప్రపంచ విషయములయం దలవాటు పడిన మనస్సు అజ్ఞాన స్వరూపము గలదియై ఆత్మ పదార్థముగాని శరీరేంద్రియాదులే "యాత్మ" యను నభిమానమును జీవుని కెల్లపుడు గలుగ జేయు చుండును. ఈ అభిమానమునకే "అహంకారము" అని పేరు. మరియు తనదికాని ప్రతి వస్తువును తనది యను నభిమానమును కలుగజేయుచుండును. ఈ యభిమానమునకే "మమకారము" అని పేరు. ఈ యహంకార మమకారములు రెంటినుండి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరంబులు కలుగును. వీనివలన పుణ్య పాప కర్మలు చేయుట తటస్థించును. ఆ కర్మల వల్లనే కర్మ బంధము లేర్పడి, యవి జనన మరణములకు కారణ మగుచున్నది.

భగవ ద్విషయములయం దలవడిన మనస్సు జ్ఞాన స్వరూపము గలదియై భగవదారాధన రూపమగు ధర్మములయందే ఆసక్తిని కలి గించును. ఫలాపేక్షలేని అట్టి ధర్మములే మనస్సును పరిశుద్ధము చేసి జ్ఞాన వైరాగ్యములతో గూడిన భక్తిని కలుగచేయును. ఆట్టి భక్తిని పొందిన మనస్సు పైన చెప్పబడిన పుణ్య పాపములను దొలగించుటయే గాక బంధములను కలుగ జేయు ప్రకృతిని వేరుగాను, ఆ ప్రకృతికిని దాని కార్యములకును విలక్షణుడుగా నుండు పరమాత్మను వేరుగాను, తెలిసికొను సమర్థతను బొందినదియై మోక్షమునకు దారి జూపును.

కావున యీ యంశముల తెలిసికొన వలయును. మనస్సు ప్రపంచ విషయ చింతనలకే పూర్తిగా అలవాటు పడిన యెడల, నా విషయాసక్తి నుండి దానిని మరలించుట చాలా కష్టతరము. గాన అట్టి విషయ చింతనల వలన ఫలము లేదని నిశ్చయించుకొని ఆ చింతలను వదలివేసి మనస్సును భగవంతునియందే నిలుపుట కభ్యాసించుచు పైన చెప్పిన మంత్ర పునశ్చరణను చేయుట కర్తవ్యమని యెరుంగవలెను. అట్లు చేయుటలో ఏకాంత నిర్జన స్థలమందు గూర్చుండి విసుగులేక సదా భగవంతుని ధ్యానించుచుండిన ఆ మనస్సు ఆయనయందే విలీన మగునని శ్రీకృష్ణ భగవానుడు తన యాంతరంగిక భక్తుడైన యుద్ధవునకి నుపదేశించి యున్నారు. ఈ యుపదేశ వాక్యములను మదిలో బదిల పఱచుకొని యీ పునశ్చరణను చేయుచురాగా రాగా కొంత కాలమునకు తన యిష్ట దైవ ప్రతిమయందే మనస్సు స్థిరముగానుంచి తదుపరి నేవస్తువును చూచినను తమ యిష్ట దైవ స్వరూపముగనే కనుబడుటయు తటస్థించును. పైన చెప్పిన విధముగా పునశ్చరణను చేయుటకు మొదలిడక ఎప్పటి కప్పుడు దాని ఫలితముల నసర్గళముగా పొందుచుందురని చెప్పక తప్పదు. అట్లు ఫలితములననుభవించు కొలది భక్తిని వృద్ధిచేసికొనవలెనను నాశయము మెండై దాని కొరకై ప్రయత్నము చేయుటయు తటస్థించును. ఇది మూడవ మెట్టు.

భగవంతుని యనుగ్రహమును సంపాదించుకొనుటకు భక్తి మార్గము, కర్మ మార్గము, జ్ఞాన మార్గము అని మూడు మార్గములు చెప్పబడినవి. అందులో భక్తి యనునది అన్ని మార్గములకు సహాయకారిణి యని యెరుంగునది. అది లేక యేమార్గము వృద్ధిపొందనేరదని రూఢిగా నమ్మవలసినది. వానిలో భక్తి మార్గమును ముందుగ నిచట వివరించుచున్నాడ.

భగవంతుని యనుగ్రహమును భక్తి మార్గముతో సంపాదించి కృతార్థులు గావలెనని చేయు ప్రయత్నమునకు "భక్తియోగము" ని పేరు. భక్తి యనగా భగవంతుని యందలి దట్టమైన నిష్కల్మష ప్రేమ. ఈ భక్తి యనునది భగవన్మాయా గుణంబులైన సత్వ రజస్తమస్సులచేత మూడు విధములుగా నుండును.

ఇతరులు తన్ను గొప్పవాడని చెప్పుకోవలెననిగాని, శత్రువులను బాధించవలెననిగాని, ఇతరుల గుణములను సహించలేని యసూయతో గాని, ఆటోపముతో భేద దృష్టి గలిగి భగవంతుని ప్రీతితో భజియించు భక్తుడు తామస భక్తుడని చెప్పబడుచున్నాడు.

ఈ భూమియందు ధనము, కీర్తి, భోగము, స్వర్గాది ఫలములను గోరి "యీశ్వరుడుపాస్యుడని భేద భావముతో ప్రతిదినము భగవంతుని గొల్చుచుండు భక్తుడు రాజస భక్తుడుగా చెప్పబడుచున్నాడు.

పాపముల నశింపచేసికొను నిమిత్తమో, యీశ్వరాజ్ఞ గనుక తగినదనియో, భేద భావముతో అర్చన రూపకర్మముల భగవంతుని కర్పణ జేయుచు, పూజించు, భక్తుడు సాత్వీక భక్తుడుగా చెప్పబడుచున్నాడు.

కాన యెవరి కేగుణము స్వాభావికమో వారి భక్తికూడ నా తీరుననే యుండునని యెఱుంగునది.

ఇంతవరకు చెప్పబడిన ధ్యాన పూజాదులు తాను వేరు, భగవంతుడు వేరు అను భేద భావముతో గూడిన భక్తియోగమని తెలిసికొనునది.

ఇవిగాక భగవంతుడైన శ్రీరాములవారు తన తల్లియైన కౌసల్యాదేవికి యుపదేశించినట్టుల అధ్యాత్మ రామాయణమువల్ల దెలియబడుచున్న మానసికైక్య నిర్గుణ భక్తియోగ మనియు, సంపూర్ణ భక్తియోగ మనియు రెండు యోగములు గలవు.

ఈ యోగములకు జీవాత్మ, పరమాత్మ స్థితి గతులను గురించిన జ్ఞానము కొంతవరకు ఆవశ్యకముగాన దాని నిట వివరించెద.

భగవంతుడని చెప్పబడు ఆత్మ రెండు విధములుగా నెరుంగబడుచున్నది. అందులో ఒకటి, ఈ ప్రపంచమందలి సర్వ భూతముల లోపలను వెలుపలను నిండి నిబిడీకృతమై వ్యాపించియుండి "పరమాత్మ" యను పేరుతో నెరుంగబడుచున్నది. రెండవది, ఆపరమాత్మయే రేణు రేణువులుగా విభాగమై సర్వ భూతములయందు వేర్వే

రుగా "అంతర్యామి" యై నిలచి "ప్రత్యగాత్మ" యను పేరుతో బరగుచు ఈశ్వర శబ్దవాచ్యమై యున్నది. ఈ ప్రత్యగాత్మయే భూత ముల యందలి ప్రాణములను ధరించినదియై "జీవాత్మ" గా నెరుంగ బడుచున్నది. ఈ జీవాత్మ యనునది పరమాత్మయొక్క శరీర భూతమై యున్నదనియు, జీవాత్మయొక్క స్వభావసిద్ధమైన స్వరూపము ఆ శరీ రాధిష్ఠితమైన పరమాత్మ వల్లనే కలుగుచున్నదిగాని మరి యే యిత రేనమువల్లను కలుగట లేదని యెరుంగునది.

"అన్ని భూతములయందు ప్రత్యగాత్మయను పేర బరగుచు అంతర్యామియై యుండి "జీవాత్మ" యను పేరువడసిన తనకును, సర్వ భూతముల లోపలను, వెలుపలను వ్యాపించియుండు "పరమాత్మ" కును ఎట్టి భేదమును లేదను జ్ఞానమును సంపాదించిన వారలై పరమాత్మ యందలి "సర్వజ్ఞత్వము, సర్వ శక్తిత్వము" మొదలుగా గల ధర్మములు తనవిగా భావించుట వలన అనంత కల్యాణ గుణ నిల యుండైన భగవంతునియం దవిచ్ఛిన్నముగ గల్గు "మానసికైక్య నిర్గుణ భక్తి" చే చేయు యోగము "మానసికైక్య నిర్గుణ భక్తియోగమని" చెప్పబడుచున్నది. భేదబుద్ధి రహితంబైన యీ యోగము సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యంబులనియెడు చతుర్విధ ముక్తులను గల్పింపం జాలియుండును. ఈ యోగము నభ్య సించువారు "సదా భగవన్నామము సంకీర్తనము జేయుచు, పుణ్యకథల శ్రవణము జేయుచు, చిత్తశుద్ధిన బడసి, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ మనంబుల నేకాగ్రతను బొందించి నామోచ్చారణము కథాశ్రవణము చేసినంత మాత్రముననే శరీరము పులకరించును. మనస్సు కరిగిపోవును. కండ్లనుండి యానంద బాష్పములు రాలును. అట్టి ఏకాంత స్థితిలో కంఠము గద్గదిక వడును. ఒకప్పుడు నవ్వు, మరియొకప్పుడు ఏడుపు గను బడుచు, సిగ్గునొందక, యొకప్పుడు పాడుట, మరియొకప్పుడు దేహ స్మార కము తప్పియుండుట తటస్థించుననియు, ఇవియే నిజమైన భక్తుని లక్ష ణములనియు, అట్టి స్థితిలోనుండు వారలే, కర్మ వాసనల వదలిన వారలై, తన జ్యోతిర్మయ రూపమును గాంచ గల్గుదురనియు, శ్రీకృష్ణ భగ

వానుడు తన యాంతరంగిక భక్తుడైన యుద్ధవుని కుపదేశించినట్టు గ్రంథములవల్ల గాన్పించుచున్నది.

పైన చెప్పబడిన చతుర్విధ ముక్తులనుగూడ గోరక, భక్తులగువారు "నాసేవమాని నాయందైక్యము" అను నైదవ ముక్తిని బడయుదాక భజియించుచుందురనియు, ఇట్లు చేయుటయే "సంపూర్ణ భక్తియోగమ" నియు ఈ యోగముచే త్రిగుణములను రూపుమాపి, సముద్రమునందు చేరు గంగోదకమువలె తనలో గలియఁగలడనియు, భగవంతుడైన శ్రీరాములవారు దెలిపిరి. ఈ యోగ సంబంధములో ఇంకను శ్రీరాములవారు తన తల్లి కుపదేశించిన యుపదేశ వాక్యముల నీక్రింద దెలుపుచున్నాడ.

"బ్రహ్మాండ భాండ మందలి సమస్త ప్రాణికోటులందు నేను ఆత్మనై యుండగ జ్ఞానహీనుడైనవాడు తనలో నున్న నన్ను కనుగొనలేక తన చర్మచక్షువులకు అగుపడు ప్రతిమలు మొదలగు బాహ్య వస్తువులకు పూజచేయు కోరిక గలవాడై అందు నిమిత్తమై అనేక విధములైన పుష్ప, ఫల, ధూప, దీప నైవేద్య వస్తువులను అర్పించును. అందువలన నాకు నెక్కువగా సంతోషము గలుగదనుట నిజము.

అన్ని భూతముల యందు నేయుండ, ఆ సంగతి తెలిసికొనలేక వానియందు లేననియు, తాను పూజించు విగ్రహమునందే యున్నాననియు, భూతములకన్న యా ప్రతిమలకే యెక్కువ గొప్పతనము గలదనియు, నెవ్వరు తలంతురో వారు భూతముల కవమానము గలుగజేయు వారలగుచున్నారు. కాన వారెంతగా ప్రతిమల యందు నన్ను పూజించినను నేను పూజసేయఁబడనివాడననియే యెంచ నగును. ఎంతవరకు అఖిల భూతములయందు నేను గలనని గుర్తింపలేక యుందురో అంతవరకే ప్రతిమలయందు శ్రద్ధతో గూడిన భక్తితో నన్ను పూజ సేయుచుండవలసినది. పరమాత్మనైన నాకును, తనకును, భేదము గలదను భేద బుద్ధి యెంతకాలము మనుజున కుండునో అంతవరకు తనకు మృత్యువు వలన భయము తప్పదని యెరుంగవలయును.

"అన్ని భూతములయందు వేరు వేరుగ విభాగుడనై అంతర్యామినై యున్నట్టియు, అవిభాగుడనై సర్వవ్యాపినై యున్నట్టియు,

నన్ను ఒక్కనిగానే యెంచి జ్ఞానముతో గూడిన మనస్సు గలవారలై, చేతనుండను, చిన్మయుండను, నిర్మలుండను అయిన నేనే జీవరూపముతో నున్నానని యెరింగి, అది కారణముగా ఈశ్వరుండైన నాకును, జీవరూపియైన జీవునకును నే సమయమందుగాని యేవిధముగా గాని భేద భావంబును జూపక యెల్లప్పుడు బుద్ధిమంతులగు వారలు సకల భూతములకు మానసంబున నమస్కరించుచు, స్నేహభావముతో భేద బుద్ధి లేకుండ నన్ను బూజించుచుండవలయును.

"గొప్పదియును, ఫలవాంఛా రహితంబును, స్వధర్మాచరణ రూప ప్రసిద్ధ కర్మ యోగంబును, హింసను చేయకుండుట, అసత్య వస్తువును విసర్జించుట, విషయములయం దిచ్ఛ లేకుండుట, సాదు జన సమాగమంబు, ఆర్త జనుల గాపాడుట, తనతో సమానులగు వారితో స్నేహము చేయుట, యమ నియమాసనా ద్యష్టాంగ యోగముల నభ్యసించుట, వేదాంత వాక్యముల దెలసి కొనుట, నాదర్శనము చేయుటం నన్ను ప్రార్థించుట, నన్ను పూజించుట యం దాసక్తిని గలిగియుండుట, నన్ను ధ్యానించు చుండుట, నాకు నమస్కరించు చుండుట, నా నామ సంకీర్తనము చేయుచుండుట, సత్పురుషులతో సహవాసము చేయు టయు, నిష్కాపట్యమైన నడవడి గలిగియుండుట, అహంకారమును త్యజించుట, నా ధర్మమగు సచ్చిదానంద భావము నందాసక్తి యుంచుట, అను నీ సద్గుణములు గల మనుజుడు పరిశుద్ధ హృదయము గలవాడగును. తానుండు తావైన పుష్పము నుడిచి గాలి వీవగనే అందలి సువాసన ఘ్రాణేంద్రియమైన నాసికను జేరు విధంబున నీ యోగాభ్యాస మహిమచే నాలో నైక్యము గలవాడగును.

ఈ భక్తియోగము వలన కృతార్థులు గాదలచిన వారలింయు దెలుపబడిన పద్ధతుల నాశ్రయించి తుట్ట తుదకు శ్రీరాములవారి వలన తెలుపబడిన వం యిందు జేర్పబడిన యుపదేశ వాక్యముల జీర్ణింప జేసికొని సంపూర్ణ భక్తియోగము నవలంభించి కృతార్థులు గావలసి యుండును.

అటులచేయ సమర్థతలేని వారలకు శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి భగవద్గీత 18 అధ్యాయములు బోధ జేసి చిట్ట చివరకు దెలిపిన యుప

దేశ వాక్య మేమన "సర్వ ధర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణం వ్రజ । అహంత్వా త్సర్వ పాపేభ్యో । మోక్షయిష్యామి మాశుచః॥

తా॥ పుణ్యా పుణ్య రూపములగు సకల ధర్మముల సన్యసించి, అనగా సర్వ కర్మ సన్యాసమును గావించి, అద్వితీయుడును, పరమాత్మయు నగు నన్ను అశ్రయముగా బొందుము. నేను నిన్ను సమస్త కర్మములనుండి విముక్తిని బొందింపగలను. దుఃఖము నెంతమాత్రమును బొందవలదు. ఈ యుపదేశ వాక్యములోని భక్తిమార్గము నవలబించి నను కృతార్థు డగుననని యెరుంగునది.

కృతార్థు లగుటకు చెప్పబడిన, భక్తి, కర్మ, జ్ఞాన యోగంబులు మూడింటిలోను భక్తియోగము మిగిలిన రెంటికంటె చాల సులభమైనదని యెరుంగునది. అది యెట్టు లనిన :—

దీనికి ముఖ్య సాధనమగు "తెంపులేని భక్తిని" సంపాదించిన వారలై యెడతెగని సాధు సంగమము, భగవంతుని స్తవము, కథా శ్రవణము, పాదారవిందముల మనోవీథిని నిల్పి చేయు మానసిక పూజ, ధ్యానము, భజనలను విసుగులేకుండ ఆచరణలో బెట్టుటయు గలిగి క్రమ క్రమముగా సమాధి స్థితిని బొందినవారలై పాదారవింద మనెడి నావ నాధారము జేసికుని యీ సంసార మనెడు మహా సముద్రమును నితర సాధనములతో పలె, శ్రమ లేకయే భగవంతునిచే రక్షింపబడుచు, నొక లేగదూడ పాదమును దాటుట యెంత సులభమో అంత సులభముగా దాటుదురని భగవంతుని వల్లనే దెలుపబడియున్నది.

ప్రథమ ప్రకరణము.

సంపూర్ణము.

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

నగురోరధికం.

శ్రీ

# ఆంజనేయ సద్గురు బోధామృతసారము.

## ద్వితీయ ప్రకరణము.

---

ఇదివరలో భగవంతునికి నిర్గుణ స్థితి యని, సగుణ స్థితి యని రెండు స్థితులు గలవని చెప్పియుంటిని. అందులో నిర్గుణ స్థితి యనునది మాయావిరహితమై నామ రూప గుణములు మొదలగు వికారములేవియు లేనిదై వాక్కునకుగాని మనస్సునకు గాని గోచరము కానిదై, జగత్సృష్టికి కారణభూతమై యున్న యొక తత్వముగా నెరుంగబడుచున్నది. ఈ తత్వమును కొందరు కాల స్వరూపమనియు, కొందరు ఆనంద స్వరూపమనియు, కొందరు సత్య స్వరూప మనియు, కొందరు తేజ స్వరూపమనియు, మరి కొందరివి యావత్తు కలసిన స్వరూపమనియు, వారి వారికి తోచినట్లు చెప్పియున్నారు. కాని యిదిట్టిదని ఘంటాపథముగా నిర్ధారణ చేసి చెప్పుటకు సమర్థత చాలని వారలై, యెట్టకేలకు, విసుకును జెంది యే స్వరూపమైన నేమి యేదో యొక పరతత్వ మనిరి. ఈ తత్వమునకు పోలిక గలిగినది మరియొకటి లేదియు లేదనిరి. దీని యునికికి కారణ మిదియే గాని యితర మేమియు లేదనిరి. ఈ తత్వమే అన్ని కారణములకును అన్ని బీజములకును కారణముగా నున్నదనినుడివిరి. ఈతత్వ మెవరివల్లనుసృజింపబడ లేదనిరి. దీనికి ప్రభువు మరియొక రెవరు లేరనియు, తనంతట తానే ప్రకాశించునది యనియు, సిద్ధాంతము జేసిరి. ఈ తత్వమును గురించి ఉపనిషత్తులు, శ్రుతి స్మృతులు, పురాణములు, ఇతిహాసములు మున్నగు వానిలో విరళముగా దెలుప ప్రయత్నము చేయబడినదే గాని తుట్ట తుదకు

పై సిద్ధాంతమే యవలంబింపఁబడెను. ఇట్టి మాయా విరహితమును, నామరూప గుణాది రహితమును, అవాఙ్మానస గోచరమును, అయిన తత్త్వమునే వాడుకలో నుపయోగించు కొనుకొరకు "పరబ్రహ్మము" "కృష్ణుఁడు" అను నామములతో బిలుచుచు, నాతత్త్వ స్థితిని "పరబ్రహ్మమునకు" నిర్గుణ స్థితి యని చెప్పుచున్నారు. కావుననే యాపరబ్రహ్మమును "న యితి" అనగా "ఇది కాదు, అది కాదు", అను నర్థముగల, అవ్యక్తుఁడు, అనంతుఁడు, ఆది మధ్యాంత రహితుఁడు, నిరంజనుఁడు, నిర్గుణుఁడు, నిర్లిప్తుఁడు, నిరాకారుఁడు, సర్వసాక్షి, సర్వమయుఁడు, సర్వవ్యాపి, సర్వాంతర్యామి అను పదములచే వ్యవహరించుచున్నారు. ఈ నిర్గుణ స్థితియందు ప్రపంచ మనునదియే లేక అంధకార బంధురమై యుండునని వర్ణించుచున్నారు. ఇట్టి స్థితిలో ఆ పరబ్రహ్మము కొంత కాలముండి తన లీలా వినోదార్థము తాను నానావిధ రూపములతో గూడిన ప్రపంచాకారముగ మాఱదలచినవాఁడై, దాని సృష్టి, స్థితి, లయ రూపమైన రజ, స్సత్త్వ, తమోగుణము లను మూఁడు గుణములను స్వీకరించి తాను సుగుణ స్థితిని బొందెను. అందులో రజో గుణము, ప్రవర్తన స్వభావము గలది. సత్త్వగుణము ప్రకాశక స్వభావము గలది. తమో గుణము మోహన స్వరూపము గలది. ఆ త్రిగుణములనుండి త్రిగుణాత్మకమై ప్రకృతి పరిణమించెను. ఇట్లు ప్రకృతి పరిణమించగనే బ్రహ్మమునందు మాయ ప్రవేశించినదని చెప్పుచున్నారు. ఈ ప్రకృతి యనునది పాల యందలి తెల్లదనము, శిలల యందలి కఠినత్వము, అగ్ని యందలి వేడిమి, మంచు నందలి చల్లదనము, సూర్యుని యందలి యుష్ణము వలెనే వేరు చేయుబడుటకు వీలులేక పరబ్రహ్మమునందే లీనమై యుండునని చెప్పుచున్నారు. ఇట్లు లీనమై యుండు ప్రకృతి, పాలలో చక్కెర గలుపబడియుండు స్థితిలో చక్కెర స్వరూపము పైకి గనబడక, యొక పాలస్వరూపమే పైకి గనబడుచున్నను, ఆ పాలలో చక్కెర కలసియున్నదను సంశయము అట్లు కలియుటవలన పాలకుగలిగిన మాధుర్య గుణమువలననే తెలియనగుచున్నట్లు పరబ్రహ్మమం దీ ప్రకృతియనునది ప్రవేశించినదను సంశయము తిదుపరి యీ ప్రకృతి వలన చేయబడు ప్రపంచ సృష్టివల్లనే తెలియనగును గాని వేరు సాధ

నము లేదు. పరబ్రహ్మము " ం " అను గుర్తుతోను మాయ (ప్రకృతి) " ఓ " అను గుర్తుతో దెలుపబడుచు, నీ ప్రకృతిని గలిగిన పరబ్రహ్మ స్థితిని " ఓ " అను గుర్తుతో తెలుపబడుచున్నది.

ఈ ప్రకృతినే మూలప్రకృతి యని చెప్పుచున్నారు. ఈ ప్రకృతి తిరిగి " అమలసత్వప్రధాని మలినసత్వప్రధాని, " అని రెండు విధములైనది. అందులో అమలసత్వ ప్రధాని యనునది శుద్ధ సత్వస్వరూపము గలిగి చంద్రుని యందలి చంద్రికబోలె పరబ్రహ్మము నెడబాయక, యందే నిలచి లోకులకు బ్రహ్మజ్ఞానమును బోధించుటకు కారణమగుచున్నది. మలిన సత్వప్రధాని యనునది హెచ్చుతగ్గులులేని గుణసామ్య స్థితిని బొందియున్న సత్వ, రజ, స్తమోగుణ, స్వభావమునుగలిగినదియై పరబ్రహ్మము నెడబాసి, అధోముఖంబై, పరబ్రహ్మ సంకల్పాను సారముగ ప్రపంచ సృష్టిచేయుటకు కారణమగుచున్నది.

తిరిగి యీ మలిన సత్వ ప్రధానియను మలిన ప్రకృతికి " చిత్తు, అచిత్తు " అను రెండు స్వరూపములు గలవు. వానికి " సూక్ష్మావస్థ యని, స్థూలావస్థయని, " రెండు అవస్థలు గలవని చెప్పుచున్నారు. వీనినే వరుసగా, " కారణావస్థయని, కార్యావస్థ " యని గూడ బిలచుచున్నారు. అందులో కారణావస్థయనునది, నామ, రూప, విభాగము చేయబడుటకు వీలులేకయుండు సూక్ష్మావస్థయనియు, కార్యావస్థ యనునది నామ, రూప, విభాగము చేయబడుటకు తగినస్థితిలోనుండు, స్థూలావస్థయనియు నెరుంగబడుచున్నది.

కాన పరబ్రహ్మమునకు సంకల్పము గలుగగనే యీ మలిన ప్రకృతి యీ చిదచిత్తులను రెండు స్వరూపములను తనయందు సూక్ష్మావస్థలో గలిగినదియై బయలువెడలి వానిని స్థూలావస్థను జెందించి జగదాకారముగ పరిణమింపజేయు పరమాత్మ అందు సాక్షీ మాత్రుడై నిలచి, అట్టి ప్రపంచమందు మాయ సూత్రధారియై యుండి అందుల జీవులచే నాడంచు మాయా నాటకముల జూచి యానందించుచు ఆ మాయా నాటకములో జీవులుచేయు, సుకృత దుష్కృత కార్యముల ఫలముల విభాగించుచుండుననియు, దెలియుచున్నది. కాన యీ నామ రూపాత్మకమైన యావత్తు సృష్టియు ప్రకృతి యధీనమనియు

ప్రకృతి, పరమాత్మ స్వరూపమైన పురుషునియధీనమనియు నెరుంగునది. ఇట్లీ ప్రకృతి పురుషుల వలన యొకరికిని దెలియ నలవిగాని ప్రవర్తనచే నీ జగన్నిర్మాణ కార్యము జరుపబడు స్థితి భగవంతుని "ప్రవృత్తి" స్థితి యని యెరుంగునది. ఇంక "నివృత్తి" స్థితిని గూడా స్వల్పముగా దెలిపి తదుపరి యీరెంటిని విరళముగా దెలిపెదను.

పరమాత్మ యీ సృష్టి చేయవలెనను సంకల్పమునుండి విముఖుడు కాగానే, యీ ప్రకృతి అంతవరకు తాను స్థూలావస్థను జెందించి జగదాకారముగ నేర్పరచిన చిద చిత్తులను తిరిగి సూక్ష్మావస్థను బొందించి, వానిని తనయందు లీనము చేసికొని, తాను బోయి యాపరమాత్మ స్వరూపమగు పురుషునియందు లీనమగును. తదుపరి యథాప్రకారముగా ప్రకాశించ వానునదియే లేక సర్వ బ్రహ్మాండ భాండములు జలమయములై అంధకార బంధురమై యుండును. ఆ విరాట్పురుషుండు యోగ నిద్రాపరవశుండై, అవగా తన్ను తా ధ్యానించుకొనుచు నా జలార్ణవమందు వటపత్రశాయియై యుండును. ఇది భగవంతుని నివృత్తి స్థితియని యెఱుంగునది —— ఇట్లుసహస్ర సంవత్సరములు యోగ నిద్రననుభవించిన పిదప కాలశక్తిచే ప్రేరేపింపబడ, తిరిగి సృష్టి చేయు తలంపు గలవాడై, కాలశక్తిచే పూర్వము తనయందుంచబడిన లోక కారణ భూత సూక్ష్మ చిద చిత్తుల నవలోకించును ఆ సూక్ష్మ వర్గము కాలానుగుణ్యముగ వికసించిన రజోగుణముచే సృజింపబడి, పద్మ రూపముగా పరిణమింపబడును. ఆ పద్మము సహస్ర సూర్యకాంతి గలదియై ప్రకాశించుచు నా విరాట్పురుషుని నాభీకమలమును బొందు, నందుండి బ్రహ్మ యుదయించి యా విరాట్పురుషుని యనుజ్ఞ ననుసరించి యంతవరకు ఆయనలో లీనమై యున్న చరాచర సహితమైన సమస్త లోకములను యథాప్రకారముగ సృజించును. ఇది తిరిగి పునః సృష్టియని యెరుంగునది——అది వరకు లేని ప్రపంచమును ప్రకాశింప జేయుటయే సృష్టియనియు, అట్లు ప్రకాశింప జేసిన ప్రపంచమును వృద్ధి నొందించుటయే స్థితి యనియు, ఆ ప్రపంచమును తిరిగి యేమియు లేకుండ జేయుటయే "లయ" మనియు నెరుంగునది. ఈ సృష్టి స్థితి లయ

నిర్వ్యాహకత్వ స్థితియే పరబ్రహ్మమునకు సగుణ స్థితియని తెలిసికొన వలెను.

ఈ సందర్భములో అంత బ్రహ్మాండమైన సృష్టిని ప్రకృతి తన యందు సూక్ష్మ స్థితిలో నిముడ్చుకొనుట యెట్లు? ఆ యావత్తు సృష్టితో తాను బోయి పరమాత్మయందు లీనమగుట యెట్లు? అని సందేహించవలసిన పనిలేదు. దీనికి వట వృక్ష సాదృశ్యమును దీసికొని విచారింపుము. వట వృక్ష మనునది శాఖోప శాఖలతో శాఖాబాహుళ్య మైన వృక్షమై యెంత భూభాగము నాక్రమించునో చూచితిరిగదా! ఆ వృక్షముయొక్క ఫలములు దానికి తగినవికావు. ఆ ఫలములలోని బీజములు ఆ ఫలములకు తగినవిగావు. ఎంత స్వల్పములుగా నుండునో చూచితిరిగదా! అట్లు తగినవిగాని అంత స్వల్పముగా నుండు బీజములలో అంత బ్రహ్మాండమైన వృక్షమును బుట్టించుటకు తగిన శక్తి యిమిడి యున్నదిగదా! అట్లులే యావజ్జీవకోటి సహిత బ్రహ్మాండ భాండములా వటవృక్ష బీజముల వలెనే అణువులైన బీజరూపమున చిన చిత్తులయం దిమిడింపజేసి వానిని సూక్ష్మావస్థను బొందించి, ప్రకృతి తనయందు లీనము జేసికొని తాను బోయి పరమాత్మయందు లీనమగునని దెలిసికొనునది.

ఇట్లు భగవంతుని ప్రవృత్తి నివృత్తి స్థితుల నెరింగిన వారలైన పిదప నా ప్రకృతి సృష్టి వివరములను విరళముగా వివరించెదను.

సృష్టి సంబంధములో శ్రుతి, "బ్రహ్మణో౽వ్యక్తం, అవ్యక్తాన్మహాత్, మహతో౽హంకారః అహంకారాత్ పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రాభ్యః పంచమహాభూతాని, పంచమహాభూతేభ్యో౽ఖిలం జగత్" అనియు, "ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో౽న్నం, అన్నాత్ పురుషః (దేహము) అని చెప్పబడుచున్నది.

పరబ్రహ్మమునకు సంకల్పము గలుగగనే ఆయనయందు ప్రకృతి బుట్టిన విధమును పైన దెల్పియుంటినిగదా! అట్లు పుట్టిన చిన్న ప్రకృతి యను మాయ తనంతట తాను పరబ్రహ్మమునందు

బుట్టినందున, ఆయర్థము నిచ్చు పదమైన "అవ్యక్తము" అని బిలువబడుచున్నది. దీనినే బ్రహ్మమునం దవ్యక్తము బుట్టినదని చెప్పుచున్నారు.

ఇట్లు మాయ, తనయందు ప్రవేశింపగనే బ్రహ్మము నామ, రూప, గుణములు గలవాడాయెను. ఈ స్థితిలో "శ్రీకృష్ణుడు" అను పేరుతో బిలువబడుచున్నాడు. అంత తన సంకల్పానుసారము ప్రపంచ సృష్టిని చేయుట వలన గలుగు దోషములు తనకు జెందకుండునటుల, తన మాయను (ప్రకృతిని) సృష్టి నిమిత్తము తననుండి వెలువరింప దలచినవాడై యా ప్రకృతి తన సాన్నిధ్యమున నుండిననేగాని సృష్టి చేయు సమర్థత గలిగి యుండనందున తన సంకల్ప జ్ఞానమను జీవాంశను, ఆ ప్రకృతియందు నిలిపి సృష్టి సామర్థ్యంబును గలుగజేసెను. అనగా, ఆ బ్రహ్మము తన సూక్ష్మ శరీరముతో పురుషాకృతిని నా ప్రకృతియందు ప్రవేశించి, త్రిగుణక్షోభితమునకు కారణముగు కాలమును, జన్మకు కారణమగు కర్మను, మహదాది పరిణామములుగా పరిణమించు స్వభావమును, సృష్టి, స్థితి, లయంబులకు సహాయ కారిణులుగా నుండుటకు స్వీకరించి, యా ప్రకృతికి మహత్తత్వమును బొందింపజేసెను.

అంత నా ప్రకృతి తనయందు గుణసామ్య స్థితిని బొంది యున్న సత్వ రజ స్తమో గుణస్వభావములను గలిగిన నామరూపములను సూక్ష్మావస్థలో బొందిన చిద చిత్తులను స్థూలావస్థను జెందించి, జగదాకారముగ నేర్పగుప లయంబులు వెడలెను దీనికే అవ్యక్తమునుండి మహత్తు బుట్టినదని చెప్పిరి. ఇట్లు బయలు దేరిన మహత్తత్వమును బొందిన ప్రకృతిని "ఓం" అను గుర్తుతో దెలుపుచున్నారు. అందులో "ఓ" అనునది "మాయ" యనియు "ం" అనునది "పురుషుడు" అను పరమాత్మ స్వరూపమనియు యెరుంగవలెను. ఆ ప్రకృతి (మాయ) యందు సత్వ, రజ, స్తమస్సులను మూడు గుణములు గలవని లోగడనే చెప్పియుంటిని. అందులో సత్వగుణము శాంత వృత్తిని ప్రకాశక స్వభావమును గలిగియుండును. రజో గుణము

ఘోర వృత్తిని ప్రవర్తన స్వభావమును గలిగియుండును. తమో గుణము మోహాన స్వభావమును గలిగియుండును. సత్వ గుణము తెలుపు వర్ణము గలిగి, నిర్మలమైన సముద్రి జలమువంటిదై, మాయ, విద్య, అను పేర్లతో నెరుంగబడుచుండుననియు, రజో గుణము ఎరుపు వర్ణము గలిగి కలతనొంది, అలలు, బుగ్గలు, నురుగులు, తుంపురులు, మొదలుగాగల యనేక విధములైన వికారములు గలిగిన సముద్రి మందలి జలము వంటిదై, అవిద్య యను పేరుతో నెరుంగబడుచుండు ననియు తెలిసికొనవలెను.

అట్టి మాయయందు పరబ్రహ్మము ప్రతిఫలింపగా, నొక ప్రతి బింబము కలిగెను. దీనిని ఈశ్వరుడనియు, భగవతుడనియు, సగుణ సాకార బ్రహ్మమనియు, మాయా శబలిత బ్రహ్మమనియు చెప్పు చున్నారు. ఆ యీశ్వరుడు, మాయ యందు ప్రతిఫలించినవాడు గావున సర్వజ్ఞత్వము గలవాడై తనయందు ప్రతిఫలింప చేసికొన్న మాయకు వశ్యుడుగాక, మాయను తన స్వాధీనమం దుంచుకొని, ఆమాయనే కారణ శరీరముగను సుషుప్త్యవస్థగను ఆనందమయ కోశ ముగను గలవాడై ఆ మాయోపాధియందు అభిమానము గలిగి యున్నందున, అవ్యాకృతుడనియు, నెల్లెడల వ్యాపించుట వలన, అంతర్యామి యనియు, పేర్లతో బరగు చున్నాడు. ఈయన రాజ సాహంకారమే బ్రహ్మయని, సాత్వికాహంకారమే విష్ణు వని, తామ సాహంకారమే రుద్రుడని ఈ మూడును కలసినది యీశ్వరుడని, శుద్ధ సాత్వికాహంకారమే సదాశివుండని యెరుంగబడుచు, సృష్టి, స్థితి, సంహార, తిరోధా నానుగ్రహములను పంచ కృత్యములను వరుసగా చేయుచుండునని యెరుంగునది.

పరబ్రహ్మ మట్టులే అవిద్యయందు ప్రతిఫలింపగా ఆ బ్రహ్మ ఛ్ఛాయ, అనేక విధ బులైన యవిద్యావికారములచేత భిన్న భిన్న ములై అనేక జీవాత్మలాయెనని యెరుంగునది. ఈ జీవాత్మలకు, అవి ద్యయే కారణ శరీరముగను, సుషుప్త్యవస్థగను, ఆనందమయ కోశము నగుచున్నది. ఆ కారణ శరీరమందు అభిమానము గలుగుటచే జీవుడు, ప్రాజ్ఞుడు, పారమార్థికుడు, అను నామములతో బరగుచున్నాడు.

అంత ఈశ్వరుఁడు జీవాత్మలకు సుఖ దుఃఖాది భోగము లనుభవించుటకై ప్రపంచ సృష్టిని చేయఁదలంచి, తమోగుణమును నావరణ శక్తిని వీక్షింపగా, అందుండి విక్షేప శక్తి యనునది గలిగెను. ఆ విక్షేప శక్తిద్వారా సృష్ట్యాదులు చేయఁదలంచెను. ఆ విక్షేపశక్తి జీవాంశావస్థా విశేషములైన శరీరేంద్రియ పంచభూతములుగా పరిణమించు కర్తృత్వ స్వభావమును గలిగినదియై త్రిగుణాత్మకమై అహంకారమనునదిగా నెరుఁగఁబడుచున్నది. దీనినే మహత్తునుండి యహంకారము బుట్టినదని చెప్పుచున్నారు. తమోగుణ సంబంధమైన యీ యహంకారమునుండి శబ్దతన్మాత్రగా నుండు నాకాశమును, దానినుండి స్పర్శతన్మాత్రగానుండు వాయువును, దానినుండి రూపతన్మాత్రగానుండు నగ్నియును, దానినుండి రసతన్మాత్రగానుండు జలమును, అందుండి గంధతన్మాత్రగానుండు పృథ్వియును బుట్టెను. దీనినే యహంకారమునుండి పంచ తన్మాత్రలను సూక్ష్మ పంచభూతములు పుట్టెనని చెప్పుచున్నారు. అట్లు పుట్టిన ఆకాశము శబ్దమును, వాయువు శబ్ద స్పర్శములను, అగ్ని శబ్ద, స్పర్శ, రూపములను, జలము శబ్ద, స్పర్శ, రూప, రసములను, పృథ్వి శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను గుణములుగా గలిగిన వాయెను. ఇచ్చట "పుట్టుట" యనగా, "అహంకార" మీ విధముగా పరిణమించెనని యర్థము. ఈ పంచ భూతములు తొలుత బుట్టినప్పుడు పరమాణువులంతేసి పరిమాణము గలవియై యుండెను. అందువలన వీనిని సూక్ష్మ పంచ భూతములని బిలచిరి. తదుపరి నివి అహంకారముయొక్క త్రిగుణములలో సత్వగుణముతోఁ జేరినపుడు అణువులంత పరిమాణము గలవియై, రజో గుణముతో జేరగనే రజములంత పరిమాణము గలవియై, తమో గుణముతో జేరగనే యిసుక యంతటి పరిమాణము గలవియై వరుసగా సత్వ సూక్ష్మ పంచభూతములని, రజస్సూక్ష్మ పంచభూతములని, తమస్సూక్ష్మ పంచ భూతములని, పంచీకృతమైనప్పుడు మహత్ప్రంచ భూతంబులని యెఱుంగబడుచు, సమష్టి స్వరూపమైన యీశ్వరునికిని, బ్రహ్మాది దేవతలకును, వ్యష్టి స్వరూపులైన జీవులకును సూక్ష్మ స్థూల శరీరముల సృష్టికి కారణమాయెను.

ఇట్లేర్పడిన సత్వ, రజ, స్తమస్సూక్ష్మ పంచభూతములు తిరిగి పరిణితి సమష్టి వ్యష్టి యని రెండు విధములై, సత్వ సమష్టి వ్యష్టి సూక్ష్మ పంచభూతము లనియు, రజస్సమష్టి, వ్యష్టి సూక్ష్మ పంచభూతము లనియు, తమస్సమష్టి, వ్యష్టి సూక్ష్మ పంచభూతములనియు నారు తెరంగులాయెను. సమష్టి యనగా నఖండ భాగమనియు, వ్యష్టి యనగా ఖండ భాగములనియు నెరుంగునది. ఇందులో సత్వ, సమష్టి సూక్ష్మ పంచభూతము లన్నియు కలియగా వానినుండి, "అంతఃకరణము" దాని యధి దేవతలైన బృహస్పతి, చంద్రుడు, క్షేత్రజ్ఞుడు (జీవుడు) రుద్రుడను వారలతో గూడుకొని జనించినది. అంతఃకరణమనునది ఒక్కటియే యైనను, బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము, అను వేరువేరు పేళ్లు గలిగి నిశ్చయించుట, సంకల్పించుట, సంశయించుట, అభిమానించుట, అను వృత్తులతో సంచరించుచుండును. సత్వవ్యష్టి యాకాశమునుండి శ్రోత్రమును, సత్వవ్యష్టి వాయువునుండి త్వక్కు, సత్వవ్యష్టి యగ్నినుండి నేత్రము, (చక్షువ) ను, సత్వవ్యష్టి జలమునుండి జిహ్వయు, సత్వవ్యష్టి పృథ్వినుండి ఘ్రాణము, అను నైదు జ్ఞానేంద్రియములు వరుసగా వాని యధి దేవతలైన దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినులు అను వారితో గూడుకొని జనించినవి. సత్వ గుణాంశ జనితములగుటచే నివి యన్నియు జ్ఞానశక్తియు, జ్ఞానప్రకాశ శక్తియు గలిగియుండును. రజస్సమష్టి సూక్ష్మ పంచభూతము లన్నియు, కలియగా వానినుండి ప్రాణవాయువు గలిగెను. అదియు వృత్తి భేదముచే ప్రాణాపాన వ్యానోదాన సమాన వాయువులని అయిదు విధములై వరుసగా, ఉచ్ఛ్వాస, నిశ్వాసముల విడుచుట, మలమును విసర్జించుట, అన్నరసము నాడులకు పంచి పెట్టుట, అన్నము మొదలైన దానిని భక్షించునట్లు జేయుట, మనము తిను పదార్థములను జీర్ణింపజేయుట, అనెడు వృత్తులను గలిగి సంచరించుచుండును. వానికి వరుసగా వశిష్ఠుడు, విశ్వామిత్ర, విశ్వయోని, అజుడు, జయుడు అనువా రధిదేవతలు. ఈ యధి దేవతలుకూడ ప్రాణవాయువుతో జనించిరి, రజో వ్యష్టి సూక్ష్మ పంచభూతమైన యాకాశము వలన వాక్కు, వాయువునుండి పాణి, అగ్నినుండి

పాదము, జలమునుండి గుహ్యము, పృథ్వినుండి పాయువయును, వరుసగా వాని యధి దేవతలైన అగ్ని, యింద్రుడు, విష్ణువు, ప్రజాపతి, మృత్యుదేవత, యను వారలతో గూడి పుట్టెను ఇట్లు జనించిన జ్ఞానేంద్రియము లయిదును, కర్మేంద్రియము లైదును ప్రాణములు అయిదును, మనోబుద్ధి చిత్తాహంకారములును, అంతఃకరణేంద్రియములు నాలుగును కలసి పందొమ్మిది యింద్రియములు సూక్ష్మ శరీరమున కవయవములని యెరుగునది. కొందరు సూక్ష్మ శరీరమందు అహంకారము, చిత్తము అనునవి వేరుగా నుండక, మనోబుద్ధులతో లీనమై యుండుననియు, అందువలన సూక్ష్మశరీరమునకు పదునేడింద్రియములే యుండునని చెప్పుచున్నారు. ఇట్లు మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలతో గూడిన పంచభూతములును, శరీరేంద్రియ దశకముతో గూడిన మనోబుద్ధి ప్రాణంబులను, ఆయా యింద్రియాధిష్ఠాన దేవతలతో గూడ నేర్పడెను, అవి యన్నియు వేర్వేరుగా నుండుట వలన వాని సముదాయము వలన కల్పింపబడవలసిన సమష్టి పురుషుని శరీరమగు జగదాకారమైన బ్రహ్మాండమును సృష్టింపనసమర్థంబులై యున్నందున భగవంతుని కాలశక్తిచే ప్రేరేపింపబడి యొక దానితో నొకటి కలసి జగన్నిర్మాణముచేయు విధం బెరింగినవియై యవి యన్నియు యేకీభవించి సమష్టి పురుషునికి నివాసయోగ్యంబగు బ్రహ్మాండమును జగదాకారముగ గల్పించి, తమతమ యంశముల నా సమష్టి పురుషుని శరీరమును సృజించి కార్యరూపముగా తమయందు నేర్పడి యున్న స్థావర జంగమాది తత్వములతో, నా సమష్టి పురుషునికి గర్భరూపముగా నేర్పడెను. ఆ యండముయొక్క వెలుపలి భాగము పృథివ్యాది పంచభూతములచే నొకదానికంటె మరియొక్కటి పదిరెట్లు పరిమాణముగ విస్తరించి, యావరింపబడి యుండెను. ఆ చేతనా రహితమైన యండమును స్థూల శరీరముగా జేసికొని యా పరమ పురుషుండును ప్రవేశించి దానిని కాలకర్మ స్వభావంబులకు చిక్కనీక సమస్తమును జీవముతో గూడి యుండునటుల ప్రాణవంతముగా చేశి కల్పాంతము వరకు వేయి సంవత్సరముల కాల మా మహార్ణవ జలమందున్న యా యండమునందుండెను. అంత కాల కర్మ స్వభావంబులచే ప్రేరే

పింపబడినవాడై యందలి మహా పురుషుఁడు విజృంభించి యా యండ ము ను భేదించి యందుండి బయలు వెడలెను. అతనియే విరాట్పురుషుండని చెప్పఁబడుచున్నాడు. ఆయన యనేక శిరములు, ఫాలములు, ముఖములు, నేత్రములు, కర్ణములు, బాహువులు, వక్ష స్థలములు, పాదములను గలవాడై యుండెను ఆయన తనయందు సమస్త లోకములను మాహాదాదుల శరీరయుక్తమైన సంకల్ప జ్ఞానమును, జీవాత్మలను వాని కర్మలను, శరీరములు కలిగించు ఛిచ్ఛక్తిని దేవతాసికములను గలిగినవాడై ప్రకాశించెను. ఆయన కటిప్రదేశమునకు పైభాగ మాయన యూర్ధ్వ దేహమనియు, కటి ప్రదేశమునకు దిగువభాగ మధో దేహ మనియు, చెప్పబడుచున్నది. ఆ యూర్ధ్వ దేహమందు "శిరస్సు" సనాతనమైన బ్రహ్మ నివాసంబగు సత్యలోకంబనియు, భ్రూమధ్యము తపోలోకమనియు, కంఠము జనోలోకము, మహర్లోక మనియు, హృదయము సువర్లోక మనియు, నాభి భువర్లోకమనియు, కటి పై ప్రదేశము భూలోకమనియు చెప్పబడుచున్నది. తిరిగి అధో దేహమందు పొత్తి కడుపు, అతల మనియు, పిఱుదులు వితలమనియు, తొడలు సుతలమనియు, మోకాళ్లు తలాతల మనియు, పిక్కలు మహాతలమనియు, చీలమండలు రసాతల మనియు, అరికాళ్లు పాతాళ మనియు చెప్పుచున్నారు మరికొందఱు విరాట్పురుషుని శిరస్సునందు స్వర్గలోకము, నాభియందు ఆకాశము, పాదములయందు భూలోకము గలదనియు, సత్వగుణ ప్రధానులగు దేవతలు స్వర్గలోకమును, రజోగుణ ప్రధానులైన మనుష్యాదులు రాజస కర్మములకు తగిన ఫలములననుభవింప దగినదియై యున్న భూలోకమును, తమోగుణ స్వభావులు. రుద్రునకు పార్శ్వవర్గంబులై భూత ప్రేత పిశాచాదులు ఆకాశమును బొందియున్నారని చెప్పుచున్నారు.

ఇది బ్రహ్మాండ సృష్టిక్రమము. దీని నెరిఁగినవారలై యీ జగదాకారముగనున్న యీవస్తువు భగవత్స్వరూపమేయని గ్రహించునది.

అంత నావిరాట్పురుషుండు ప్రవృత్తి కున్ముఖుఁడు కాగానే అనగా జీవసృష్టిచేయవలెనని తలంపుగలవాడు కాగానే ఆయన తన సమష్టి యింద్రియ సమూహము నుండి అనేక వ్యష్టి యింద్రియముల

కలిగించెను. అట్లుచేయుటలో ఆయన సమష్టి అధిష్ఠాన రూపములనుండి యీ క్రింద చూపబడిన విధముగా అనేక వ్యష్టి,

| అధిష్ఠాన రూపములు (యేర్పడి) | అందుండి, ఆధ్యాత్మిక తత్వములు (బుట్టి) | ఆయా అధిదైవతములచే (నధిష్ఠింపబడి) | ఆయా అధిభౌతిక కార్యాచరణను సమర్థంబులాయెను. |
| --- | --- | --- | --- |
| ముఖము | వాక్కు | అగ్నిహోత్రుడు | శబ్దముల నుచ్చరించుట. |
| నాసికాకుహరములు | ఘ్రాణము | అశ్వనీదేవతలు | సుగంధ, దుర్గంధంబుల గ్రహించుట |
| నేత్రస్థానము | చక్షువు | సూర్యుడు | సమస్త రూపముల జూచుట. |
| కర్ణస్థానము | శ్రోత్రము | దిగ్దేవతలు | శబ్దములను వినుట. |
| తాలుస్థానము | జిహ్వ | వరుణుడు | ఉప్పు, పులుసు, కారము మొదలగు రుచుల నెరుంగుట. |
| చర్మస్థానము | త్వగింద్రియము | వాయువు | మృదుత్వ కఠినత్వముల నెరుంగుట. |
| త్వక్ స్థానము | రోమములు | ఓషధ్యభిమాన దేవతలు | కండూతిని కలిగించుట. |
| చేతులు | పాణి | ఇంద్రుడు | ఇచ్చుట, పుచ్చుకొనుట. |
| పాదములు | పాదము | ఉపేంద్రుడు | గమనాగమనములను చేయుట. |
| గుదము | పాయువ | మృత్యుదేవత | మలమును విసర్జించుట. |
| గుహ్యము | ఉపస్థ | ప్రజాపతి | రతిసుఖమును బొందుట. |
| హృదయస్థానము | మనస్సు | చంద్రుడు | సంకల్ప, వికల్పములను జేయుట. |
| | బుద్ధి | బృహస్పతి | నిశ్చయజ్ఞానమును కలిగించుట. |
| | అహంకారము | రుద్రుడు | దేహాభిమానమును కలిగించుట. |
| | చిత్తము | క్షేత్రజ్ఞుడు | ఆలోచింపదగిన అర్థజాలమును తెన్నుగా నాలోచించి అర్థవిషయజ్ఞానమును జెందుట. |

ఇట్లు జీవులకు సూక్ష్మ శరీరము లేర్పడి, ఆయా యింద్రియ ములయందు ఆయా యధిష్ఠాన దేవత లధిష్ఠించినను క్షేత్రజ్ఞుడు ప్రవృత్తి ప్రవర్తనకు సమర్థుడు కాకుండెను. అంత నా పరమ పురుషుండు జీవాత్మల నాయా క్షేత్రజ్ఞ స్థానములయందు ప్రవేశ పెట్టి చిత్తస్థానమున జేర్ప క్షేత్రజ్ఞులు ప్రవృత్తి, ప్రవర్తనకు సమర్థులాయెను. ఇట్లేర్పడిన సూక్ష్మ శరీరములను, నవి జీవులకు పుణ్యపాప కర్మలను జేసి భోగముల సంపాదించునవియని యెరుంగునది. ఆయా కర్మల ఫలితముల ననుభవించుటకు నావశ్యకమైన స్థూల శరీరంబు లెట్లు కల్పితంబులాయెనన :—

మూడు విధములుగా విభజింపబడిన సూక్ష్మ పంచభూతము లలో సత్వ, రజ స్సూక్ష్మ పంచభూతంబులు, సూక్ష్మ శరీరముల కుప యోగింపబడగా మిగిలిన తమ స్సూక్ష్మ పంచభూతములను, తమో స్థూల పంచభూతములుగా మార్చి ఆస్థూల పంచభూతములైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్విని తిరిగి సమష్టి, వ్యష్టి అని రెండు విధములుగా ప్రతి భూతమును విభజించెను. అట్లు విభజింప బడుటవలన నేర్పడిన ప్రతి వ్యష్టి భూతమును తిరిగి నాలుగు భాగ ములుగా విభజింపబడెను. ఇట్లు చేయబడుటవలన ప్రతిస్థూల భూతము, ఒక సమష్టి భాగము, నాలుగు వ్యష్టి భాగములును గాబడి యీ యైదు స్థూల భూతములును 5 × 5 = 25 భాగములుగా విభజింప బడినవాయెను. దీనినే పంచీకరణమని చెప్పుచున్నారు. ఇట్లు విభాగింప బడిన ప్రతి భూతముయొక్క 5 భాగములలోను, సమష్టి భాగము వలన ఒక తత్వము (ఇంద్రియము) ను, మిగిలిన 4 వ్యష్టి భాగములలో ఒక్కొక్క వ్యష్టి భాగము తదితర భూతములయొక్క ఒక్కొక్క వ్యష్టి భాగముతో గలసి ఒక్కొక్క తత్వ మేర్పడెను. అట్లైతే 5 భూతముల 25 భాగములకు 25 తత్వములుగా నేర్పడెను.

ఏయేభూత సమష్టి భాగము వలన యేతత్వ మేర్పడినది, యేయే భూత వ్యష్టిభాగము వలన యేతత్వము తేర్పడినది యీక్రింద చూపబడిన పట్టిక వలన గ్రహించునది.

| తమోస్థూలపంచభూతమ్ములు | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృధ్వి | ఇంద్రియవివరములు. |
|---|---|---|---|---|---|---|
| ఆకాశపంచకరణము | జ్ఞాత | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అంతరింద్రియములు. |
| వాయువు ,, | సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము | పంచప్రాణములు. |
| అగ్ని ,, | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు. |
| జల ,, | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము | పంచతన్మాత్రలు. |
| పృధ్వి ,, | వాక్కు | పాణి | పాదము | గుహ్యము | పాయువు | కర్మేంద్రియములు. |

N. B :—దీని నెరుంగుట యెట్లు లనిన,

ప్రతి భూత పంచీకరణముకు యెదురుగా చూపబడిన తత్వము లైదింటిలో పైన చూపబడిన స్థూల భూత ములలో ఆ పంచీకరణసంబంధమైన భూతముకు క్రింద చూపబడినది ఆ భూత సమష్టి భాగతత్వ మనియు, మిగతా నాలుగు తత్వములు ఆ పంచీకరణ భూతము యొక్క వ్యష్టి నాలుగు భాగములలో ఒక్కొక్కటి యేభూతముక్రింద చూపబడినది, ఆభూత వ్యష్టి భాగముతో గలియుటవలన గలిగిన తత్వమని యెరుంగునది.

దృష్టాంతము :—ఆకాశ పంచీకరణమున కెదురుగా చూపబడిన 5 తత్వములలో ఆకాశ భూతము క్రింద చూపబడిన "జ్ఞాతి", అను తత్వము సమష్టి ఆకాశ భాగము వలన గలిగిన తత్వమనియు మిగిలిన ఆకాశ భూత వ్యష్టి నాలుగు భాగములలో ఒక్కొక్కటి వాయువుయొక్క ఒక వ్యష్టి భాగముతో గలియుట వలన "మనస్సును", అట్లే అగ్నియొక్క ఒక వ్యష్టి భాగముతో గలియుట వలన "బుద్ధియును", జలముయొక్క ఒక వ్యష్టి భాగముతో గలియుటవలన "చిత్తమును", పృథ్వియొక్క ఒక వ్యష్టి భాగముతో గలియుట వలన "అహంకారమును" బుట్టినవి. ఇట్లులే మిగతా భూత తత్వములగూడ నెరుంగునది.

ఈ శరీర సృష్టి సంబంధములో వాటికి గావలసిన యింద్రియములను, ఆయా యింద్రియములచే పని చేయించుటకు గావలశిన అధిదేవతలను, శక్తులను, సూక్ష్మ శరీరములోనే యేర్పరుపబడియున్నవి గాని సూల శరీరములో యేమియు లేవు. స్థూల శరీరములో ఇంద్రియములు అని చెప్పబడేవి సూక్ష్మ శరీరములో యున్న ఇంద్రియము లన్నియు సూక్ష్మముగా నుండుట వలన వాటి కాపుదారీ నిమిత్తం రైలు యింజనులోని యంత్రము కాపుదారీ నిమిత్తం చుట్టూ యినప రేకులతో పెట్టె మాదిరిగా యేర్పాటు చేయబడియున్నట్లు, సూక్ష్మ శరీరములోని ప్రతి యింద్రియమునకు ఒక గోళకమును స్థూల శరీరములో యేర్పరుపబడినది. సూక్ష్మ శరీరములను బొందిన జీవులు యిట్లు లేర్పరుపబడిన స్థూల శరీరములయందు వ్యాపించి యీస్థూల శరీరములద్వారా పూర్వ జన్మములందు చేశిన కర్మలయొక్క ఫలిత సుఖ దుఃఖముల ననుభవించుచు, యీ జన్మయందు తిరిగి పుణ్య పాప కర్మలను జేయుచు, మరణ కాలంబున యీ స్థూల శరీరములను భూలోకమున విడచి సూక్ష్మ శరీరములతో స్వర్గ నరకాది పదవుల జేరి అక్కడ వారివారి పూర్వజన్మ కర్మ ఫలిత సుఖ దుఃఖముల ననుభవించుచుండి కర్మ శేషంబునకుగాను తిరిగి భూలోకములో మనుష్య, మృగ, పశు, పక్షి, క్రిమి, కీటకాదులలో తగు జన్మముల నెత్తుచుం

చురు. ఇట్టులే పుట్టుచుఁ జచ్చుచు, తిరిగి పుట్టుచు, జనన మరణ సాగరమున మునిగి గిలగిల తన్నుకొనుచు మోక్షమును బొందలేక దుఃఖించుచుందురు.

ఈ సృష్టి సంబంధములో ప్రకృతియొక్కయు, పరమాత్మాంశమైన పురుషునియొక్కయు కార్యభేదములను వేరువేరుగా తెలిసికొనుట ముఖ్యావశ్యకము.

పరబ్రహ్మమునుండి మహత్తత్వమును బొంది బయలుదేరిన ప్రకృతి యనునది తాను విజృంభించి తనయందలి సూక్ష్మ స్థితిలోనున్న చిద చిత్తులను స్థూలావస్థను బొందించి పరమాత్మ సంకల్పానుసారముగా లీలా వినోదార్థము కావలసిన నామ రూపాత్మకమైన జగదాకారముగ పరిణమించుచున్నది. పరమాత్మాంశ స్వరూపుడైన పురుషుడు తాను స్థూలావస్థను జెందకయే, వానియందు ప్రవేశించి వానికి జీవత్వమును కలుగ జేయుచున్నాడు. తాను జగదాకారముగా పరిణమించిన ప్రపంచమందు మాయ అను పేరుతో సూత్రధారియై నిలచి పురుషుని వలన జీవత్వమును బొందబడిన జీవులచేత మాయా నాటకమును ఆడించుచు ననేక లీలలను గల్పించి, అందు ప్రవేశించిన పరమాత్మకు, ఆనందమును కలుగ జేయుచున్నది.

ఈవిధముగా పంచభూత సమ్మేళనము వలన నేర్పరుపబడిన జీవుల స్థూల శరీరములను గూళ్లుగా జేసికొని మాయా (ప్రకృతి) బ్రహ్మ లిరువురును రెండు పక్షులవలె ప్రవేశించిరి. అందు వారు నడుచుచున్న నడకలను విరళముగా దెలిసికొనుట తదుపరి ముఖ్యకర్తవ్యాంశముగాన దానిని గురించి యిట దెలిపెదను.

స్థూల శరీరములో ప్రవేశించిన ప్రకృతి పరమాత్మతోఁగూడి నిలచియుండుటకు అందు మొదడు భాగము నేర్పరచుకొని యందులో నిలచి పరమాత్మతో కలియగనే తిరిగి మాయ, అవిద్య యని రెండు విధంబు లాయెను. ఆ ప్రకృతి సత్వ, రజ, స్తమో గుణంబులను మూడు గుణంబులను కలిగియున్నదనియు, అందులో మాయ యను

వది సత్వ గుణమున, శాంత వృత్తిని, ప్రకాశ స్వభావమును గలది యనియు, అవిద్య యనునది రజస్సు, తమస్సు, అను గుణములను ఘోర వృత్తిని, మోహన స్వభావమును, గలది యనియు, నిట్టి మాయా విద్యల రెంటియందును పరమాత్మ ప్రతిఫలించగా కలిగిన రెండు ప్రతిబింబములను "ఈశ్వరుడు, జీవుడు" అని బిలువబడుచున్నా రనియు లోగడ దెలిపియుంటిని. ఈ రెండు ప్రతిబింబము లొక్క పర మాత్మ యంశమే యయినను, జీవుడు జనన మరణ సాగరమున బడి పుట్టుచు, జచ్చుచు అనేక జన్మల నెత్తుచు పుణ్య పాప కర్మల చేయుచు వాని ఫలముల ననుభవించుచుండు స్థితి ఈశ్వరునకు ఏల లేదనిన చెప్పెద వినుము.

మాయ యనునది "విద్య" అను పేరుతోగూడ నెఱుంగబడు చున్నది. "విద్య" అనగా "జ్ఞానము" అట్టి మాయయందు ప్రతి ఫలించుటచే మాయగూడ జ్ఞాన స్వరూపము గలదియేగాన దాని యందు ప్రతిఫలించిన యీశ్వరునియొక్క స్వతస్సిద్ధమైన జ్ఞానము తిరోధానముగాక సర్వజ్ఞుడై యుండి తాను మాయోపాధియందుండి నను నా మాయకు వశ్యుడుగాక దానిని తన స్వాధీనమం దుంచుకొని దానికి సహాయము చేయుచు సృష్టి నిర్వాహకత్వమును జరుపు చున్నాడు.

"అవిద్య" యనునది, అట్లుగాక ఆవరణ, మోహన స్వభా వముగలది. "అవిద్య" అనగా "అజ్ఞానము" అనగా జ్ఞాన తిరో ధాన మగుట యనియు, "ఆవరణ" అనగా "కప్పివుచ్చుట" యనియు, "మోహనము" అనగా "భ్రమింపజేయుట" యనియు నర్థము. అట్టి స్వరూపముగల యవిద్యయందు ప్రతిఫలించగా కలిగిన ప్రతిబింబముగూడ పరమాత్మాంశయే యైనను దానిని అవిద్య ఆవ రించి నిజ స్వరూపము అనగా "తాను పరమాత్మ ప్రతిబింబితుడను" అను సర్వజ్ఞత్వమును మరుగు పరచి కించిత్ జ్ఞానునిగా జేసి, తాను చేసిన సృష్టిని జూపి, భగవత్సృష్టియని చెప్పి భ్రమింపజేసి నమ్మించి యజ్ఞానమును గలుగజేయుట వలననే జీవుడని పిలువబడుచున్నాడు.

ఇట్లు కించిత్ జ్ఞానముగల వానినిగా జేయబడిన జీవుడీ యవిద్యకు వశ్యుడై దాని చెప్పుచేతలకు లోనై ప్రియములు, అప్రియములు, నయిన కర్మలను జేయుచున్నాడు. వాని వలన ధర్మము, అధర్మము, కలుగుచున్నది. వానినుండి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులు గలవాడై తానప్పుడప్పుడు చేయు సుకర్మలతోఁబాటు దుష్కర్మలనుగూడ జేయుటవలన కర్మబద్ధుడై యా కర్మల ఫలితముల ననుభవింపవలసినవాడై జనన మరణ ప్రవాహమున బడి గిలగిల తన్నుకొనుచున్నాడు. కాన యీ రెండు ప్రతిబింబముల స్థితి భేదమునకు జ్ఞాన తిరోధానమే ముఖ్య కారణముగా నెరుంగునది.

ఇంక ప్రకృతి స్థూల శరీరములో " మాయ, అవిద్య " అను పేర్లతో పరిణమించగా గలుగుచున్న కార్యము లెట్టివో కించిత్ జ్ఞానులుగా చేయబడిన జీవులచేత నాడించు మాయా నాటకము లెట్టివో వానిని గురించి యిచ్చట వివరించెదను.

ఇట్లు స్థూల శరీరములో పరిణమించిన మాయ, అవిద్య అను రెండును ఆ శరీరమందు మాయా మండలమని, అవిద్యా మండలమని రెండు మండలములుగా నేర్పరచెను. అందులో మాయా మండలమనునది ఈశ్వరునికిని, అవిద్యా మండల మనునది జీవునికిని సంచరించు స్థానములుగా నేర్పరుప బడినవి. ఆ మండలములలో తిరిగి మాయా మండలములో హిరణ్మయ కోశమనియు, అవిద్యా మండలములో అన్నమయ కోశము, ప్రాణమయ కోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము, ఆనందమయ కోశము, అను పంచ కోశము లేర్పరుప బడినవి. కోశమనగా కత్తికి యొరవంటి యొక సంచియని యర్థము. ఇట్లేర్పరుపబడిన మండలములలో మాయా మండలములో " మాయ ", యనునది " పరాశక్తి " యను పేరుతో నేత్రస్థానమున నిలచినది. అవిద్యా మండలములో ' అంతఃకరణ ' యనునది ' బుద్ధి ' యై నిశ్చయ జ్ఞానమును కలుగజేయు స్వభావము గలిగి భ్రూమధ్యస్థానమందును, ' మనస్సు ' యై విషయముల సంకల్ప వికల్పములు చేయు స్వభావము గలిగి కంఠస్థానమందును, ' అహంకా

తమై ' జీవునికి దేహాభిమాన మమకార రాగద్వేషాదులను, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులను వికారములను గల్పించు స్వభావమును గలిగి హృదయస్థానమందును, ' చిత్తమై ' విషయముల ననుసరించు కోరికల బుట్టించు స్వభావమును గలిగి నాభిస్థానమందును నిలచి, వరుసగా ఆదిశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, యిచ్ఛాశక్తి యను పేర్లతో నొప్పుచున్నది.

ఈ సందర్భములో బుద్ధియను నవిద్యయందు పరమాత్మ ప్రతిఫలించగా కలిగిన ప్రతిబింబమైన జీవాత్మ (జీవున) కు స్థూల శరీరమని, సూక్ష్మ శరీరమని, కారణ శరీరమ , మూడు శరీరములు గలవని లోగడ దెలిపిన యంశములనుబట్టి దెలిసికొంటిరిగదా ! వీనిలో శుక్ల శోణితముల వలన నేర్పడి పంచభూత సమ్మేళనమై అన్నము వలన బుట్టి అన్నము వలన పెరిగి షడ్వికారములు, సప్తధాతువులు, 24 యింద్రియములతో గూడి స్తంభమువలె కనుబడు నీ శరీరమే స్థూల శరీరమనియు, దీని కంతరముగా సూక్ష్మ భూతములతో నేర్పరుపబడి 17 యింద్రియములతో గూడియున్న శరీరము సూక్ష్మ శరీరమనియు నీ శరీరము లేర్పరుపబడుటకు కారణమైన " అవిద్య " కారణ శరీరమనియు, మరియొకసారి జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

ఇటులే ఈశ్వరునికి జగదాకారముగ నేర్పడిన బ్రహ్మాండము స్థూల శరీరమనియు, ఆ బ్రహ్మాండమందలి పరమపురుషుని శరీరము సూక్ష్మ శరీరమనియు, ఈ శరీరము లేర్పరుపబడుటకు కారణమైన ' మాయ ' కారణశరీరమని యెరుంగునది.

మండలములలో నేర్పరుపబడిన కోశములలో అన్నమయ కోశము మొదలు హిరణ్మయ కోశము వరకు వరుసగా ఒకదాని కంతరముగా మరియొకటి యేర్పరుపబడియున్నది. వానిలో అన్నమయ కోశము, స్థూలశరీరములోను, ప్రాణమయకోశము మనోమయ కోశము విజ్ఞానమయ కోశము, సూక్ష్మ శరీరమందును, ఆనందమయ కోశము, కారణ శరీరమందును, హిరణ్మయ కోశము, మహాకారణ శరీరమందును నేర్పరుపబడినవి.

స్థూలశరీరమే యన్నమయ కోశముగను, 5 (పంచ) ప్రాణములు + 5 కర్మేంద్రియములు + 5 ఉపవాయువులతో గూడి క్షుత్పిపాసలు కోశ ధర్మములుగా గలిగి రజోగుణ అహంకారముతోఁగూడి యుండునవి ప్రాణమయ కోశముగను, చెప్పబడుచున్నది. జీవుడు స్థూల శరీరమందు నిలచి 24 యింద్రియములు పనిచేయుచుండగ నీ రెండు కోశములయందును సూర్యోదయము 6 గంటలనుండి రాత్రి 8 గంటల వరకు సంచరించుచుండును. జ్ఞాన, కర్మ, అంతరేంద్రియములను పదునాలుగింద్రియ విషయములతో గూడి ఆత్ముడు పరాశక్తి సహితుడై సుఖ దుఃఖముల నెరుంగుటయే యని చెప్పబడుచున్నది గాన యీకాలము జీవునికి జాగ్రదవస్థయని చెప్పబడుచున్నది. ఈయవస్థయందు మనస్సు యింద్రియము లన్నింటికిని తాను రాజై భ్రూమధ్యంబున నిలచి సకలేంద్రియ వ్యాపారముల జరిపించుచుండ జీవుడు యవిద్యావరణలో చిక్కుకొనినవాడై తాను సంచరించుచుండు యాయా కోశ ధర్మములకును యంతఃకరణ వలన నేర్పరుపబడిన శక్తులచే గల్పింపబడు విషయములకును లోనై యాయా కర్మల జేయుచు కర్మబద్ధుడై వానివలన కలుగు సుఖ దుఃఖముల ననుభవించుచుండును.

అభిమానముతో గూడిన మనస్సు 5 జ్ఞానేంద్రియములతో గూడియుండునది, మనోమయ కోశము, ఈ కోశమందు జీవునిచే జాగ్రదవస్థయం దనుభవింపబడిన పదార్థములను విషయములను జ్ఞప్తికి తెచ్చుచు కలవరింతలు గలిగించుచుండును. ఇందును కామ క్రోధాది వికారంబులను గలిగియుండును. బుద్ధి 5 జ్ఞానేంద్రియములతో గూడియుండునది విజ్ఞానమయకోశము. ఈ కోశమందు బుద్ధి మనోరూపియై జీవునికి జ్ఞానము నెరిగించుచు ధ్యానమన నాది వృత్తుల గలిగించుచుండును. ఇందు మహదహంకారముతోఁగూడి విద్యామదమును గలిగియుండును. జీవుడు రాత్రి 8 గంటలు మొదలు 2 గం॥ 40 ని॥ వరకు స్థూల శరీరమునందలి యింద్రియము లన్నియు పనిచేయకుండ, నష్టపడియుండ, దానిని విడిచి సూక్ష్మ శరీరమందు నిలచి, 17 యింద్రియములు పనిచేయుచుండ, నీ రెండు కోశములయందు కొంతవరకు

కలవరింతలు కలవరించుచును, మిగిలిన కాలములో జ్ఞానమును బొంపు చును, సంచరించుచుండును. జీవుని కిట్లు సంచరించు కాలము స్వప్నా వస్థ యని చెప్పబడుచున్నది.

ఇట్లు సంచరించు కాలము దాటగనే యితరేంద్రియములన్నియు పడిపోయి వ్యాపార శూన్యములుగాగ, అంతఃకరణేంద్రియములలో చిత్తమును అహంకారమునుగూడ వదలి మనోబుద్ధులతో గూడి మలిన సత్వ రజస్తమో గుణాత్మకమైన అవిద్య యను నంతఃకరణ మొక్కటే నిలచి జడమై పడియుండును. ఇదియే యానందమయ కోశమని చెప్ప బడుచున్నది. ఈ కోశము, అజ్ఞాన సంబంధమైన ప్రియము (పదార్థ మును జూచిన మాత్రమునఁగలుగు సంతోషము), మోదము (తనకు లభించిన పిమ్మట కలుగు సంతోషము), ప్రమోదము (అనుభవించిన పిమ్మట కలుగు సంతోషము) అనెడు వృత్తులతో గూడియుండును. జీవుడు, జడమై పడియుండు నంతఃకరణలేక అవిద్య యను కారణ శరీరమందు స్వప్నావస్థానంతరమున నిలచి ఆ కోశ ధర్మములైన వృత్తులతో సంచరించుచుండును. జీవుని కిట్లు సంచరించు కాలము సుషుప్త్యవస్థ యని చెప్పబడుచున్నది. అట్టి స్థితిలో జీవుడుండ, లోగడ విజ్ఞానమయ కోశమం దెఱింగిన జ్ఞానముచేత గలిగిన ధ్యానమన నాది వృత్తులచేతను, శ్రవణ, మనన, నిది, ధ్యాసలచేతను, నిత్యానిత్యవస్తు వివేక విచారణ చేతను, తాను అవిద్యా మండలములో సంచరించుచున్న పంచకోశములు, ఆత్మగాదని యెఱింగిన వాడగుచున్నాడు. అంత జడమై పడియున్న యంతఃకరణ బోయి మాయయందు లయమై శుద్ధ మనస్సు కాగా త్రాడును జూచి పామని భ్రాంతినొందినవానికి విచారణమీద సంశయ రహితమైనట్లు అప్పటి వరకు అవిద్యావరణ వలన గలిగిన భ్రాంతి వదలిపోయి, సర్వజ్ఞుడై, తన నిజస్వరూపము నెరింగినవాడై, పంచకోశరహితమై సర్వసాక్షియను నాత్మ, యగుతాను హిరణ్మయకోశమం దున్నట్లు తెలిసికొని యీశ్వరత్వమును బొందును. ఇదియే జీవునికి తురీయావస్థ యనియు, జీవేశ్వరైక్య మనియు, చెప్ప బడుచున్నది. ఈ కోశమందు సంచరించు ఈశ్వరునికే సర్వసాక్షియని పేరు. ఈ కోశమును మించి అమనస్కమైనచో సర్వసాక్షిత్వముగూడ

ఇట్లు కర్మలచే బంధింపబడి జనన మరణ ప్రవాహమునంబడి గిలగిల తన్నుకొను జీవునికి పరమావధి జీవన్ముక్తత్వము. ఇది జీవేశ్వరైక్యమే యని యెరుంగవలయును. ఈ కర్మ బంధములకు కారణము మనోవికారములు. వానికి కారణము మనస్సంకల్పములు. మనస్సంకల్ప సంబంధమైన మనోవికారములు కలిగిన మీదట నవి యెక్కడకు తీసికొనిపోవునో మన మెరుంగలేము. జీవుని పరమావధిని సంపాదింపవలెనన్న ఇంద్రియ విషయముల దూరముగా ద్రోసి మనస్సునకు బాహ్యసంబంధమైనట్టియు, అంతర సంభంధమైనట్టియు సంకల్పములు గలుగకుండ నాశనము చేయవలెను. పాతాళవాసివైగాని, భూలోక వాసివైగాని, నాకలోక వాసివైగాని, దేవతలు మెచ్చుకొనునట్లు వేల కొలది సంవత్సరములు గొప్ప తపస్సు చేసినను, సంకల్ప నాశనము కానిది మోక్షము దొరకదని మహర్షి యయిన శ్రీ వాల్మీకులవారు శ్రీరాములవారి కుమారుడైన కుశునికి బంధమోక్ష స్వభావమును దెలుపుటలో బోధించుచు, అదిగాక యితరోపాయము లన్నియు నిరర్థకములే యని యెరింగి సంకల్ప నాశనమునకై పౌరుషముతో గట్టి ప్రయత్నము చేయవలసియుండునని దెలిపిరి. ఇట్లు సంకల్ప నాశనము చేసిన వాడవై ప్రారబ్ధ వశమున నీకు సంప్రాప్తమైన వ్యవహారము మాత్రము వహించి కర్తగా మాత్రము వేనిని కోరవలదనియు, సంకల్ప నాశనము జీవునికి నెప్పుడు కలుగునో అప్పుడు బ్రహ్మ భావమును బొందినవాడై జనన మరణములకు దూరుడగుననియు, నిదియే జీవన్ముక్తి యోగమనియుం దెలిపిరి.

కాన కృతార్థుడు గాందలచిన ప్రతి జీవునికి తత్త్వావధి జీవన్ముక్తత్వము (అనగా జీవుడు ఈశ్వరునిలో ఐక్యమగుట) ను పొందుటకు చేయు ప్రయత్నమునకు యోగమనిపేరు. ఈ పరమావధిని బొందగోరు మనుజునికి కర్మ యోగమని, భక్తి యోగమని, జ్ఞాన యోగమని మూడు యోగములు చెప్పబడినవి. అందులో కర్మయోగము తిరిగి మంత్ర యోగమని, లయ యోగమని, హఠ యోగమని మూడు విధములుగా చెప్పంబడినవి. ఈ మూటిలో మంత్ర యోగము జప స్వభావము గలది. దీనిని నభ్యాసకులు ప్రారంభములో అజ్ఞాన దశయందు

వలంబించి చేయవలెను. దీనిని గురించియే, లోగడ పూర్తియగు
జ్ఞాన దశకు కావలసినంతవరకు చెప్పియుంటిని. లయ యోగమునకు,
హఠయోగమునకు, వాయు నిరోధ మావశ్యకము గాన నది చాల
కష్టతరము. కర్మయోగ భాగములు మూటిలో మంత్రి యోగము
తేలికగ నుండును. దీనివలన మనస్సు పరిశుద్ధమై మోక్షము సంపా
దింపవలెనను తీవ్రమైన యాసక్తి గలుగును. దీనికే ముముక్షుత్వము
అని పేరు. ఈ కర్మ యోగము తిరిగి కామ్య కర్మ యోగమని
నిష్కామ్య కర్మ యోగమని రెండు విధములు. అందులో కామ్య
కర్మ వలన ఇహ పరలోక సుఖములను బొందెదరుగాని జనన మరణ
ముల వలన గలుగు జన్మ పరంపరలు తప్పవు. నిష్కామ్య కర్మ తిరిగి
తాను వేరు భగవంతుడు వేరు అను ద్వైత భావముతోఁజేయునది
యని, తానే భగవత్స్వరూపముగా తెలిసికొనినవాడై అద్వైత భావ
ముతో చేయునది యని రెండు విధములు, అందులో ద్వైత భావ
ముతోఁజేయు నిష్కామ్య కర్మ వలన మనస్సు పరిశుద్ధమై భక్తి
వృద్ధియై బ్రహ్మలోక ప్రాప్తి కలుగును. ఆ బ్రహ్మలోకమందు మహా
ప్రళయమువరకుండి, అంతట బ్రహ్మతోఁగూడ ముక్తిని బొందుదురు.
అద్వైత బుద్ధితో చేయు నిష్కామ్య కర్మము వలననే జీవుని పరమా
వధి యయిన జీవన్ముక్తత్వమును బొంది భగవంతునియం దైక్యమగుదు
రని యెఱుంగునది. దీనికి జ్ఞాన మావశ్యకము. కాని దీని నెరుంగదలచిన
వారు క్రమముగా ద్వైత భావ నిష్కామ్య కర్మాంతము వరకు
నభ్యసించిన పిదప (1) నిత్యానిత్య వస్తు వివేకము (అనగా మన
కంటికి కనబడు ప్రతి పదార్థము అనిత్య మనియు, సత్య, జ్ఞాన, ఆనంద,
నిత్య, నిర్మలములను 5 లక్షణములచే ప్రకాశించు నామ, రూప, రహి
తమై, ప్రపంచమునకు విలక్షణమైన పరబ్రహ్మము సత్యమని దెలిసి
కొనుట) (2) ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము (అనగా ఇహలోక
భోగములయందును, స్వర్గ, వైకుంఠ, కైలాసాది పరలోక భోగముల
యందును కోరిక లేకుండుట, (3) శమాది షట్క సంపత్తి అనగా
(అ) శమము (అనగా నంతరింద్రియ నిగ్రహము), (ఆ) దమము (అనగా
బాహ్యేంద్రియ నిగ్రహము), (ఇ) ఉపరతి (అనగా మనసును ఊర్ధ్వ

ముఖముచేసి సకల పాప కర్మలను వదలివేసి పుణ్య కర్మలచే భగవం తునికి ప్రీతిని గలిగించుట), (ఈ) తితీక్ష (అనగా ప్రారబ్ధ వశమున సంభవించెడు దుఃఖమునకు విచారపడక, సుఖమునకు సంతోషింపక, సమ బుద్ధితో నుండుట), (ఉ) శ్రద్ధ (అనగా వేదాంత వాక్యములయం దును, గురువు, ఈశ్వరుడు, బ్రహ్మవేత్తలు మొదలగు పెద్దలయందు అచంచల భక్తిని గలిగియుండుట), (ఊ) సమాధానము (అనగా మనస్సును విషయములయందు జొరనీయక నిలిపి, పెద్దల వలన తెలిసి కొనిన రహస్య విషయములను విని వానిని వేదాంత, శాస్త్ర, శ్రుతి, యుక్త్యనుభవములచే మనసును సమాధాన పరచుకొనుట), (4) ముము క్షుత్వము (అనగా మోక్షమును సంపాదింపవలెనను తీవ్రమైన ఆసక్తి) అను సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించిన వారలై యుండ, అపరోక్షజ్ఞాన సిద్ధిని పొందిన యొక గురువు రూపమున భగవంతుడే లభ్యమై అంతవరకు తెలసికొని, మదిలో బదిలపరచుకొనియున్న పరోక్షజ్ఞాన విషయములకు, అపరోక్షజ్ఞాన సిద్ధిని కర్మయోగములోని నిష్కామ్య లయ యోగపద్ధతినిగాని, హఠయోగ పద్ధతినిగాని, లేక జ్ఞానయోగమను, రాజయోగ పద్ధతినిగాని అవలంబింపజేసి వాని నెరుంగ దగిన మార్గముల బోధించి కృతార్థుల జేయుననియు యెరుంగునది.

ఈ సందర్భములో గురువనగ నెట్టివాడు? ఆయన స్వరూప మెట్టిది? ఆయన వలన మనకు గలుగు లాభ మెట్టిది? అను సంశ ములు విచారణచేసి తెలిసికొనుట, ముఖ్యావశ్యకము గాన వీనిని ముందు ప్రకరణములో దెలుపుచున్నాడ.

ద్వితీయ ప్రకరణము.
సంపూర్ణము.

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

నగురోరధికం.

శ్రీ

# ఆంజనేయ
# సద్గురు బోధామృతసారము.

## తృతీయ ప్రకరణము.

---

### గురుస్వరూపము.

గురువనగా నెట్టివాడు? ఆయన వలన మనకు కలుగు లాభ మెట్టిది? ఆయన స్వరూప మెట్టిది? అను యంశములను గురించి విచారించెదము.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు। ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మా। తస్మై శ్రీ గురవేనమః॥

అను నార్యోక్తి ననుసరించి గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు. ఆ గురువే యీ ముగ్గురికి కారణభూతుడైన పరబ్రహ్మము నయి యున్నాడు. దీనిభావ మేమన, సృష్టి సంబంధ ములో నీ త్రిమూర్తులను సృష్టించినపుడు, వారిలో బ్రహ్మ, ప్రపంచ సృష్టి చేయుటకును, విష్ణువు, సృష్టి చేయబడిన ప్రపంచమును పాలిం చుటకును, మహేశ్వరుడు, పరమాత్మ తన సంకల్ప విముఖుడు కాగానే ఆ ప్రపంచమును లయము నొందించుటకును, సృష్టిచేయఁబడినారని అందరు నెఱింగిన విషయమే. ఆ త్రిమూర్తులలో, ఒక్కొక్క రొక్కొక్క పనిని చేయుచుండగా గురుమూర్తి, అజ్ఞాన దశలోయున్న శిష్యునియందు జ్ఞానమును సృష్టించి, ఆ జ్ఞానమును నిజబోధయను పాలను బోసి పెంచుచు, వాని యందలి యజ్ఞానమును నశింపుచేయు

చున్నాడు. కావున గురుస్వామి, ఆ త్రిమూర్తులు కలసి చేయు మూడు పనులను తా నొక్కడే చేయుచుండుట వలన, వారి ముగ్గురికి కారణ భూతుడైన యీ పరమాత్మయొక్క సామర్థ్యము గలవా డగుచున్నాడు. కాన పరమాత్మ స్వరూపుడుగూడ అయియున్నాడనియు, అందువలన ఆ త్రిమూర్తులకన్న నతీతుడునియు, నెరుంగునది.

కం॥ గురుడనగా పరమాత్ముడు
పరగంగా శిష్యుడనిన పటుజీవుడగున్
గురుశిష్య జీవసంపద
గురుతరముగ గూర్చువాడు గురువగు వేమా॥

అనగా గురువే పరమాత్మ, శిష్యుడే జీవుడు, జీవబ్రహ్మైక్యము గావించువాడే గురువని యెరుంగునది.

తే॥ గీ॥ ధరణి లోపల ఆరారు తత్వములకు
నవ్వలైయున్న పరతత్వ మెవ్వడెరుగు
శివుడు గురురూపమున వచ్చి చెప్పకున్న
నన్యతరభోగి శ్రీ సదానందయోగి॥

అనగా, పరమాత్మ తత్వము ముప్పదియారు తత్వముల దాటియున్నద నియు, అట్టి తత్వమును, మనము మనుష్య రూపమున నుండుటచే, దేవే యితర రూపముతో వచ్చి మనకు దెలియజెప్పుటకు సాధ్యపడదు గనుక, ఆ భగవంతుడు యీ మానవాకారముతో వచ్చి మనకు తేట తెల్లమగునటుల జెప్పుచున్నాడని దీని భావము. భగవంతుడు తండ్రి వంటివాడు. మన మాయనకు పిల్లలవంటివారము. మన మజ్ఞాన దశను వదల్చుకొని, జ్ఞాన దశను బొంది, ముక్తిని బడయగోరి, ముముక్షుత్వ మును బడసిన వారలమై, అందులకు తగు ప్రయత్నముల జేయుచుం డుటను జూచి దయాంతఃకరణుడై, ఆయనయే మానవరూపమున వచ్చి బోధ చేయునని యెరుంగునది.

జ్ఞానముకంటె పవిత్రమైనదియును, గొప్పదియును నగు వస్తువు మరియొకటిలేదు. అట్టి జ్ఞానమును మనకు గురువు గలుగజేయు చున్నాడు. ప్రపంచముయొక్క నాలుగు మూలలకు వెళ్లి తల పగలం

" గురువు " అని యర్ధము. ఇట్టి గురువు పరమాత్మకు ప్రతినిధిగా నుండి మనకు జ్ఞానము నొసంగుచున్నాడు. కనుక పరమాత్మయే యని భావము.

శ్లో॥ గురురేవ పరందైవం । గురురేవ పరంతపః ।
గురురేవ పరంధ్యానం । నగురో, రధికంభువి॥

అనగా గురువే పరము నిచ్చు దైవము. గురువే తోడునీడ. గురువే ధ్యానింప దగినవాడు. గురువుకంటె నతిశయమైన పదార్థ మేదియు లేదని భావము.

ఇన్నియేల, తుట్టతుదకు సారాంశ మేమన :—గురువు మన వలెనే మానవాకారముతో నున్నాడని నిర్లక్ష్య భావమునుంచక, భగవంతుడు తన నిజరూపముతో వచ్చి జ్ఞానబోధ మనకు చేయుటకు సాధ్యము కానందున, మనము మానవుల మగుటచే మన చర్మ చక్షువుల నెదుట నీ మానవాకారముతోనుండి బోధ చేయుచున్నాడని నిశ్చలమైన బుద్ధితోనుండి, ఆయనచేయు బోధను హృదయపూర్వకముగ గైకొని, సదా ఆయన యాజ్ఞల నుల్లంఘింపక, మనోవాక్కాయ కర్మలయందు ఆయనయందు భక్తిని వెల్లడిజేయుచు, ఆయన చేసిన బోధను శ్రవణ, మనన, నిధి, ధ్యాసలయందుంచుచు, నిజ మనోధనములు నాయన కర్పణ జేయుచు, నేమానవు డాయన వలన విద్యను సంపాదించునో యా మానవుడే చివరకు తరించును గాని తదితరులు తరింపరని రూఢిగా నమ్మవలసినది.

ఇట్లు గురు స్వరూపమును గురించి తెలిసికొనినవారమై, తిరిగి మన అద్వైత నిష్కామ్య కర్మ విషయమునకు మరలుదము. దానికి జ్ఞాన మావశ్యమని లోగడ దెలిపియుంటిని. దానిని పొందదలచినవారు వెనుకటి ప్రకరణమందు వివరించిన సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించినవారలై అంతటితో కృతార్థులమైతిమని తలంపక పైన నిరూపింపబడిన శ్రేష్టమైన ఆత్మజ్ఞానము నెరుంగుటకు నొక సద్గురువు నన్వేషించుచు బోయి, లభించిన గురువునకు శుశ్రూష జేయుచు,

వారివలన యీ జ్ఞానోపదేశమును బొందవలసియుండును. ఈ సందర్భ
ములో భగవంతుడైన శ్రీరాములవారు, తన తమ్ముడైన లక్ష్మణ
స్వామి తనను ప్రార్థింప, ఆయనకు బోధించిన జ్ఞానబోధ అధ్యాత్మ
రామాయణములో గాన్పించుచున్నందున, వారు దెలిపిన సందలి
సారాంశములనే పాఠకుని యుపయోగార్థమీ క్రింద తెలుపుచున్నాడ.

"పూర్వ జన్మలయందు జేసిన కర్మలకు ఫలితముగా మానవు
లకు శరీర మేర్పడుచున్నదనియు, అట్టి శరీరమందు అభిమానమును
గలవారలై, తిరిగి ప్రియములు, అప్రియములగు కర్మలను చేయుటయు,
వానివలన ధర్మము, అధర్మములు తటస్థించుటయు, అందువలన
నీ జన్మ పరంపరలకు కారణమగుచున్నదనియు గూడ లోగడనే దెలిపి
యుంటిని. ఇట్టి సంసారము గలుగుటకు, అజ్ఞానమే కారణముగాని
మరి యేదియు గాదని యెఱుంగవలసినది. అట్టి యాజ్ఞానమును, దాని
వలన గలుగు సంసారమును, నాశనముచేయ సమర్థతగల జ్ఞానోపదేశ
మును జేయుచున్నాడ. దానిని గ్రహించి, యాచరింపుము. అజ్ఞాన
మును నశింపజేయుటకు "జ్ఞానమునకుతప్ప కర్మకు గాని, మరి యే
యితరమునకు గాని, సమర్థత జాలదు".

"పురుషార్థమును సంపాదించుటకు, జ్ఞానమనునది యెట్టులో
అట్టులే కర్మగూడ సాధనముగాన జీవునికి కర్మ చేయదగినదని వేదము
లలో చెప్పబడినది కావున, కర్మ యనునది అనర్థమునకుగాక జ్ఞానము
నకుకూడ సహాయకారిగా నుండుననియు, కర్మ సహాయములేనిదే
జ్ఞానమొకటియే మోక్షము నీయజాలదనియు, నిదియునుంగాక జీవు
డైన వాడెవడు కర్మను యాచరించడో, యాతడు దోషమును బొందు
చున్నాడని వేదములలో చెప్పబడియున్నది. కాన, జిజ్ఞాసువులకు
(మోక్షము కొరకై ప్రయత్నించు వారలకు) యెల్లప్పుడు కర్మను
చేయుచుండుట ముఖ్యావశ్యకమని కొందరు వాదింతురు. కాని, ప్రపం
చము సందలి "కార్యముల" నుదయింప జేయుటకు "కారణము"
లావశ్యకమైయుండినట్లుగాక, జ్ఞానము (విద్య) యనునది యితర సహా
యము కోరకయే తానే "కారణమై" స్వతంత్రముగా శాశ్వత

కార్యముల నుదయింపజేయ సమర్థత గలిగియున్నది. కాన, జ్ఞానము నకు సహాయకారు లుండవలసిన పనిలేదు. అందువలన పైన చెప్పబడిన వాదన సరియైనది కాదని యెరుంగవలసినది.

“ ఇదియునుంగాక, క్రతువనునది శాశ్వత ఫలమునిచ్చునదియే యైనను కొన్ని యంగముల గోరునదియై యుండినట్లు, జ్ఞానముకూడ యావజ్జీవ పర్యంతము అగ్నిహోత్రాది కర్మలను అంగములుగా కోరి నదియై, జీవునికి తటస్థించు కర్మ సమూహములతో కలసి ముక్తి నిచ్చుచుండునని సందిగ్ధాంశముల జేర్చి సమర్థింపఁజూచు వాదపరులు కొందరు యుక్తిచే వాదింతురు. కాని యదియుకూడ అనుభవ విరుద్ధ మైనదిగాన సరియైనదికాదు. ఏలయన, క్రతు వనునది దేశకాలాది నియమములను గోరునదియై యున్నది.

జ్ఞాన మట్టులేవియు గోరకయే యెల్లపుడు వేదవాక్య విచారణ చేయుచుండుటవలన సిద్ధించునదియై యున్నది. కర్మ యనునది శరీర మందలి యభిమానముచే బయలుదేరునదియై యున్నది. జ్ఞానమనునది యట్టి శరీరాభిమానము వదలిపోయి పరిశుద్ధమైన మనస్సుగల వారి యందు బయలుదేరును. కర్మ యనునది కర్తృ కర్మాదికమును గలుగ జేయుచు వానివలన కల్పింపబడు శరీర మందలి యహంకార మమ కారములచేత చేయఁబడునదియై యున్నది. కాన నహంకారము కర్మను జేయించుటకు కారణమగుచున్నది. అట్లు కలుగజేయబడిన యహంకార మమకారాదులను వానిని ధ్వంసము చేయునదియైన జ్ఞాన మా యహంకార మనునది నశించిన వెనుకనే ఆత్మ సంబంధమైన నిర్మల జ్ఞాన విచారణయందు సక్తమగుచున్నది. కాన జ్ఞానమును, కర్మయును, పరస్పర విరుద్ధములైన ధర్మములను కలిగియున్నవని తేట తెల్లమగుచున్నది. పరస్పర విరుద్ధములైన శీతోష్ణములకు ఒక్కచోట నిలచుటకు సావకాశముండనటులే యీ రెండును ఒకచోట నిలచుటకు గాని యొకదానితో మరియొకటి గలియుటకుగాని సావకాశము లేదని యెరుఁగునది. మరియు ఫలమును బొందు విషయములో క్రతువును, జ్ఞానమును, భిన్నభావము గలఁగుటచే యీ దృష్టాంతము సరియైనది.

కాదు. కాన కర్మబలము విద్యకు తోడు గావలెనన్న వాదన నిరాక రింపబడుచున్నది.

"నియమింపబడిన కర్మలు విడచిపెట్టినందువలన "ప్రత్యవాయము" అను దోషము రాగలదని తలంచుట, వివేకహీనమైన యనాత్మ బుద్ధియేగాని యొండుగాదు. ఆత్మతత్త్వ మెరింగిన వారలకీ సందేహము తోచనే తోచదు. ఇది విషయ భోగములయం దాసక్తి గలిగి క్రియాఫలాకాంక్షులతో జ్ఞాన మెరుంగక కర్మ చేయువారికి చెప్పినదిగాని ఆత్మతత్త్వ మెరింగిన వారికి చెప్పినదిగాదు. కాన విద్యను (జ్ఞానమును) సంపాదించిన ప్రతి జ్ఞానియు కర్మను నవశ్యము విడువ వలసినదే.

"అవిద్యా బంధములలో చిక్కుకొనియుండి యా బంధములను త్రెంపుకొని కృతార్థుడు గావలెనని యుద్దేశించు ప్రతి మనుజుడు (జీవుడు), పరిశుద్ధ హృదయుడై, లోగడ దెల్పిన మాయ వలన నేర్పరుపఁబడిన పంచభూత సంబంధమైన స్థూల, సూక్ష్మ, కారణంబులను ఉపాధిత్రయమును పంచకోశములను గురించి గురుబోధయొక్క మహాత్త్వర బలముచే విచారణచేసి "నేతి, నేతి" అను వేదవాక్యానుసరణిగా శరీరాదులను, వాని యందలి యభిమాన మమకారములను పరిత్యజించి, పరాత్మను, పరమాత్మగా నెరుంగ గలిగిన స్థితిని బొందువరకు వేదోక్తమైన పద్ధతి ననుసరించి కర్మల చేయుచుండి, పిదప కర్మాచరణమును వదలవలయును.

"తదుపరి దీక్షతో సకలేంద్రియములను శబ్దాది విషయ పరంపరలనుండి మరల్చి, నిర్మలమైన యాత్మ వస్తు విచారణయం దాసక్తి గలవాడై, "తత్త్వమసి" మొదలుగాగల మహావాక్యముల మహత్త్వమును, గురుబోధ వలన నెరింగినవాడై, అందలి యర్థమును సదా నిదిధ్యాసలయం దుంచుకొనవలయును.

"అట్లు చేయుటవలన అంతవరకు ఉపాధుల వలన గలుగబడిన, జీవాత్మ పరమాత్మ భేద తత్త్వము నశించి, స్వయముగా ప్రకాశించు

విజ్ఞానము నిర్మలమైన యంతఃకరణయందు కలుగును. అది కలిగిన వెంటనే జీవసంసారమునకు కారణమై, కర్తృ కర్మాధికారములతో గూడినదగు మాయ, మాయమగును. ఈ సందర్భంబున కొందరట్లు మాయమైన మాయ తిరిగి కాన్పించిన, కర్మ తిరిగి యావశ్యకమని చెప్పుదురు. కాని యిది వట్టి కల్ల. ఎట్లన, వేదప్రమాణసారమైన విజ్ఞాన మహిమచే నశించిన యవిద్య, తిరిగి గాన్పించుట యసంభవము.

“జ్ఞానమే స్వరూపముగా గలవాడును, ఉత్కృష్టమైన యానందముతో గూడినవాడును, అద్వితీయుడును, నిర్మలుడును, తేజోరాశియునైన యాత్మ వలన యెన్నటికీని అవిద్య కలుగనేరదని యెరుంగునది.

“అట్లు నశించిన యా యవిద్య, “నేను కర్త” యను అహంకార బుద్ధిని పొంది వేరుకార్యముల సృజింప సమర్థత నెట్లు పొందగలదు ? అట్టి స్థితిలో స్వతంత్రమై ప్రకాశించు విద్యకు, ముక్తినీయు విషయములో నితర వస్తు సహాయము కోరదనియు, ఆ కారణముచేత మోక్షము బడయుటకు సాధనయొక్క జ్ఞానమే యనియు తైత్తిరీయోపనిషత్తునందు చెప్పబడినది.

“నిర్మలమైన మనస్సు గలవాడై, శ్రద్ధతో గూడుకొనియుండు మనుజుండు, సద్గురుని యనుగ్రహముచేత “తత్త్వమసి” మొదలుగా గల వేదములలో ప్రకాశించు మహావాక్యముల విచారణచేసినందు వలన, నాత్మకును, జీవునకును గలదని మొదటిలో చెప్పబడిన భేదమును మరచినవాడై, ఆ రెండు నొకటేయని యెరింగినవాడై, అజ్ఞానముచే గల్పింపబడిన సుఖ దుఃఖములతో గూడిన యీ ప్రపంచమున నెప్పటికి కంపము నొందక, మేరు పర్వతమువలె స్థిరముగల మనస్సును బొంది, యజ్ఞానమను మేఘమును చెదరగొట్టబడిన వాడై, జీవన్ముక్తి సుఖము ననుభవించును.

“ఈ జీవుడు, స్థూలసూక్ష్మ కారణ శరీరములను నుపాధిత్రయంబున ప్రకాశించు నన్నమయాది కోశములయందు నిలచుట వలన, ఆయా యాకృతిని దోచుచున్నాడు, గాని సరియైన విచారణ

చేసి చూచినట్టులైన అతఁడు దేనితోఁ గూడియుండనివాఁడు. అద్వితీయుడు. జనన మరణములు లేని వాఁడు. జాగ్రత్ స్వప్నాది భేదములతో గాన్పించు మూఁడువిధములైన వృత్తులు, త్రిగుణములతో గూడిన బుద్ధివలన కల్పింపబడినవేగాని, నిత్యుఁడు, పూర్ణుడు, నిర్మలుఁడు, నయిన పరమాత్మ వలనఁ గల్పింపబడినవిగావు. తమోగుణమే ప్రధానముగా గలిగి, జ్ఞానరహితత్వమును గలిగిన యంతఃకరణ వృత్తితో, తనువు, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, చిదాభాసుడు, కూటస్థుడు మొదలగు వానితో తిరుగుచున్నంతవరకు నీ సంసారోత్పత్తి కలుగుచునే యుండును. ఉపనిషద్వాక్య విచారణతో గూడిన నిధిధ్యాసల నేర్పరితనమువలన భ్రాంతి వదలిపోగానే యీ జీవ సంసారము నశించును.

"ఫలముయొక్క లోపలనుండు రసమునంతయు ద్రావి, పైచర్మమును దూరముగా పారవేయువిధమున అనుభవముతో గూడిన వేద ప్రమాణములచే సమస్తము నెరింగి "పరమాత్మ" యనెడి శ్రేష్ఠమయిన యమృతమును ద్రావునతఁడు, మిథ్యారూపమైన ప్రపంచమును విడచిపెట్టును, ఆత్మ దేహమును పుట్టుక, చావు, వృద్ధి, క్షీణము, మొదలగునవేవియు లేనివాడు. అద్వయుఁడు. నిరుపమానందరూపుఁడు, స్వప్రకాశుడు, సర్వలోకైక సాక్షియని యెరుంగునది.

"పరమ జ్ఞానానంద స్వరూపమైన యిటువంటి యాత్మ వస్తువునందు దుఃఖముల కునికి పట్టును, అసహ్యాకరమును నయిన ప్రపంచమెట్లు గనఁబడును? జ్ఞానము లేని కారణముచే, భ్రాంతివలన గోచరమైనను, తనకు శత్రువైన జ్ఞానము పుట్టగనే, సూర్యుని చూడగనే చీకటి నశించునటు లీభ్రాంతియు నశించును.

"ఒక వస్తువును జూచి వేరొక వస్తువని భ్రాంతిచే ననుకొనుట "యధ్యాస" యని పెద్దలచే దెలుపబడినది. చీకటియందు 'త్రాడును' చూచి 'పాము' ను భ్రాంతినొంది భయపడునట్లు ప్రపంచ రహితమైన 'బ్రహ్మము' ను జూచి "శరీరము" మొదలఁగాగల ప్రపంచమని విచారహీనులైనవారు భ్రమింతురు.

"వికల్పములను కలిగించుటకు హేతుభూతమైన మాయను తనయందు లేనివాడును, చిదాత్మకుండును, సర్వమునకు కారణమైన వాడును, దుఃఖములకు సంబంధము లేనివాడును, కంటికి కనబడు ప్రపంచమునకు విలక్షణుండును, కేవల బ్రహ్మమును అగు నాత్మ యందు "నేను" అను "అధ్యాస" మొట్టమొదట గల్పింపబడినది. ఇచ్ఛాద్వేషులు, రాగద్వేషములు, సుఖ దుఃఖములు మొదలగు ధర్మ ములు గల యంతఃకరణ వృత్తులు, ఆత్మయం దెల్లప్పుడును సంసార మును గల్పించుటకు కారణమగుచున్నవి. కావున సుషుప్త్యవస్థయందు అవిద్య యనునది, మాయలో లీనమై శుద్ధ మాయయైనందున, అవి యన్నియు లేకపోగా, పరమాత్మ మనకు నిర్మలముగ దెలియబడు చున్నాడు. మరియు ననాది సిద్ధమైన యీ యజ్ఞానమందు బుట్టిన, యీ యంతఃకరణమందు ప్రతిబింబించిన పరమాత్మ ప్రకాశము, జీవుడనియు, ఆ యంతఃకరణమునకు సాక్షియగుటచే వేరుగానుండిన కూటస్థుడే "త్వం" పదార్థమునకు లక్ష్యమైన పరమాత్మ యనియు నెరుంగునది.

"చిదాభాసుండును, ఇంద్రియములతో గూడిన మనస్సును, ఒకచోట జేరియున్న కారణముచేత, అగ్నిచే గాల్పబడు నినుపగుండు మాదిరిగ ఒకదానియందలి ధర్మము మరియొక దానియందు భ్రాంతిచే గలుగుచుండును. కావున జడత్వము, అజడత్వము అనునవి చిదాత్మ, బుద్ధులయందు, వరుసగా ఆరోపింపబడి "జడుడు ఆత్మ, చేతంబు జ్ఞాత" యనియెడు భ్రాంతి ప్రపంచమందు గలుగుచున్నది. గాన ప్రతి మను జుడు ఒక గురువుయొక్క యుపదేశ వచనములవల్ల బుట్టిన నిర్మలమైన జ్ఞానముయొక్క యనుభవముచే ప్రకాశింపబడుచున్నవాడగుచు, తన యందు నాత్మని చూచుచుండవలెను.

"అజుడను, అద్వయుడను, స్వయంప్రకాశుడను, నిరామయుం డను, నిత్యవిభాసమానగుణుండను, అవిద్యనుండి జనించిన యావరణ విక్షేపణాదుల వలన గల్పింపబడిన దోషములతో సంబంధము లేని వాడను, అనంతరూపుడను, అనంతమైన జ్ఞానముచే నొప్పువాడను,

సంపూర్ణుడను, యెల్లప్పుడు ముక్తుడను, అంతులేని శక్తులతో గూడిన వాడను, నిర్వికారుండను, సర్వదా వేదములయందు చెప్పబడుచుండు వాడను, సదా పండితుల హృదయములయందు నిలుపుకొన బడిన వాడను, విభుడను, దేశ, కాల, వస్తు పరిచ్ఛేదవ్యలీల లేనివాడను, పర మాత్ముడను, అని యీ విధముగా నెల్లప్పుడు మదిలో దలంచుచు నితర విషయములయందు తగులని స్థిరమైన నిర్మల బుద్ధితో "ప్రత్య గాత్మను" అనుసంధించుచుండెడి సత్పురుషునకు, కాలక్రమమున విజ్ఞానము కలుగును. దివ్యరసాయనము తిన్న సేవించుటవలన, శరీర ముల యందలి రోగములను బోగొట్టు రీతిని, ఆత్మానుసంధానము, అవిద్యను దానివలన కల్పింపబడిన సకల కర్మములను నాశనము చేయును."

అని శ్రీరాములవారు తమ్ముడైన లక్ష్మణస్వామికి బోధ చేయుచు, దాని యనుసంధానక్రమము మెఱుంగ కుతూహలముతోనున్న తమ్మునికి దాని స్వరూపమును గురించి యిటులఁజెప్పెను.

"విఘ్నము లేమియు లేకుండు నొక యేకాంత స్థలమందు సుఖాశీనుడై యింద్రియములను స్వేచ్ఛగా బోనీక నివారించి, మనోని గ్రహము గలిగి, పరిశుద్ధమైన మనస్సుతో ముక్తిని సాధించుటకు జ్ఞానముతప్ప మరియొక సాధన మీ ప్రపంచమున లేదని నిశ్చయించిన వాడై విజ్ఞానముతోఁగూడిన దృష్టిచే సంగంబు (బంధమును) తెంపివేసి, అసాధ్యమును, భయంకరము నయిన జనన మరణ రూప మహాసముద్ర మును దాటు నిచ్ఛగలవాడై నిండుమనస్సుతో "తానే పరమాత్మ" నని పండితునివలె నెంచుకొనుచు, నిర్వికల్ప సమాధియందు నిలుచు టయే కర్తవ్యమని యెఱుంగునది.

"సమస్తమునకు కారణమైన, ఆత్మయందు పరమాత్మ దర్శ నము కాఁగా ప్రపంచమందలి సమస్తము లయింపజేసి తాను, పూర్ణుడు, ఆనందరూపుడుగా ప్రకాశించుచుండును.

"త్రిపుటీలయము గావించిన తత్త్వజ్ఞునికి వెలుపలగాని, లోపల గాని, యీ ప్రపంచ మనునది యేమాత్రముగూడ దోచదు.

## ఇంక సమాధిని సాధించు విధమును దెలిపెదను.

“ సమాధికి పూర్వము చరాచరాత్మకమైన ప్రపంచమంతయు “ ఓం ” కార స్వరూపమేగాని వేరుకాదని భావింపవలయును. అవిద్యా వశంబున నీ ప్రపంచమే వాచ్యముగను (అనగా తెలిసికొనదగినదిగను) ప్రణవమే వాచకంబుగను (అనగా వాచ్యార్థమును దెలుపు పదంబుగను) తెలిసికొనదగినది. జ్ఞానోదయ కాలంబున ఈ యూహ కవ్వబడి యుండును. స్థూలశరీరము నభిమానించువాడైన విశ్వుడు, అను పేరు గల జీవుడు “ అ ” అను నక్షరముతో నెరుంగబడువాడుగను, సూక్ష్మ శరీరము నభిమానించువాడైన తైజసుడు అను పేరుగల జీవుడు, “ ఉ ” అను నక్షరముతో నెరుంగబడువాడుగను, కారణ శరీరము నభిమానించువాడైన జీవుడు ‘ మ ’ అను నక్షరముతో నెరుంగబడుచున్నవాడుగను, అన్ని వేదములయందు దెలుపఁబడుచున్నది. ఈభావము సమాధి దశకు పూర్వమందుండుండునదిగాని, తరువాత నుండునదికాదు. పరమార్థమును విచారించినయెడల ఇందులకు సావకాశముండదు. ఇట్లనేక విధంబుల నిరూపణ చేయబడిన విశ్వుడను పేరుగల జీవుని, ‘ అ ’ కారమును, ‘ ఉ ’ కార మధ్యంబున లయము చేయవలెను. పిమ్మట రెండవ యక్షరమైన ‘ ఉ ’ కారమును (తైజసుని), అంత్యాక్షరమగు ‘ మ ’ కారమునందు లయింపజేయవలయును. తదుపరి ‘ మ ’ కారమునుగూడ కారణ శరీరాభిమానియగు ప్రాజ్ఞునితో, పరుడును, కూటస్థుడును, జ్ఞానఘనుడు నయిన యీశ్వర సాక్షియందు గలువవలెను.

“ అటువంటి నేను (శ్రీరాముడు) విజ్ఞాన దృక్కుకు ప్రత్యక్షనుండువాడను. నిర్మలుండను. ఉపాధిరహితుండను, ముక్తినిచ్చు పరబ్రహ్మమునను ననుభవము అప్పుడు గలుగును.

“ ఈ విధముగా నెల్లప్పుడు పరమాత్మానుభవమను ఆనందములో మునిగి తేలుచుండు జ్ఞాని (పండితుడు) సమస్త ప్రపంచమును మరచినవాడై సత్తు చిత్తుల సుఖము ఆత్మయందు ప్రకాశింప, జీవన్ముక్తిని బొందినవాడై, తరంగ రహితమైన సముద్రమందలి జలము

వలె నిర్మలముగా చలింపకయుండును. ఎల్లప్పుడు సమాధి యోగంబునకు నలవాటుపడి, యింద్రియ విషయంబులను వదలి, కామక్రోధాది శత్రువుల నార్గుర జయించి, షడ్గుణముల జయించిన యాత్మ గలవాడగు పండితునకు నేనే యతడుగా జ్ఞాన విషయకుండ నగుదును.

“రాత్రింబవళ్లు నీవిధముగా పరబ్రహ్మమును గొలిచి, మాయ వలన నేర్పరుపబడిన బంధముల నన్నింటిని, అభిమాన మమకారములను, త్రెంపుకొనినవాడై యుండు నతండు, ప్రారబ్ధమంతయు ననుభవించి, యది నాశనము కాగానే సంతోష భరితమైన యాత్మగలవాడై నాలో నైక్యమై తిరిగి యెన్నటికిని జనన మొందడు. “యెల్లప్పుడును జన్మయనునది భయమును, దుఃఖమునుగలుగ జేయునదిగా నెరింగినవాడై, శాస్త్రచోదితములైన సమస్త కర్మములను వదలి, పిదపసమస్త జీవుల కాత్మయైన తన్ను భజించుచు, సమస్తమునకు నధిష్ఠానమైన తన యందుకనిపించు ప్రపంచము నందలి మాయచే కల్పింపబడిన నామరూపములనువదలి అస్తి (సత్తు / ఉనికి) భాతి (చిత్తు / ప్రకాశము) ప్రియ (ఆనందము / సుఖదుఃఖములులేనిది) రూప బ్రహ్మంబు నభేదంబుగా భావింపఁజెల్లును. అట్లు భావించిన పిమ్మట యాతండు సముద్రమునందలి జలము వలెను, క్షీరమునందు పాలవలెను, ఆకాశమునందు ఆకాశము వలెను, వాయువునందు వాయువువలెను, అధిష్ఠానమైన నాయందు లీనమగును.

“తన ప్రారబ్ధము ననుభవించుచు భూమిమీద నున్నను వేద చోదిత యుక్తి భావముల ననుసరించి మిథ్యగా భావించి చూచిన యెడల ప్రపంచ భ్రాంతి తొలగిపోవును. సమస్త ప్రపంచమును నస్మదాత్మకంబుగ (నాయందే కలిగియుండినట్లుగ), నెరుంగలేనంతవరకు నెల్లప్పుడు ఏకాగ్ర బుద్ధితో నన్ను సేవించుచుండవలయును. నిర్మలమైన శ్రద్ధాభక్తులతో గూడియున్న మనుజుల హృదయములలో నేను నిలచియుందును.

“నీవు నాకు ప్రియుడ వగుటచే శ్రుతులయొక్క సారమును, నిశ్చయమైనదియును, అతి గూఢమైనదియును నయిన యీ బోధను

నీకు దెలియఁజెప్పితి. దీనిని విచారణ చేయుటవలన పాపమంతయు తొలగిపోవును.

కనుల యెదుట గనఁబడు నీ ప్రపంచము యావత్తు అసత్యమని నీమనస్సునందు బూర్తిగ దెలిసికొన్నవాడవై, దానిని వదలి నా స్మరణయందు నిర్మల మానసుండవై నిరామయ స్థితిని బొంది యెల్లప్పుడును సుఖంబుగ నుండుము.

" ప్రకృతి గుణములు మూడును, తనయందు లేని సగుణేశ్వరునిగాగాని, లేక సర్వజ్ఞత్వాది ప్రశస్త గుణములు గలవానిగాగాని, పరిశుద్ధమైన మనస్సుతో నన్నెవ్వడు భజించునో, యతడు నేనే యగును. అట్టివాని పాదరేణువులచేత మూడు జగములును పవిత్రము చేయబడినవగును.

" నేను చేసిన యీ జ్ఞానబోధ వేదాంత సారంబును, ఉపనిషద్వాక్య చోదితంబును, సాటిలేనిదియునై యొప్పుచున్నది. ముక్తి నపేక్షించు నుపాసకులకు ముక్తి నిచ్చునదియునై యున్నది.

" నాయందు పూర్తియయిన భక్తియును, నా వచనముల యందు పూర్తియయిన శ్రద్ధయును, గలవారలై గురువునొద్ద యథావిధిగ రామగీతమును పారాయణము చేయుచుండువారలు, పాపముల బాసిన వారలై నన్ను బొందగల్గుదురు. ఇది సత్యమని యెరుంగవలయును. "

ఇవ్విధముగా శ్రీరాములవారు తమ్ముడైన లక్ష్మణస్వామికి తత్వబోధను చేసిరి. అదృష్టవశముచేత భగవంతుని ముఖమునుండి వెలువడిన, కర్మ, భక్తి, జ్ఞానయోగ సంబంధమైన సారవంతములగు నీ బోధలు ఆంధ్రకర్తయైన బ్రహ్మశ్రీ పిసుపాటి నారాయణ శాస్త్రి గారిచే రచియింపబడిన " ఆంధ్రాధ్యాత్మ రామాయణమునందు " లభించినందున వాని విషయములో భగవంతుని వలన స్వయముగా చెప్పబడియున్నందున నేమానవునికి సందియములు బొందవలసిన కారణములుండదగని గౌరవనీయములగుటచే పాఠకుల యుపయోగా

క్షమై వాని సారాంశములనే, గ్రంథకర్తగారికి ననేకాభివందనము లాచరించుచు నిందు జేర్చియున్నాడ. కాన కృతార్థులు గాదలచిన ప్రతి మనుజుడును (జీవుడును) వీనిని చదివి, గ్రహించి, మనస్సునందు జీర్ణింప జేసికొని, యెవరి కనుకూలమైన యోగమును వారు చేపట్టి, అభ్యసించుచు, నొక సద్గురువు ననుగ్రహ సహాయములనుగూడ బొందిన వారలై కృతార్థులగుదురని నా నమ్మిక.

ఇంతవరకు దెలుపబడిన సారాంశములవల్ల జీవుని జన్మ పరంపరలకు కారణము కర్మబంధమే యనియు, ఆ కర్మబంధ మనునది మనస్సుయొక్క సంకల్పముల మూలముగా కలుగుచున్నదనియు, ఆ మనస్సంకల్ప నాశనము కానిది బంధనాశనము గాదనియు, బంధ నాశనము కానిది జీవునికి జన్మ పరంపరలు తప్పి కృతార్థుడు కానేరడనియు తేలినది. కాన ఆమనస్సుయొక్క స్వరూప స్వభావంబు లెట్టివో, సంకల్ప నాశనమగుటకు మార్గమెట్టిదో దానిని గురించి విచారించెదము.

మనస్సనునది పంచభూత సమ్మేళనమైన మన శరీరమునందలి 24 యింద్రియములలో నొకటియై యున్నదని లోగడ జెప్పియుంటిని. దీనినే మాయాంతర్గతమగు నంతఃకరణ యనిగూడ జెప్పుచున్నారు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులను పంచతన్మాత్రలు గుణములుగా గలిగిన పంచభూతములచే నేర్పరుపబడిన ప్రపంచమును, ఆ ప్రపంచ విషయములను, మన కంటిద్వారా జూచునది మనస్సు. ఈ మనస్సు, యేవస్తువును జూచిన, ఆ వస్తువు మనోరూపమును బొందును. తదుపరి తన రూపమును బొందిన యావస్తువు రూపముగా పరిణమించు స్వభావ మా మనస్సునకు గలదు. ఇందులకు దృష్టాంత మేమన:—మన పూజా గృహమున మన కంటియెదుట నొక భగవత్స్వరూపమును నిల్పి, దానియందు మనస్సును నిశ్చలముగానుంచి, కన్ను తెరచి పూజించుచుండ, కొంతసేపటికి కన్ను మూసినను ఆవిగ్రహ రూపము మనకంటి కెదురుగా నిలచియున్నట్లు గాన్పించుటయే. దీనియర్థ మేమన, కన్ను తెరచి పూజించునపుడు మన మనస్సు మన కంటిద్వారా దాని కెదురుగా నిల్పబడిన విగ్రహమును జూచి

దానియందు పూర్తిగా వ్యాపింప, ఆ విగ్రహము మనోరూపమును బొందును. అంత మన మనస్సు విగ్రహ రూపముగా కన్ను మూసి నప్పుడు మన కంటియెదుట పరిణమించుచున్నదని యర్థము. అట్టులే ప్రపంచ కారణములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులను పంచతన్మాత్రలను మనస్సు మన కంటితో జూచి, వానియందు వ్యాపింప, ఆ పంచతన్మాత్రలు మనోరూపమును బొందును. అంత మన మనస్సే యీ పంచ తన్మాత్రలకంటె వేరుగాని ప్రపంచ రూపముగ మన కంటియెదుట పరిణమించుచున్నది. కాన మనము జూచు నీ ప్రపంచము మన మనస్సునందే యున్నదనియు, నీ ప్రపంచము మనోమయ ప్రపంచమనియు దెలిసికొనవలయును. కనుకనే :—

తే॥ గీ॥ సర్వ సంసారమును మానసమున నొదవు
సర్వ సంసారమును మానసముననుండు
సర్వ సంసారమును మానసమున నడగు,
సర్వ సంసారమును మానసంబె యగును॥

అని శ్రీరాములవారు శ్రీమదాంజనేయ స్వామివారికి బోధించినట్లు సీతారామాంజనేయ సంవాదము వలన గాన్పించుచున్నది.

కాన దీనినిబట్టి జూడ, మనస్సు కార్య, కారణములనెడి రెండవస్థలను బొందుచు, అందులో కార్యావస్థయందు తానె ప్రపంచా కారముగ నేర్పడి అందు విషయములను గల్పించుచున్నది. కారణా వస్థయందు తానె యవిద్యా రూపమున జీవుని శరీరమునందు ఆవరించి నిలచి, కించిత్ జ్ఞానిగా జేసి, తాను గల్పించిన ప్రపంచ విషయము లను జూపి, వానియందు భ్రాంతిని కలుగజేసి, తదనుగుణ్యమైన కర్మల జేయించి, కర్మబద్ధుని జేసి జీవునికి జన్మ పరంపరలను కలుగఁజేయు చున్నది. ఇట్లు ద్వంద్వ స్వభావంబుతో నీ మనస్సు ఎంతవరకు వ్యవహ రించుచున్నదన :—

చ॥ మనసు సుషుప్తియందు దెనసి మ్రగ్గిననేమియు దోపకుండు, న
మ్మనమటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గిదోచు, నీ
ఘనతర బంధ మోక్షమయ కారణకార్యములెల్ల దానయై
యనిశము లోవెలిన్ దిరుగు నారయ నెమ్మనమట్లుగావునన్॥

తా॥ ఈ ప్రపంచమనునది మనస్సు లయము నొందిన సుషుప్త్యవస్థయందు నేమియు దోపకుండుటయు, జాగ్రదవస్థయందది మేలుకొనగనే, సర్వమును దోచుటయు ననుభవసిద్ధమైయున్నది. కావున, జాగ్రత్ స్వప్నావస్థలలో "నాది, నాది" యని తోపింపజేసి బంధమును కలుగజేయుచు, సుషుప్త్యవస్థయందు అట్లు తోపింపజేయనప్పుడు మోక్షమును కలుగజేయుచు, కారణకార్య రూపముల రెంటితో నీమనస్సే శరీరములోపలను, వెలుపలను స్వేచ్ఛగా సంచరించుచు నీ ప్రపంచమంతయు స్వస్వరూపముగా నొప్పుచున్నది.

కాన యీ విచారణనుబట్టి సర్వ ప్రపంచమును మనసేయని తేలినది గదా!

ఇట్లు మనస్సు యొక్క స్వరూప, స్వభావముల నెరింగినవారలై యింక మనస్సంకల్ప నాశనమునకు మార్గమెద్దియో విచారించుట కర్తవ్యము. మనస్సంకల్ప నాశనమనగా మనస్సును లేకుండజేయుట యని యర్థము. దీనినే యమనస్కమనియు జెప్పుచున్నారు. అట్టి స్వరూపమైన మనస్సేయోగమునకుండదో దానినే యమనస్కయోగమని యెరుంగునది. సమస్త వేదశాస్త్రములు పఠనచేసి వాని సారాంశముల విచారించుటవలన గాని బ్రహ్మాండమైన శిష్టాచార సంపత్తిని బడసి, జపతపః ప్రభృతులను జేయుటవలనగాని, సమస్త తీర్థయాత్రలు సేవించుటవలనగాని, యీ యోగము లభించునది గాదు. అపరిశుద్ధ మనస్సుగలవారి కిది లభించుట చాల దుర్ఘటము. పరిశుద్ధ మనస్సుగలవారలై విజ్ఞానమును సంపాదించి, ఆత్మానాత్మ విచారణ చేయగల సమర్థతను బొందిన మహాపురుషుల కిది అతిసులభముగా లభించును. ఈ యోగమును సిద్ధింపజేసికొన్న విజ్ఞానవంతులకు సదా యాత్మావలోకనము చేయుచుండగలిగిన భాగ్యము లభించును. అట్టి యాత్మావలోకనము వలన కలుగు పరమానందము వారికే తెలియవలెనుగాని తదితరులకు దెలిసికొనుటకు సాధ్యపడదు. అట్టి పుణ్యాత్ములకు మోక్షమనునది కరతలామలకముగా నుండునని యెరుంగునది. కాన దీనిని సాధించుటకు విజ్ఞానముతప్ప వేరు సాధనములేదు. వాస్తవమైన స్థితిలో

మనస్సనునది పరబ్రహ్మమునందు భ్రాంతిచే నారోపింపబడుటవలన యీ మనోవికారము లన్నింటికి లోనుగావలసివచ్చుచున్నది గాని మరి యేమియుగాదు. "త్రాడు" ను జూచి "పాము" అని భ్రాంతిని జెంది భయపడిన వానికి విచారణమీాద దాని యదార్ధ స్వరూపము "త్రాడు" అని తెలిసికొన గలిగినప్పుడు "పాము" అనునదే గాన్పించనట్లు, సర్వమునకు నధిష్ఠానమైన యీ బ్రహ్మముయొక్క యదార్ధ స్వరూపమును, విజ్ఞానమును సంపాదించి తెలిసికొనగలిగిన వారికి, భ్రాంతిచే గల్పింపబడిన "మనస్సు" అనునది గాన్పించనే కాన్పించదు. కాన అట్టి విచారణ చేయుటకు గావలసిన విజ్ఞానమును సంపాదించుట తదుపరి కర్తవ్యాంశము.

ఈ విజ్ఞానమును సంపాదించుటకు కావలసిన మనఃపరిశుద్ధతను బొందుటకు లోగడ రెండవ ప్రకరణమందు దెలిపిన సాధన చతుష్టయ సంపత్తిని బడసి, సంపూర్ణాధికారము గలవారలైయుండి, యీ యోగ సిద్ధినిబొంది, సదా, యాత్మావలోకనమును జేయుచు, బ్రహ్మానంద మును బొందుచుండు నొక సద్గురువు నాశ్రయించవలెను. వారు మున్ముందు హాస్త మస్తక సంయోగము జేసి "ఈ శరీరమును, ఇంద్రియములును నీవుకావు. నీవు వీని కతీతుడవై, యీ భ్రాంతి జ్ఞానమును, దాని పనులను జూచు సాక్షివై వేరుగా నున్నావు" అని బోధిం చును. ఇట్లు బోధింపగనే "తాను భ్రాంతి జ్ఞానముతో సంచరించు జీవుడను గాననియు, నాభ్రాంతి జ్ఞానమును, దాని పనులను దెలసికొను సాక్షిననియు" దెలిసి, ఒక క్రొత్త జ్ఞానమును బడసిన వాడగును. ఇట్లు క్రొత్తగా బడసిన జ్ఞానము "ప్రజ్ఞానము" అని పెద్దలవల్ల జెప్పబడుచున్నది. ఈ బోధవలన ప్రతి మానవునికిని భ్రాంతి జ్ఞానమని, ప్రజ్ఞానమని రెండువిధములైన జ్ఞానములు గలవని తేలినది. వీనిలో భ్రాంతి జ్ఞానమనునది "దేహేంద్రియాదులే యాత్మ యనియు, తాను జీవుడనియు, ప్రపంచము సత్యమనియు" బోధించును. "ప్రజ్ఞానమ" నునది "జగత్త" ను నదియు "జీవుడ" ను నదియు అసత్యమని బోధించునని యెఱుంగునది. ఈ ప్రజ్ఞానమునే శుద్ధ జ్ఞానమని, శుద్ధ జీవి యని వేరువేరు పేర్లతో జెప్పుచున్నారు.

ఇట్లు సద్గురువు వలన దెలుపబడిన బోధవాక్యముతో "నీవు" అను పదము సర్వకాలములయందు నశింపక నిత్యముగానుండి యితర సహాయమునుబొందకయే స్వప్రకాశముతో ప్రకాశించుచుండులక్షణము గల యాత్మ పదార్థమును నిరూపించుచున్నదని తెలసికొనవలయును. ఇటుల నెరింగిన వారలై సద్గురువు వలన బోధవాక్యమును వినగనే సచ్ఛిష్యునికి కర్తవ్యమైన శ్రవణము (వేదాంత వాక్యములను గురు శాస్త్రముల మూలమున వినుట), మనము (యుక్తులచే వినిన యర్థమును మనస్సున స్థిరము చేసికొనుట), నిధిధ్యాసలు (అట్లు స్థిరము చేసికొనిన జీవ బ్రహ్మైక్యమును సర్వకాలముల యందును రెండవ సంకల్పము లేకుండ ధ్యానించుట) అను పద్ధతుల ననుసరించి "అతీతుడవై వేరుగా నున్నదని చెప్పబడుచున్న సాక్షి స్వరూప" మెట్టిదో యీ శరీరములో నెచ్చట నున్నదో దానిని తెలిసికొనుటకై ప్రయత్నింతము. శ్రుతులలో అష్ట భూతములమధ్య పరమాత్మ స్వరూపుడు ప్రకాశించుచున్నాడని చెప్పబడుచున్నది. దీని యర్థమేమో విచారించెదము.

మన శరీరమందు శిరోభాగమను దానిలో "మెదడు" అని చెప్పబడు స్థానమున నెనిమిది రేకులు గలిగిన యొక యష్టదళ పద్మము కలదు. ఆ రేకులలో ప్రతిరేకునందును 125 చిన్న రేకులు గలవు. ఈ చిన్న రేకులు గలిగిన యష్టదళపద్మమును సహస్రార కమలముగా చెప్పుచున్నారు. అష్టప్రకృతులని చెప్పబడు, పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, తేజస్సు, అను నష్ట భూతములను నాపద్మముయొక్క అష్టదళములుగా నున్నవనియు, ఆ యష్టదళములు ఆయా భూతముల పేర్ల ననుసరించి పృథ్వీదళము, జలదళము, అగ్నిదళము, వాయుదళము, ఆకాశదళము, సూర్యదళము, చంద్రదళము, జ్యోతిర్దళము, అను పేర్లతో నెరుంగబడుచున్న వనియు చెప్పుచున్నారు. కాన పైన చెప్పబడిన శ్రుతిప్రమాణాను సారముగ, ఆ యష్టదళముల మధ్యనుండు "బొడ్డు" స్థానము పరమాత్మ స్వరూపుడుండు స్థానముగ గాన్పించుచున్నది.

పైన చెప్పిన దళములవద్దనుండి యింద్రియముల వరకు నాడుల ద్వారా సంబంధముగలదు. ఆనాడులు తిరిగి బయటనుండు నాడులనియు, లోపలనుండు నాడులనియు రెండు విధములుగా నున్నవి. బయటనుండు నాడు లింద్రియములకు మెదడునుండి సమాచారమును తీసికొని పోవునవియనియు, లోపలనుండు నాడు లింద్రియములనుండి మెదడునకు సమాచారమును తెచ్చునవియనియు నెఱుంగబడుచున్నవి. పరమాత్మస్వరూపుని తేజస్సు జ్యోతిర్దళము మీద పడి, యచ్చటనుండి నాడులద్వారా శరీరమంతయు వ్యాపించి, యింద్రియముల వరకు బోయి, ఆయా యింద్రియములు తమతమ పనులను నెరవేర్చుకొను సమర్థతను సదా కలిగియుండునటుల జేయుచున్నది. చుట్టు నెనిమిది దళములును మధ్య పరమాత్మ స్వరూపుని స్థానమైన బొడ్డును గలిగిన యీ కమలమును, చుట్టు నెనిమిది రంగులుగల యద్దములును, మధ్య నొక దీపమును గలిగిన యొక లాంతరుతో బోల్చబడుచున్నది. మధ్య నున్న దీపకాంతి స్వచ్ఛమైనను, నేరంగు అద్దముమీద పడినపుడా రంగు కాంతితో వెలువడి ప్రకాశించుచుండును గదా ! అట్టులే మధ్య నున్న పరమాత్మ స్వరూపుని తేజస్సు యేదళముమీద పడినప్పుడు ఆ తేజస్సు ఆదళ భూతరూపమునుబొంది, యాదళముకు సంబంధించిన యింద్రియ వ్యాపారములు జరుగుచుండును. ఏపనినైన చేయవలెనను సంకల్పము గలిగినప్పుడు పరమాత్మ స్వరూపుని శక్తి అనగా తేజస్సు, ఆపనికి సంబంధించిన భూత దళముమీద పడుననియు వెంటనే యా దళమునకు చైతన్యము గలుగుననియు, ఆ చైతన్య మంతఃకరణ రూపమును బొంది బయటనుండు నాడులద్వారా ఆపనికి సంబంధించిన యింద్రియములకు సమాచారము నిచ్చునవియు, ఆ యింద్రియములా పనిని చేయుచుండుననియు, అట్లు చేసిన సమాచారమును వెంటనే లోపలనుండు నాడులద్వారా పరమాత్మ స్వరూపునికి బోవుచుండుననియు తెలియవచ్చుచున్నది. ఈ పనులన్నియు " టెలిగ్రాం " తీగెల ద్వారా టెలిగ్రాంలు నడుచునట్లుగా ఒక్క-త్రుటిలో నాడులద్వార జరుగుచుండుననియు నెరుంగునది.

ఇట్టి యేర్పాట్లతో కూడిన శరీరమందు జీవుడు జ్ఞానేంద్రియములనుండి బయలు వెడలిన యంతఃకరణ వృత్తితోగూడి, యేజ్ఞానముచేత బాహ్యాంతర సర్వవిషయములను తెలిసికొనుచున్నాడో, ఆజ్ఞానమే "ప్రజ్ఞాన" మని చెప్పబడుచున్నది. ఇట్టి జ్ఞానస్వరూపమైన "ప్రజ్ఞానమే" స్వరూపముగా గలవాడు పరమాత్మ స్వరూపుడు. ఈ పరమాత్మ స్వరూపుడు తాను స్వయముగా ప్రకాశించుచు, తనను ప్రకాశింపజేయలేని యితర జడపదార్థముల నన్నింటిని "ప్రజ్ఞానము" అను జ్ఞాన స్వరూపముద్వారా ప్రకాశింప చేయుచుండును. ఈ ప్రజ్ఞానము "ప్రత్యగాత్మ" యని గూడ బిలువబడుచున్నది. ఈ ప్రత్యగాత్మయే సహస్రార కమలమధ్యమందు పరమాత్మ స్వరూపుడను పేరుతో నెరుంగబడుచున్నాడు. ఇట్టి యాత్మ మన శరీరమందు మనకు గాన్పించుటలేదేయన, అది యితరములవల్ల ప్రకాశింపజేయబడలేనిదియు, నితర జడపదార్థముల నన్నింటిని తన జ్ఞాన స్వరూపమగు "ప్రజ్ఞానము" ద్వారా ప్రకాశింపఁ జేయునదియు, గాన, అవాఙ్మానస గోచరమై, అనగా వర్ణింపబడుటకు వాక్కునకును, నూహింపబడుటకు మనస్సునకును అసాధ్యమైన స్థితిలోనుండి బోధ స్వరూపముగా నెరుంగబడుచున్నది. శరీరమం దీయాత్మ యొక్కయునికి మరణకాలమందు శరీరమును వదలి, ఆత్ముడు లేచిపోగానె ఆ శరీర సంబంధమైన యితర జడ పదార్థములన్నియు, అంతవరకు శరీరమునందుండి తమకు సమర్థతను కలుగజేయుచుండిన యాత్మ యిప్పుడులేనందున కదలికలేక జడములై పడియుండుటవలననే ధ్రువపఱచుకొనవలసి యున్నది. పై యాపత్తు విచారణవల్లను ప్రజ్ఞాన స్వరూపుడైన "ప్రత్యగాత్మ" యీ శరీరముతో నెట్టి సంబంధమును లేనివాడై యీ శరీరమందు జరుగుచున్న పనులనన్నింటిని జూచుచు సాక్షిగానున్నాడని ధ్రువపడుచున్నది.

ప్రజ్ఞానమును గురించి యిట్టుల తెలిసికొన్నవారలై పిమ్మట యీ వ్యష్టిస్థూల దేహపరిశోధనకు ప్రారంభింప వలయును. ఇందు గలవని చెప్పబడిన సూక్ష్మ, కారణ శరీరములతో గూడిన యీ దేహత్రయమును, అందలి పంచకోశములను, నింద్రియములను, నాడులను, భూత

ములను, ఒకటొకటిగా విడదీసి పరిశోధనచేయగా, నివియన్నియు, నితరసహాయము (ఆత్మపదార్థము) లేక శరీరమందు తమంతట తాము పనిచేయ సమర్థంబులు గానివై యుండుట వలన "జడములు" అనియు జననమునకు పూర్వమును, మరణమునకు పిదపను, లేని వగుటచే ఒకప్పుడుండి మరియొకప్పుడు లేకుండినందున "క్షరము" లనియు నెరుంగబడుచున్నవి. అందువలనను "సత్తు, చిత్తు, ఆనందము, నిత్యము, నిర్మలము," లను ఆత్మలక్షణములు వీనిలో దేనియందు లేని కారణముచేతను "నేతి, నేతి" అను వేదవాక్యానుసరణిగా ప్రతిది "ఇది యాత్మకాదు. నాకంటె వేరుగానున్నది. నేను దీనిని చూచుచున్నాను గాన నిది నాస్వరూపముగాదు" అని నిషేధింపబడినవి. ఇట్లు నిషేధింపబడగా శరీరమందు ప్రజ్ఞాన స్వరూపమైన "ప్రత్యగాత్మ" యనునది యొక్కటియే మిగులుచున్నది. ఈ విచారణవలన "దేహమే ఆత్మ, తాను జీవుడను" అని యనుకొనుట భ్రాంతి జ్ఞానమేగాని సత్యము గాదనియు, నీ భ్రాంతి జ్ఞానముతోఁజేయు పనులను, ఈ భ్రాంతి జ్ఞానమును, జూచుచు శరీరమందు వీనికి అతీతుడైన వేరుగా ప్రజ్ఞానమే స్వరూపముగా గలిగి నేనే ప్రకాశించుచున్నాననియు, గురువాక్యసారమును గ్రహించినవార లగుచున్నారు.

ఇంక, బ్రహ్మ మొదలు పిపీలిక పర్యంతముగల దేవ, మనుష్యాది సర్వభూతములతోఁ గూడి, పంచతన్మాత్రలు గుణములుగా గలిగిన పంచమహాభూతములతో నేర్పరుపబడినదను సమ్మష్టి ప్రపంచమును శోధించెదము. పైనజేసిన దేహపరిశోధనలో ప్రతి భూత సంబంధమైన దేహేంద్రియాదులు, "జడములు, క్షరములు" అని త్రోసివేయగా చివరకొక ప్రజ్ఞాన స్వరూపమైన ప్రత్యగాత్మయే మిగిలినది గదా! అట్టులే యీ ప్రపంచమందలి సర్వభూత దేహేంద్రియాదులును, పంచతన్మాత్రలును, మహాభూతములును, క్షరములు, జడములగుట వలన త్రోసివేయబడగా, నన్నిభూతముల యందలి యన్ని ప్రత్యగాత్మలు మిగులుచున్నవి. యీప్రత్యగాత్మలన్నియుగలసి "బ్రహ్మము" నిఅ చెప్పబడుచున్నది. కాన ప్రపంచమును శోధింపఁగా ఒక్క

బ్రహ్మము మిగులుచున్నదని యెరుంగవలెను. దీనినే "బ్రహ్మ చైతన్య" మని గూడ చెప్పుచున్నారు. కాన ప్రపంచమును భ్రాంతి సిద్ధమే యని యెరుంగవలెను. కాన దీనికి జ్ఞానమునకంటె వేరైన స్వరూపమే లేకపోవుటచేత ప్రపంచమనునదియే లేదు. అది బ్రహ్మము కంటె వేరుగాదు. ఎక్కడ జూచినను, కూటస్థుడు, బ్రహ్మము తప్ప మరేమియులేదు అని నిశ్చయముగా తెలిసికొన వలయును.

ఇంతవరకు ఎరింగినవారలై, పిమ్మట ఆత్మస్వరూపమును గురించి వేదములలో దెలుపబడిన మహావాక్యంబుల నెరుంగుట ముఖ్యావశ్య కముగాన వాని నిట దెలిపెదను.

## మహావాక్య విచారణ.

పరబ్రహ్మము (ఆత్మ) స్వరూపమును దెలుపునదియై చతుర్వేద ములలో, ఋగ్వేదమందు "ప్రజ్ఞానం బ్రహ్మ" అను సాక్షాత్కార మహావాక్యమును, యజుర్వేదమందు "అహంబ్రహ్మాస్మి" అను, అనుభవ మహావాక్యమును, సామవేదమందు "తత్త్వమసి" అను నుపదేశమహావాక్యమును, అధర్వణవేదమందు "అయమాత్మాబ్రహ్మ" యను సమాప్తి మహావాక్యమును, నాలుగు మహావాక్యములు చెప్పం బడినవి. వీని యర్థమును పరిశీలనజేసి తెలిసికొనియెదము.

## ప్రజ్ఞానం బ్రహ్మ.

ఋగ్వేద మహావాక్యమైన "ప్రజ్ఞానంబ్రహ్మ" యను మహా వాక్యమందు "ప్రజ్ఞానం" "బ్రహ్మ" యను రెండు పదములు గలవు. అందులో "ప్రజ్ఞానం" అను పదమునకు,

శ్లో॥ యేనేక్షతేశృణోతీదం । జిఘ్రతీవకరోతిచ
స్వాద్వస్వాదువిజానాతి । తత్ప్రజ్ఞానమితీర్యతే॥

తా॥ స్వాధిష్ఠాన చిదాభాసుండైన జీవుడా యా జ్ఞానేంద్రియ ములనుండి వెడలిన యంతఃకరణవృత్తితో కూడి యే జ్ఞానముచేత నాయా బాహ్యాంతర విషయములను తెలిసికొనుచున్నాడో ఆజ్ఞానము "ప్రజ్ఞాన" మనియు,

బ్రహ్మమను పదమునకు,

శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు । మనుజాశ్వగజాదిషు
చైతన్యమేకంబ్రహ్మత్వా । ప్రజ్ఞానం బ్రహ్మమేత్యపి॥

తా॥ బ్రహ్మ మొదలు పిపీలికమువరకు గల దేవమనుష్యాది సర్వభూతములయందును కలిసి యే చైతన్యము కలదో యా చైతన్యము "బ్రహ్మము" అనియు "బ్రహ్మ చైతన్య" మనియు లోగడ జేసిన విచారణలోనే దెలిపియుంటిని.

ఇంక "ప్రజ్ఞాన" మనునది "బ్రహ్మ" మెట్లయినదో విచారించి తెలిసికొనియెదము. లోగడ చేసిన విచారణలో ఒక శరీరమును పరిశోధించినపుడు వాచ్యార్థములు (అజ్ఞానముతో గూడియుండినపుడు విచారణ చేయక చెప్పబడు నర్థము) అయిన దేహేంద్రియాదులు క్షరములు, జడములని త్రోసివేయగా, లక్ష్యార్థమైన ఆత్మయై, ప్రజ్ఞాన మొక్కటియే మిగిలినదనియు, ప్రపంచ పరిశోధనలో అట్లనే క్షరములును, జడములను ద్రోసివేయబడగా సర్వభూతములయందు నిలచిన "ప్రజ్ఞానము" లన్నియు గలసి "బ్రహ్మము" అనుపేర ఒక్కటియే లక్ష్యార్థమైన ఆత్మయై మిగిలినదనియు దెలిపియుంటిని. దీనినిబట్టి ఒక శరీరమునకు సాక్షి "ప్రజ్ఞానము" అనియు సమస్త భూతముల శరీరములతో గూడిన సమష్టి ప్రపంచమునకు సాక్షి "బ్రహ్మము" అనియు నర్థము తేలినది. "ఆకాశ" మనునది ఒక్కటియే యైనను, జలముతో నిండిన ఘటములయందు ప్రతిబింబించిన యాకాశమునకు "ఘటాకాశము" అను పేరెప్పుడు వచ్చినదో, అప్పుడే వెలుపల నంతట నిండియున్న యాకాశమునకు "మహాకాశము" అని పేరు వచ్చినది. ఘటములన్నియు పగిలిపోయి నీరు కారిపోగా నీ ఘటాకాశములన్నియు బోయి మహాకాశమునందు కలియగనే అప్పుడు "ఆకాశము" అను పేరును బొందినట్లు, "ఆత్మ" (పరబ్రహ్మము) యనునది ఒకటియే యైనను, ఒక శరీరమునందు ప్రతిబింబించుట వలన "ప్రత్యగాత్మ" (ప్రజ్ఞానము) అను పేరు నెప్పుడు బొందినదో, అప్పుడు బయట అంతట నిండియున్న యాత్మకు "పర

మాత్మ" (బ్రహ్మము) యను పేరు వచ్చినది. ఈ శరీరము లన్నియు నశించి యీ "ప్రత్యగాత్మ" లన్నియు గలసి యెప్పుడు "పరమాత్మ" లో కలియుచున్నవో అప్పుడు తిరిగి "ఆత్మ" (పరబ్రహ్మ) మను పేరును బొందుచున్నది. ఒక శరీరమందలి "ప్రజ్ఞానము" యెట్టి లక్షణములను కలిగియున్నదో, మరియొక శరీరమందలి "ప్రజ్ఞానము" అట్టి లక్షణములనే కలిగియున్నదిగదా! అప్పుడన్ని శరీరముల యందలి ప్రజ్ఞానములు కలసి "బ్రహ్మము" అను పేరును బొందిన "బ్రహ్మ చైతన్యము" కూడ అట్టి లక్షణములనే కలిగియున్నదని చెప్పక తప్పదుగదా! కాన ఒక శరీరసాక్షియైన ప్రజ్ఞానమునకును, అన్ని శరీరములయందలి ప్రజ్ఞానములు కలసిన బ్రహ్మమునకును, నైక్యము కుదురుచున్నది.

వాచ్యార్థములైన యన్నిశరీరములును, ఒకే ధర్మములను కలిగియుండక, విరుద్ధ ధర్మములను కలిగియుండుటచే వానికి ఐక్యము కుదురకపోయినను,

తే॥ గీ॥ ఉభయ వాచ్యార్థములతోడ నొప్పుచున్న
ఉభయ వాచ్యార్థముల కైక్య మొదవదట్లు
గాన వాచ్యార్థముల రెంటికడకు త్రోసి
యెనయలక్ష్యార్థ మొకటిగా నెరుగవలయు॥
(సీతారామాంజనేయ సంవాదము)

అను వాక్యము ప్రకారము విరుద్ధ ధర్మములు గలిగిన వాచ్యార్థముల త్రోసివేసి, లక్ష్యార్థములైన "ప్రజ్ఞానము" నకును "బ్రహ్మము" నకును ఐక్యము చెప్పవచ్చును. ఒక శరీరసాక్షి "ప్రత్యగాత్మ" (ప్రజ్ఞానము) సమష్టి ప్రపంచమునకు సాక్షియైన "పరమాత్మ" (బ్రహ్మము) నం దైక్యమై "ఆత్మ" అను పేరును బొందుచున్నది. అనగా "ప్రజ్ఞానము" "బ్రహ్మ చైతన్యము" (బ్రహ్మ స్వరూపము) అగుచున్నది. ఇదియే యీ మహావాక్యార్థము.

N. B :—చైతన్య మనినను, ప్రజ్ఞానమనినను, బ్రహ్మ మనినను, ఆత్మ యనినను, పేర్లు మాత్రమే వేరుగాని పదార్థ మొక్కటియే యని యెరుంగునది.

## అహంబ్రహ్మాఽస్మి

యజుర్వేద మహావాక్యమైన "అహంబ్రహ్మాఽస్మి" అను వాక్యములో "అహం" "బ్రహ్మ" "అస్మి" అను మూడు పదములు గలవు. వానిలో "అహం" అను పదమునకు "నేననియు" 'బ్రహ్మ' అను పదమునకు 'బ్రహ్మము' అనియు 'అస్మి' యను పదమునకు 'అయితిని' అని యర్థము.

ఈ మహా వాక్యమునందలి 'అహం' అనగా 'నేను' అని దేహమునుండి యేది స్ఫురించుచున్నదో విచారించెదము.

శ్లో॥ పరిపూర్ణపరాత్మాస్మిన్ । దేహేవిద్యాధికారిణి,
బుద్ధేస్సాక్షితయాస్థితా । స్ఫురన్నహమితీర్యతే॥

పరమాత్మ స్వరూపమైన చైతన్యము (ప్రజ్ఞానము) నిర్వికారము గనుక 'అహం' అని తోచదు. అహంకారము జడము గనుక 'అహం' అని చెప్పలేదు. ఈ 'అహం' అని దేహములోనుండి చెప్పునది యెవరన :—

తే॥ గీ॥ బుద్ధ్యహంకారములతోడి బొందుగల్గి
నేను నేననువాడను నేనుజుమ్మి
నేను నేననువాడను నేనటంచు
తెలియబడు వృత్తి నెరిగెడు తెలివినేను॥

(శ్రీ సీతారామాంజనేయ సంవాదము)

పరమాత్మ స్వరూపమైన చైతన్యము (ప్రజ్ఞానము) అహంకారముతోఁగలియగనే, 'అహ' మని స్ఫురించుచున్నది అని యెఱుంగవలయును. కాఁబట్టి జడమైన 'అహంకారము' ను వదలి చైతన్యమే (ప్రజ్ఞానమే) 'అహం' అను పదమునకు నర్థమైన 'నేను' అని యెఱుంగవలెను.

ఇక 'బ్రహ్మము' అనెడి పదమునకు అర్థమేమన,

శ్లో॥ స్వతఃపూర్ణః పరాత్మాత్ర । బ్రహ్మశబ్దేన వర్ణితః
అస్మీత్యైక్యపరామర్శః । తేనబ్రహ్మభవామ్యహం॥

తా॥ తనకు తానే పరిపూర్ణమైన పరమాత్మ యీ మహావాక్యములయందు 'బ్రహ్మము' అనెడి పదమునకు లక్ష్యార్థముగా నెరుంగవలెను.

ఎల్లప్పుడు పరిపూర్ణుడై యున్న ఆత్మ యేకారణముచేత పరబ్రహ్మమగుచున్నదో ఆ కారణముచేత బుద్ధికి సాక్షియైయున్న ప్రత్యగాత్మనైన "నేను" బ్రహ్మమైతినని "అస్మిన్" అను పదముచేత ఐక్యమును నిర్ధారణ చేయుచున్నది. గాన యీ మహావాక్యము యొక్క అర్థము "ప్రజ్ఞానము" అనిచెప్పబడు "నేను" "బ్రహ్మము" నైతినని నిశ్చయించుకొనుము.

ఇట్లు తెలసికొనగనే అనేక జన్మలనుండి కూడబెట్టిన "సంచిత కర్మ" యనునది నశించునని పెద్దలవల్ల దెలియఁబడుచున్నది.

## తత్త్వమసి

సామవేద మహావాక్యమైన "తత్వమసి" అను వాక్యములో "తత్" "త్వం" "అసి" అను మూడు పదములు గలవు. వానిలో "తత్" అను పదమునకు "అది" యని అర్థము. "అది" అనగా :—

శ్లో॥ "ఏకమేవాద్వితీయంస్యా న్నామరూప వివర్జితం ।
సృష్టేఃపురాతునాప్యస్య త్తాదృక్తతది తీర్యతే॥"

లక్ష్యార్థము :—సృష్టికి పూర్వమునందును, సృష్టికి తరువాతను, ప్రళయమందును ఏకమై నామరూప రహితమైన ఏ ఆత్మ గలదో ఆ "పరమాత్మ".

వాచ్యార్థము :—సమష్టి శరీరత్రియ, సమష్టి అవస్థాత్రియ, సమష్టి పంచ కోశములు, సర్వజ్ఞత్వాది గుణములు గల "ఈశ్వరుడు".

"త్వం" అనగా "నీవు" అని యర్థము. "నీవు" అనగా :—

శ్లో॥ శ్రోతృదేహేంద్రియాతీతా చిత్త్వత్రిత్వం పదేరితా ।
ఏకదాగ్రాహ్యా తేఽసీతి తదైక్య మనుభూయతాం॥

లక్ష్యార్థము :—వ్యష్టి దేహత్రియ విలక్షణుండును, అవస్థాత్రియ సాక్షి, పంచకోశ వ్యతిరిక్తుడు నయిన "ప్రత్యగాత్మ".

వాచ్యార్థము :—వ్యష్టి శరీరత్రియ, వ్యష్ట్యవస్థాత్రియ, వ్యష్టి పంచ కోశములును, కించిజ్ఞత్వాది గుణములు గల "జీవుడు".

ఇచ్చట విరుద్ధ ధర్మములు గలిగిన వాచ్యార్థములతో గూడిన లక్ష్యార్థములకు ఐక్యము చెప్పరాదుగాన వాచ్యార్థములను తోసివేసి లక్ష్యార్థములైన ప్రత్యగాత్మ పరమాత్మలకు స్వభావసిద్ధములైన లక్ష్యములను బట్టియే ఐక్యము చెప్పవలసియున్నది. ప్రత్యగాత్మ కొద్ది యుపాధులతో గూడి వ్యష్టియై యున్నది. పరమాత్మ పెద్ద యుపాధులలో గూడి సమష్టియై యున్నదిగదా ! ఈ రెంటికి ఐక్యమెట్లు కుదురునని సందేహము వలదు. శాస్త్రములలో రెండు వాక్యములకు సమన్వయము కుదరనప్పుడు లక్షణ పూర్వకముగా సమన్వయించుట పద్ధతియై యున్నది గాన,యిచ్చటగూడ అట్లే లక్షణాయుక్తముగ సమన్వయించెదము.

ఆ లక్షణ యనునది "జహల్లక్షణ" "అజహల్లక్షణ" "జహదజహల్లక్షణ" యని మూడు విధములు. అర్థము సమన్వయించవలసిన వాక్యములో అసందర్భములను విడిచివేసి సమన్వయించుట "జహల్లక్షణ" యని యనంబడును. మనము సమన్వయించవలసిన వాక్యమైన "ప్రత్యగాత్మయే పరమాత్మ" అనుదానిలో యేపదమును తీసివేసి సమన్వయించుటకు వీలులేదుగాన దీనిని సమన్వయించుటకు నీ లక్షణ పనికిరాదు. సమన్వయించవలసిన వాక్యములోని పదములను వేనిని తీసివేయక అట్లు చేయుటవలన నిచ్చు నసందర్భార్థమును నివర్తించు పదము నొకదానిని కలుపుకొని సమన్వయించుట "అజహల్లక్షణ" యని యనంబడును. ప్రత్యగాత్మయే పరమాత్మ యను వాచ్యార్థమును సమర్థించుటకు మరియొక పదమును జేర్చి యైక్యము చెప్పుటకు వీలులేదుగాన నీ లక్షణయును పనికిరాదు.

ఇంక మూడవ లక్షణమైన "జహదజహల్లక్షణ" చే దీనిని సమన్వయించవలసియున్నది. దీనికే "భాగత్యాగ లక్షణ" యని కూడ పేరు గలదు. అనగా కొంత భాగమును వదలివేసి ఆస్థానే కొంత

భాగమును తిరిగి కల్పుకొని సమన్వయించునది "జహదజహల్లక్షణ", యని చెప్పబడుచున్నది. అది యెట్లన:—

వాచ్యార్థమైన జీవునికి ఉపాధి అవిద్య, అది బురదనీరు. వాచ్యార్థమైన ఈశ్వరునికి ఉపాధి మాయ, అవి నిర్మలమైన నీరు. ఉపాధులైన నీటిని త్రోసివేయగా అందు ప్రతిబింబించిన "మలిన బింబము", "శుద్ధ బింబము" మిగులుచున్నది. ఈ రెంటియందును ప్రతి బింబించినది ఒక్క సూర్యుడే గాన, సూర్యుడొక్కడే మిగులు చున్నాడు. అటులే వాచ్యార్థములైన అవిద్య యుపాధి గాగల జీవుని, మాయ ఉపాధిగాగల యీశ్వరుని త్రోసివేయగా, వాని లక్ష్యార్థము లైన ప్రత్యగాత్మ, పరమాత్మలుమిగులుచున్నవి. ఈ రెండును ఒకే పర బ్రహ్మముయొక్క ప్రతిబింబములై యున్నవి. కాన బ్రహ్మ మొక్కడే మిగులుచున్నాడు. అందుచే "ప్రత్యగాత్మయే పరమాత్మ" యని చెప్పవలసియున్నది. గనుక యీ లక్షణ ప్రకారముగా ఉపాధితో గూడిన "జీవుని" విడిచి యాస్థానమున "ఆ" అని కల్పుకొని, దాని లక్ష్యార్థమైన "ప్రత్యగాత్మను" దానితో జేర్చినయెడల "ఆ ప్రత్య గాత్మ" యని యేర్పడును. అట్టులే యుపాధితో గూడిన "ఈశ్వ రుని" విడిచి, ఆ స్థానమున "ఈ" అని కలుపుకొని దాని లక్ష్యార్థ మైన "పరమాత్మను" జేర్చినయెడల "ఈ పరమాత్మ" యగు చున్నది. "ఆ ప్రత్యగాత్మయే ఈ పరమాత్మ" అని యేర్పడు చున్నది. ఇచ్చట ఉపాధులతో "జీవేశ్వరులను" విడచినవార మగు చున్నాము. తిరిగి "ఆ" "ఈ" పదములను జేర్చుకొన్నవారమగు చున్నాము. ఈ లక్షణ ననుసరించి ప్రత్యగాత్మ పరమాత్మలకు ఐక్యము కుదురుచున్నవి. గాన "ఆ ప్రత్యగాత్మయే యీ పరమాత్మ" అనుట వలన "త్వం" పదలక్ష్యార్థ స్వరూపుడవు ప్రత్యగాత్మవు నయిన "నీవే", "తత్" పదలక్ష్యార్థ స్వరూపుడ వయిన "పరమాత్మ" వగుచున్నావని యీ మహావాక్యము వలన బోధించబడుచున్నది. దీనికే జీవేశ్వరైక్యమని చెప్పుచున్నారు.

## అ య మా త్మా బ్ర హ్మ.

అధర్వణవేద మహావాక్యమైన "అయమాత్మాబ్రహ్మ" అను దానిలో "అయం" "ఆత్మా" "బ్రహ్మ" అను మూడు పదములు గలవు. అందులో "అయం" అనగా "ఈ" అని యర్థము. "ఈ" అనగా :—

శ్లో॥ స్వప్రకాశపరోక్షత్వా దయమిత్యుక్తితోమతః।
అహంకారాదిదేహాంతా త్ప్రత్యగాత్మేతిగేయతే॥

ఇదివరలో "అజ్ఞానదశలోనుండి దేహము, ఇంద్రియములు, కోశములు మొదలగునవి యాత్మయని చెప్పబడునది. గాక విచారణ మీద "అహంకారము మొదలు స్థూలదేహపర్యంతము నా యహంకారము, నా దేహమని యెరుంగుచు అన్నింటికి అంతరముగా స్వప్రకాశమై, నిత్యమై, అపరోక్షమై యుండు చైతన్యము" అని పూర్తిగా సందేహ నివృత్తిచేసి సిశ్చయపరచి చెప్పుటకై "ఈ" అని యర్థ మిచ్చు "అయం" అను పూతపదము నిచ్చట యుపయోగింపబడినది గాన :—

"అయం = అట్టి చైతన్యమైన, ఆత్మ = ప్రత్యగాత్మయే, బ్రహ్మ = పరబ్రహ్మ స్వరూపము" అని యర్థము.

కాన స్వప్రకాశమై, నిత్యమై, అపరోక్షమై అంతరముగా ప్రకాశించుచుండు చైతన్యమైన ప్రత్యగాత్మయే పరబ్రహ్మము అని యీ మహావాక్యార్థము.

సాధారణముగా ప్రతిమానవునికిని "అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్ష జ్ఞానము, అపరోక్ష జ్ఞానము, దుఃఖ నివృత్తి, ఆనందావాప్తి" అను సప్తావరణములు గలవని యెరుంగవలెను. అందులో "నీయందాత్మయున్నాడు, నీకు తెలియునా" యని యడుగగా, అట్టి యాత్మయడు యదార్థములో తానే అయియున్నప్పటికి, అట్టి తన్ను తాను తెలిసికోలేక "నేనెరుంగను" అని జవాబు చెప్పుటయే "అజ్ఞానము" అని చెప్పబడుచున్నది. "అట్టి యాత్మయడు నాయందున్నాడా? ఉన్నచో నాకు కనబడడా?" యని చెప్పుట

"ఆవరణము" అని చెప్పబడుచున్నది. "నాయందు ఆత్మ్మడను వాడు లేడు. నేను జీవుడను, కర్తృత్వ భోక్తృత్వములుగల వాడను, నేనే జాడ్యములచే బాధలననుభవించుచున్నాను. నేనే జనన మరణ ముల నొందుచున్నాను" అని చెప్పుచు దుఃఖించుట "విక్షేపము" అని చెప్పబడుచున్నది. అట్టి స్థితిలో గురువను నొక మహానుభావుడు లభించి దగ్గర జేరి "నీయందాత్మ్మకున్నాడు. సందేహమువలదు" అని బోధచేయగానే విని దానిని విశ్వసించి, ఆత్మ్మకున్నాడని, యెరుంగుట "పరోక్షజ్ఞానము" అని చెప్పబడుచున్నది. అటుపిమ్మట, "దేహేంద్రియములు నీవుగావు, నీవువాని కతీతుడవై సచ్చిదానంద స్వరూప ముతో సాక్షివై వీటినన్నింటెని చూచుచు నంతరముగానున్నావు" అని బోధించగా విని తానే యాత్మయని దెలిసికొనుట "అపరోక్ష జ్ఞానము" అని చెప్పబడుచున్నది. సద్గురువువలన నిట్టి జ్ఞానము కలుగ జేయబడగా, బంధవిముక్తుడై అంతవరకు చెందుచున్న దుఃఖమును తొలగించుకొన్న వాడగుట "దుఃఖనివృత్తి" యని చెప్పబడుచున్నది. ఈ దుఃఖమునుండి తొలగింపబడినవాడై ఆనందమును బొందినవాడగుట "ఆనందావాప్తి" యని చెప్పబడుచున్నది.

ఇందు దెలుపబడిన యంశముల నన్నిటిని శ్రద్ధతో గూడిన భక్తితో జదివి గ్రహించుటవలన, పైన చెప్పబడిన సప్తావరణలలో మొదటివైన, "అజ్ఞానము, ఆవరణము, విక్షేపము" అను మూడును నశించి నాలుగవది అయిన "పరోక్ష జ్ఞానము" ను బొందినవారలగు చున్నారు. ఈ "పరోక్ష జ్ఞాన" మననది "వాచాజ్ఞానము" అని చెప్పబడుచున్నది. మానవుడు కృతార్థుడు గావలెనన్న నింతటితో చాలదు. పిమ్మట, "అపరోక్ష జ్ఞానము" ను సంపాదించవలసి యున్నది. ఇది యనుభవ జ్ఞానమువలనగాని లభించదు. ఈ యపరోక్ష జ్ఞానమును సంపాదించిన, "దుఃఖనివృత్తి" యై "ఆనందావాప్తి" కలుగును. అపరోక్ష జ్ఞానముకు గావలసిన అనుభవ జ్ఞానమును సంపాదించుటకు నొక సద్గురువుయొక్క యనుగ్రహము కావలసియున్నది. కాన ఇట్లు పరోక్ష జ్ఞానమును సంపాదించుకొనినవారలై, పిదప నొక సద్గు

రువును వెదకికొని వారి నాశ్రయించిన యెడల, మహావాక్యముల యర్థ మిందు తెలుపబడిన విషయములవల్ల నెరింగినవారలై యున్నను, ద్వారా మహావాక్య సముదాయార్థమైన "అహంకారము మొదలు స్థూలదేహము వరకు నా యహంకారము, నా దేహము, అని తెలిసికొను చైతన్యమే ప్రత్యగాత్మ స్వరూపము. చూడబడెడి సమస్తమును బ్రహ్మ స్వరూపము. జగదధిష్ఠానమైన బ్రహ్మమే స్వప్రకాశమైన ఆత్మ. ఆ యాత్మ స్వరూపమే తాను." అను యంశములను, లోగడ దెలిసికొనియున్న పరోక్షజ్ఞానాంశములకు అనుగుణ్యమైన మరికొన్ని రహస్య విషయములజేర్చి అనుసంధాన ప్రకరణను దెలిపి అనుభవ జ్ఞానమును కలుగజేయును. అట్లు కలిగిన యనుభవజ్ఞానాంతమున ఆ సద్గురువు తన శిష్యుని శిరస్సుమీద హస్త సంయోగముచేసి, "నీవే సచ్చిదానంద స్వరూపుడవు. అద్వితీయమైన యాత్మ స్వరూపుడవు. అసంగుడవు. మూడు కాలములయందు జీవుడవుకావు. గనుక నీకు ఆగామి సంచిత ప్రారబ్ధములులేవు. అఖండైక్యరసమై సుఖస్వరూపమైన ఆత్మవు," అని యాశీర్వదించి యనుగ్రహించుననియు, అట్లను గ్రహింపబడిన శిష్యుడు "బాహ్యాంతర ప్రపంచముల మరచి, కొంతసేపు నిర్వికల్ప సమాధి నిష్ఠయందుండి, వెనుక మేల్కాంచి కన్నులు దెరచి సద్గురువును చూచి, డిగ్గునలేచి గురుస్వాములకు అనేక సాష్టాంగ నమస్కారములు చేసి, "స్వామీ, నేను కృతార్థుడనైతిని. నాకు మోహనివృత్తి యయినది" అని విజ్ఞాపనము జేయుచు, సర్వకాల సర్వావస్థలయందును తన సద్గురువునందు తదేక నిష్ఠ గలిగి యుండుచు, నిర్వికల్ప సమాధియందు నిలబడి, అమనస్కయోగ సుఖమునందుచు, "దుఃఖనివృత్తి" గలవాడై "ఆనందావాప్తి" ని బొంది, అమృత, స్థానమును జేసినట్లు సదా బ్రహ్మానంద సుఖమును బొందుచు, కృతార్థుడగునని తెలియవచ్చుచున్నది.

మరికొన్ని ముఖ్యాంశముల నిచ్చట దెలిపి అంతటితో ముగించెదను. ప్రపంచములో "జగత్సత్యం, బ్రహ్మమిథ్య", "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అను వాక్యములు రెండు వాడుకలో గలవు. ఈ సందర్భములో మనకంటికి కనబడు ప్రపంచము నిజముగా నున్నదా లేదా ? యనునది మీమాంసగాదు.

వీనిలో మొదటిది అజ్ఞానిభావన. యెట్లులనగా :—అజ్ఞానియైన యాతడు యెల్లపుడు "అజ్ఞానము, ఆవరణము, విక్షేపము", అను మూడావరణలలో చిక్కుకొనియుండును. ఎన్నటికిని నీ యావరణలకు మించి, విచారణ చేయువాడుగాడుగాన యెల్లపుడును నీ యావరణలో నున్న యీ ప్రపంచమును, ప్రపంచ విషయములనే చూచుచు, వానియందే ఆసక్తి గలవాడై, వానిలోనే మునుగుచు తేలుచుండి, తత్ఫలప్రాప్తియైన జనన మరణాదులకు లోనైయుండును. ఈ మూడావరణలకు మించిన యావరణలలోని బ్రహ్మ విచారణ చేయనివాడు గావున "బ్రహ్మము" అనునది యెట్టిదో తెలిసికొనజాలక "ప్రపంచమే గాని బ్రహ్మము లేదు" అను భ్రాంతితోనే యుండి "జగత్సత్యం బ్రహ్మమిథ్య" అనియే చెప్పుచు దానిఫలము ననుభవించుచుండును.

రెండవ వాక్యము జ్ఞానిభావన. యెట్లులనగా :—ఈ జ్ఞానియను నాతడు ప్రథమములో అజ్ఞానియై యున్నకాలములో పైన చెప్పబడిన వాక్యమునందే నిశ్చయాభిప్రాయుడై యున్నను, తదుపరి గురుసహాయమును బడసి, ఆ మూడావరణలను మించిన బ్రహ్మ విచారణచేసినవాడుకాగా, తాను అజ్ఞానిగా నుండగా కనుపించిన ప్రపంచమును, ప్రపంచ విషయములును, యిప్పుడటుల గాన్పించక, సర్వము బ్రహ్మమయముగానే గాన్పించుచుండుట వలన, తనకంతవరకు కలిగిన భ్రాంత్యభిప్రాయమును వదలి "బ్రహ్మసత్యం, జగన్మిధ్య" అను నిశ్చితాభిప్రాయుడగుచున్నాడు. ఇటుల తన నిజస్వరూపమును నెరింగినవాడై జనన మరణాదులకు దూరుడై కృతార్థుడగుచున్నాడని యెరుంగునది. దీనికి సద్గురు సేవ, సహాయము ముఖ్యావశ్యకమని ఖండితముగా చెప్పక తప్పదు.

బ్రహ్మ నిష్ఠను బొంది బ్రహ్మజ్ఞానులగువారు బ్రహ్మవేత్త, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మ విద్వరీయుడు, బ్రహ్మ విద్వరిష్ఠుడు అని నాలుగు విధములుగా నెరుంగబడుచున్నారు. అట్టివా రెట్లుందురనగా :—

బ్రహ్మవేత్త :—కర్మఫలమును గోరక వదలివేసినవాడై, నిత్య నైమిత్తిక కర్మలను యథావిధిగ జరుపుచు, తనకు లభించిన దానితో తృప్తిని బొందుట, అహంకార రహితుడగుట, సర్వభూతములయందు దయగలిగియుండుట, సదా యాత్మయందు రమించుచుండుట, ఆత్మతృప్తుడగుట, "కామక్రోధాద్యరిషడ్వర్గములు, ప్రియాప్రియంబులు, నిందాస్తుతులు, మానాభిమానములు, శతృమితృడు అను భేదములు లేకుండుట" అను స్వభావములను గలిగి కుమ్మరి పురుగువలె అంటియు నంటని స్థితిలో సంచరించుచుండును. అగ్నిచే గాలిన పత్రము, పత్రమువలెనే గనబడినట్లు, అజ్ఞాన దృష్టిలో శరీరమును కలిగిన వాడుగా గనుబడుచున్నను, నిజముగా జూచిన అశరీరుడే యగును.

బ్రహ్మవిద్వరుడు :—కర్మలను విడిచిపెట్టినవాడై, సంప్రాప్త సుఖదుఃఖముల ననుభవించుచు, సమాధి నిష్ఠాగరిష్ఠుడై యుండును.

బ్రహ్మవిద్వరీయుడు :—ఎల్లవేళల సహజామనస్క రాజయోగ నిష్ఠాగరిష్ఠుడై యుండ, అప్పుడప్పుడితరులవలన మేలుకొలుపబడిన వాడై, స్వల్పాహారమును బుచ్చుకొనుచు, నిద్రబోవువానివలె ప్రపంచమును మరచియుండును.

బ్రహ్మవిద్వరిష్ఠుడు :—బాహ్యాంతరముల మరచి, నిరంతర నిర్వికల్ప సమాధి నిష్ఠుండై, ప్రకాశించుచుండును.

బ్రహ్మజ్ఞానులగు నిట్టి సాధువుల మనస్సులకు సంతాపము కలుగజేయబడినయెడల, వారివలన కోరబడకయే, అట్టి సంతాపము కలుగజేసిన వారికులము క్షీణించునని పెద్దల వలన వచింపబడుచున్నది. కాన, అట్టివారితో సంభాషించునపుడుగాని, వారితో నెట్టి సంబంధమేని కలుగజేసికొనవలసివచ్చినపుడుగాని, గుర్తెరిగి బహుజాగరూకతతో మెలగుచు నెట్టి సంతాపమును వారికి కలుగకుండ సంచరించుట ముఖ్యావశ్యకమని యెరుంగునది.

తృతీయ ప్రకరణము
సంపూర్ణము.

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

నగురోరధికం.

శ్రీ

# ఆంజనేయ

# సద్గురు బోధామృతసారము.

## చతుర్థ ప్రకరణము.

---

సృష్టికి పూర్వము ఆద్యంతరహితుండును, నిర్వికారుండును, పరిపూర్ణమగు విశుద్ధ జ్ఞానమే స్వరూపముగా గలవాడును, సచ్చిదానంద స్వభావ లక్షణములు గలవాడును, నిత్యుండును, స్వప్రకాశుండును, సర్వవ్యాపకుండును, సర్వాంతర్యామియు, సర్వమునకు నియామకుండును, సర్వశక్తియుక్తుండును, సర్వమును తనయందు గలవాడును, సర్వాధిష్ఠానభూతుండును, నైన పరమాత్మ యొక్కడే గలడు. ఆ పరమాత్మ యిట్టివాడని నిర్దేశించి చెప్పుటకు, యాపరమాత్మ నెరుంగ గలిగిన వారలకు సైతము సావకాశములేనిదై, పాలయందలి మాధుర్యము వలె యనుభవముచే నెరుంగబడవలసినదేగాని వేరుమార్గము లేదనియు, యా పరమాత్మయొక్క కేవల రూపము అలలులేని సముద్రము వలెను, గాలిలేనిచోట వెలుగు దీపమువలెను, నిర్మలముగాను, నిశ్చలముగాను, నిష్కళంకముగాను యుండుననియు జెప్పుచున్నారు. ఆ పరమాత్మ క్రియలేమిచే, నిష్క్రియుండై యొక్కడే యుండు స్థితి యాయనకు నిర్గుణ స్థితియని వక్కాణించుచు, యా స్థితిని దృష్టీకరించి చెప్పవలశివచ్చినప్పుడు నిర్మలమగు చిదాకాశముతో బోల్చి చెప్పుచున్నారు. కాన యిచ్చట ఆకాశమును గురించి కొన్ని యంశములను దెలుపవలశియున్నది. అవి యెవ్వియనిన, ఆకాశమును దానిని చిదాకాశమని, చిత్తాకాశమని, భూతాకాశమని మూడు విధములుగా విభజించి, నిర్మలమును, నిశ్చలమునగు ‘పరమాత్మను’ చిదాకాశము

తోను, చాంచల్య స్వభావముగల మనస్సును చిత్తాకాశముతోను, పృథివ్యాది పంచభూతములలో నొకటియగు యాకాశమును భూతాకాశముతోను బోల్చి చెప్పుట వాడుకయై యున్నది. కాన ఆకాశము యొక్క నిజస్థితిని ముందు విచారింతము.

ఆకాశ మనునది మనకంటి యెదుట నీలిరంగు యాకారముతో నున్నట్లు గాన్పించుచున్నది గదా! ఈ యాకాశముయొక్క నిజరూప మిదియేనా లేక యిదిగాక మరియొక రూప మేదియైనాయుండి మన కంటి కిట్లు గాన్పించుచున్నదాయన, దాని నిజరూప మిదికాదని దెలుసుకొనుడు. ఎందువల్లననగా, మనము భూమిమీద నెచ్చట నైన నొకచోట నిలచి, యాకాశమువంక జూచినయెడల, మన కను చూపు పారినంతవర కేమియు గాన్పించక, యా మేరదాటి యెక్కడనో చాలదూరములో నీలిరంగుతో యున్నట్లును, భూమితో గలియు చున్నట్లును చూచుచుందుము. అది నిజమైన రూపమేనాయని విచా రించుటకై యా స్థలము విడచి యెన్నివందలమైళ్ళ దూరముబోయి యక్కడ నిలచి చూచిన, నదివరకు నిలచి చూచిన స్థలముకు చాల దూరములో నీలిరంగుతో గాన్పించిన యాకాశ మక్కడ గాన్పించక పోగా, యక్కడ తిరిగి మొదటి స్థలమందు గాన్పించిన మాదిరిగనే, యక్కడకు చాలదూరములో నీలిరంగుతో యున్నట్లును, భూమితో గలియుచున్నట్లును, మరల గాన్పించుచుండును. ఆ స్థలమునుగూడ విడచి మరల యెన్నివందలమైళ్లు బోయిచూచిన, నదే మాదిరిగ గాన్పించుచుండును. దీనివలన మనమెరుంగ వలశిన దేమన, మనకు గనుబడు నీలిరంగుగల రూపము, భ్రాంతి దృష్టికి గనుబడు భ్రాంతి రూపముగాని, నిజరూపము గాదనియు, యెంతలెక్కబోయి చూచినను యా భ్రాంతిరూపముగాక వేరొక రూపము మనకు గాన్పించక బోవుట వలన, యా యాకాశమునకు నామముతప్ప రూపమేదియు లేదనియు ధృవపడుచున్నది. ఇట్టి రూపరహితమైన యాకాశ స్థితిని చిదాకాశ స్థితియని దెల్పుచు పైన చెప్పబడిన పరమాత్మయొక్క నిర్గుణస్థితి యిట్టిదని బోల్చుచున్నారు. మరియు యిట్టిరూపములేని యాకాశము నందు నీలిరంగు తోచినట్టులే రూపరహితమైన సచ్చిదానంద స్వభావ

లక్షణములు గల పరబ్రహ్మమునందు, భ్రాంతివలననే జగము తోచు చున్నదిగాని యిది వాస్తవముగాదు. ఈ భ్రాంతి వదల్చుకోవలెనన్న, ఆత్మజ్ఞానమును సంపాదించి, యటుల సంపాదించిన యాత్మజ్ఞాన సహాయము వలన నంతర్ముఖులై బ్రహ్మ స్వరూపము నెరింగినవారలై, చూచుచున్నట్టివాడైన తనకంటె చూడబడునట్టి యీ జగము వేరు గాదని దెలుసుకొనుట ముఖ్యావశ్యకము అట్లు దెలుసుకొని యీ జగ ద్భ్రాంతిని మరచుటవలననే పరమమైన మోక్ష సుఖము గలుగగలదు గాని, యట్లు చేయలేని వారలకు, యితర శాస్త్రములను గుంటల యందు బడి కొట్టుకొనుచు యెన్ని కల్పములకైనను, మోక్ష సుఖమును బొందనేరరని రూఢిగా నమ్మవలసినది,

కాన యీ పరమాత్మకును, మనకు గనుబడు జగమునకును, యెట్టి సంబంధము గలదో, యీ జగమనునది యెటుల వచ్చినదో, దీని నిజస్వరూప మెట్టిదో యను మొదలగు యంశములను విచారణచేసి పైన చెప్పబడిన ఆత్మజ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నింతము.

సృష్టికి పూర్వము, నిష్క్రియుడై తానొక్కడైయున్న పరి పూర్ణమగు విశుద్ధ జ్ఞానమే స్వరూపముగాగల పరమాత్మ, సృష్టికాల మందు తనకంటె వేరుగాని ప్రపంచ రూపముతో దృశ్యావస్థను బొంది, పిమ్మట సమష్టి చిత్రరూపముతోడను, ఆవల సమష్టి జీవరూపముతోడను, అటుపిమ్మట యహంకార రూపముతోడను, అనంతరము మనోరూపముతోడను, వివర్తము బొందినట్లు బృహదా శ్రమువల్ల దెలియనగుచున్నది. అది యెట్టులో విచారించి తెలసికొని యెదము.

పాలయందలి తెల్లదనము, సూర్యునియందలి యుష్ణము, మంచుయందలి చల్లదనము, యనునవి వాటినుండి వేరుచేయబడుటకు వీలులేనివై వాటియందే లీనమైయుండు మాదిరిగ చలనశక్తి, కాఠిన్య శక్తి, ద్రవశక్తి, దాహశక్తి, శూన్యశక్తి, నాశశక్తి, సంకల్పశక్తి, చిచ్ఛక్తి, మొదలుగాగల, శక్తులు లెక్కించుటకు సావకాశములేక యంతులేని స్థితిలో యెన్నియో కారణరూపము (సూక్ష్మరూ

పము) తో, నిష్క్రియుడై యుండు పరమాత్మయందు లీనమై యున్న వని యెఱుంగునది. ఇవి, పరమాత్మ, వస్తురూపముతో వివర్తము నొందదలచినపుడు, పైన చెప్పబడిన శక్తులు వరుసగా వాయురూపము తోడను, రాయి రూపముతోడను, ఉదక రూపముతోడను, అగ్ని రూపముతోడను, ఆకాశ రూపముతోడను, చలించు వస్తువుల రూపము తోడను, జగద్రూపముతోడను, శరీర రూపముతోడను, తమతమ స్వభావ లక్షణములతో వివర్తము నొందినట్టులే యే వస్తుశక్తి యా వస్తురూపముతో వివర్తము నొందుచుండును. అందువల్లనే యాయనకు సర్వశక్తి యుక్తుండును, సర్వమును తనయందు గలవాడు నను పేర్లు వచ్చినవి. ఒక్క పరమాత్మ వస్తువునం దనేక విచిత్రములు గల జగములు యెన్నియో యెట్లుండుననన, నెమలి గ్రుడ్డునం దనేక రంగులుగల నెమలి యెటులుండునో, ఒక బీజమునందు, పండ్లు, పుష్పములు, ఆకులు, కొమ్మలు వ్రేళ్ళతో గూడిన వృక్ష మెటులుండునో, యటులనే యుండునని గ్రహించునది. ఇటుల నెరింగినవారలై, మన విచారణీయాంశమునకు మరలుదు.

సృష్టికి పూర్వము తానొక్కడైయుండి క్రియలేమిచే నిష్క్రియుడైయుండు పరమాత్మ కొంతకాల మటులుండిన పిదప, తనకు తానె కారణమై తా ననేక వస్తురూపములతో సృష్టిరూపు నొందవలె నని సంకల్పము గలవాడగుచున్నాడు. అనగా, వటవృక్ష బీజము యొక్క గర్భమందు దానినుండి ముందు బయలుదేరబోవు బాహుళ్యమై, శాఖోపశాఖలచే గూడిన వృక్ష నిర్మాణశక్తి, సూక్ష్మరూపముతో నాశనములేక యెల్లపుడునుండి, యాబీజము భూమియందు నాటబడగనే విజృంభించి వృక్షరూపముతో యెటుల బయలుదేరునో, అటులనే చిద చిదాత్మకమగు జగముయొక్క యునికి, యెల్లపుడును దనయందు గలిగి చిత్తు మాత్రము శరీరముగా గలదియై, సూక్ష్మ రూపముతో అంతులేని యాత్మ తత్వమందు లీనమైయుండు చైతన్య శక్తి, సంకల్పమను నామముతో బహిర్ముఖ వ్యాప్తి యాయెనని యర్థము.

అట్లు బహిర్ముఖ వ్యాప్తియై, సర్వజగమున కధిష్ఠాన భూత మును, శాంతంబును, నిరతిశయమగు సత్యమే స్వరూపంబుగా గలిగి పవిత్రమును నిర్విషయమునగు చిత్తుమాత్రమే శరీరముగా గలిగిన చైతన్యము, సంకల్పముతో గూడగనే, మాయా శబళిత బ్రహ్మమను పేర బరగుచున్నది. (దీనినే బ్రహ్మకాశమని గూడ బిలచుచున్నారు). సర్వమును దెలసికొనునట్టియు, సమస్త భూతములయందు యాత్మ రూపముతో నుండునట్టియు, సమస్త శక్తులు గలిగినట్టియు, యాబ్రహ్మము యెచ్చటెచ్చట యేయే రూపముతో వివర్తము నొందు చుండునో, ఆయా రూపములతో ప్రకాశించు స్వభావమును గలిగి యుండునని తెలిసికొనవలయును. (వివర్తము అనగా నిజముగాని రూప మని యర్థము).

ఇట్లు సంకల్పముతో గూడిన చైతన్యమను బ్రహ్మము సృష్టి కాలమందు తనకుతానె కారణమై తన ఇచ్ఛాశక్తి (సంకల్ప శక్తి) చే, తానే యనేక వస్తురూపంబులతో వ్యాపితంబగు జగద్రూపముగ స్ఫురింప నుద్యుక్తుడై, దేశకాల వస్తు పరిచ్ఛేద్య మనునది లేక (అనగా యొక కాలము యొక దేశము అను వివక్షత లేక) సర్వదేశములయందును, సర్వ కాలములయందును తానెచ్చోట యే వస్తురూపముతో వివర్తము నొందుచుండునో, యచ్చోట తన స్వభావలక్షణములలో నొకటియగు 'సత్తు' యాయా రూపములతో ప్రకాశించుచు సృష్టి రూపమును బొందుచుండ, తానందు ప్రవేశించి యా యా రూపములు గలవానివలె ప్రకాశించుచు నుండు, ప్రపంచ రూపముతో దృశ్యావస్థను బొందినవాడాయెను.

తదుపరి చిత్తుమాత్రమే శరీరముగా గలిగి, యుపద్రవ రహితమై, నిర్మలమై, నిర్వికారమై, యెల్లెడల సమానముగా వ్యాపించి నిండియుండు ఆత్మ తత్వమగు బ్రహ్మమునందలి జ్ఞానము, తన స్వతస్సిద్ధమగు జ్ఞానరూపమునకు విరుద్ధముగా అచిదాత్మకమగు దృశ్యమును గల్పించి, దానినే అనుసరించుటచే తాను బ్రహ్మరూపమైనందు వలన తనకేమియు నుపద్రవము లేకపోయినను, తాను ఉపాధిని

బొందుటవలన యుపద్రవము గలుగగలదని తెలిసియుండియు, స్వేచ్ఛతో సముద్ర జలంబునుండి తరంగాదులు గలిగిన చందంబున, సంకల్పశక్తిచే ' మనస్సు ' గా వివర్తము బొందినదాయెను.

ఇట్లు వివర్తము నొందిన ' మనస్సు ' నకు కూడ, ఆకాశము నకును, సంకల్పమునకును నామము తప్ప రూపమేదియు లేనట్లే, బాహ్యమందునగాని అంతరమందునగాని యేవిధమైన రూపమును లేక, శూన్యమై యున్నది. అట్టి స్థితిలో, యాకాశమును భ్రాంతి దృష్టితో చూచి నీలిరంగు రూపము గలదని చెప్పుచున్నట్లు, యెదుటనుగాని చాటునగాని యున్న పదార్థముల యెడ బ్రహ్మముయొక్క చైతన్యము (జ్ఞానము) వలన గలుగు పదార్థజ్ఞానమే ' మనస్సు ' యను అధ్యాస గలవారలై, యాకారములేని చైతన్యము (జ్ఞానము) నందు పదార్థ రూపమగు యే అధ్యాస గలదో, దానినే ' మనస్సు ' అని చెప్పుచున్నారు. " అధ్యాస " యనగా " కాని దానియందు మరి యొకటి యని తోచుట " యని యర్థము. కాన సంకల్పమే మనస్సు అనియు, యదిగాక వేరు పదార్థము గాదనియు, తెలుసుకొనునది. చలనముకంటె వాయువు వేరుగా లేనట్లు, సంకల్పముకంటె మనస్సు వేరుగా లేదనియు, సంకల్ప మెచ్చటయుండునో మనస్సు యక్కడ యుండుననియు దీనివలన దెలుసుకొనునది.

సర్వవ్యాపకుండును, స్వయంప్రకాశమానుండును, నైన పరమాత్మ యెప్పుడు సంకల్పము గలవాడగుచున్నాడో, యప్పుడా సంకల్పముచే యేర్పడిన రూపము ' మనసు ' అని చెప్పుచున్నారు. గనుక సర్వశక్తులు గలదియు, నిత్యమైనదియు, అంతట వ్యాపించునదియు నైన " బ్రహ్మమే " సంకల్పయుతముగాగనే ' మనస్సు ' యని జ్ఞానవంతుల యభిప్రాయము. కాన ' మనస్సు ' యనునది బ్రహ్మముకంటె వేరు వస్తువ గానేరదని గ్రహించునది.

ఇట్లు సంకల్ప సహితమైన బ్రహ్మమునుండి యేర్పడిన మనస్సు తన వికల్పములచేత, శూన్యమైన యాకాశమున లేని నీలిరంగు గల్పించినట్లు, తాను శూన్యంబైనను బ్రహ్మమునందు శూన్యంబగు జగమును

కల్పించుచున్నది. అది యెట్టులో విచారింతము. ఇట్లు చిదాత్మడగు బ్రహ్మము సంకల్పముతో గూడుటవలన యేర్పడిన 'మనస్సు' బ్రహ్మముయొక్క స్వభావలక్షణమైన నిశ్చలత్వమునకు జతగా, సంకల్పముయొక్క స్వభావలక్షణమైన చలనత్వముగూడ గొంతవరకు కలిగియున్నది. ఆ చలనత్వమను దానిని సంకల్పరూపమైన మననశక్తి, చిద్రూపిణియగు చిచ్ఛక్తి యను పేర్లతో నెరుంగబడుచుండును. ఈ మనస్సు యను సంకల్పయుతమైన బ్రహ్మము, ఉన్నతంబగు కైవల్యపదంబున యుండు తన స్వరూపము నెరింగియున్నదయ్యును, సంకల్ప స్వభావ లక్షణమగు చలనమునుగూడ గలదగుటచే చిచ్ఛక్తిచే క్షణకాలము చలించినదై, అట్లు చలించినపుడు తన రూపము పరిమితమైన దానినిగా భావించుచు, దేశకాల క్రియాదులను శక్తులను సృష్టి కొరకు ప్రేరేపించుచుండును. ఈ చలన స్వభావములే యవిద్య యనియు, అజ్ఞానమనియు చెప్పుచున్నారు. చిదాత్మకమగు మనస్సు చలనము లేనిదై నిశ్చలత్వలక్షణమును గలిగియున్నంతవరకు "బ్రహ్మము" అని చెప్పుచున్నారు. చిచ్ఛక్తిచే చలించి యెప్పుడైతే దేశకాలక్రియాది శక్తులను సృష్టికొరకు ప్రేరేపించుచున్నదో, అప్పుడు అవిద్యా స్వరూపము గలదియై "చిత్తము" అను పేర బరగుచున్నది. ఆ మనస్సు నిశ్చలస్థితిలోయున్నంత వరకు తనయందుగల దేశకాలవస్తు నపరిచ్ఛిన్నంబగు లక్షణము తాను చలించగనే మారి, సంకల్ప వికల్పములతో గూడి, దేశకాల వస్తు పరిచ్ఛిన్నంబైనటులనే, తనయందలి 'చిత్తు' కు గూడ మారినటుల గనుపడునట్లు చేయుచున్నదేగాని, జ్ఞానస్వరూపమగుటవలన 'చిత్తు' న కట్టిమార్పు యెన్నటికిని గలుగనేరదని తెలిసికొనునది. అట్లు చేయుటవలన, చిదాత్మకమగు చిత్తమును, 'క్షేత్రజ్ఞుడు' (జీవుడు) యని బిలచుచున్నారు. ఆచిచ్ఛక్తి సర్వశక్తులుగలది యగుటవలన, పైన చెప్పిన ప్రకారము ప్రేరేపించినదై, తాను తిరిగి చిద్రూపియగుచుండును. ఇట్టి చిత్ర విచిత్ర శక్తులుగలదియై బ్రహ్మము నుండ యేర్పడిన "మనస్సు" నే "బ్రహ్మము" సమష్టి చిత్రరూపముతో వివర్తము నొందెనని బృహద్వాసిష్టమునందు చెప్పబడినది. ఈయంశములవలన బ్రహ్మమునకు కేవలరూపము, చలనరూపము,

యని రెండు రూపములుగలవని తేలుచున్నది. అందులో కేవల రూపము, పరమాత్మ స్థితియని లోగడనే దెలిపియున్నాను. రెండవది దైన చలనరూపము, చిదాత్మకమగు మనస్సు యొక్క నిశ్చల స్థితికి చేతనము గలుగగా యేర్పడిన చిదాత్మకమగు చిత్తస్థితియని యెరుంగునది.

ఇట్టుల నేర్పడిన మనస్సు తదుపరి చిచ్ఛక్తిచే చలింపబడినదియై ముందు శబ్దతన్మాత్రను భావించి, తదుపరి దాని గుణకంబగు యాకాశము ను భావించినదియై యాకాశరూపమును బొందినదాయెను. ఇట్టులే వరుసగా స్పర్శ, రూప, రస, గంధంబులను తన్మాత్రల భావించి, వాటి గుణకంబులగు వాయువు, అగ్ని, జలము, పృధ్వి యను సూక్ష్మ పంచ మహాభూతములను భావించినదియై వాటి రూపముల బొందినదాయెను. ఇట్లు పంచతన్మాత్రలతోను, వాటి గుణకంబులగు పంచమహాభూతంబులతోను గూడిన మనస్సు ప్రకాశమానంబగు యొక శరీరమును భావించగా, అహంకారముయొక్క కళలగు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతోడను, బుద్ధితోడను గూడినదియై యొక శరీరము యాకసంబున గోచరింపగా యాశరీరమునందు ప్రవేశించిన దాయెను. ఈ శరీరమే ప్రాణికోటికి హృత్పద్మమందుండు సూక్ష్మశరీరమని యెరుంగునది. ఆ సూక్ష్మ శరీరమందున్న మనస్సు తీవ్రమైన వాసనా బలముచే యా శరీరమును స్థూలత్వమును బొందించినదియై, తన స్వభావంబుచేత యా శరీరమునకు మీదు భాగంబున శిరంబును, క్రిందుభాగంబున పాదంబులును, రెండు పార్శ్వములను చేతులును, నడుమ ఉదరంబును గలుగునట్లు చేసి, ఆ యాకారంబును ధరించెను. అంత యా యాకారమే క్రమక్రమముగా స్పష్టత్వమును బొంది, నిర్మల రూపంబై బుద్ధియు, సత్వంబును, బలంబును, యుత్సాహంబును, విజ్ఞానంబును, ఐశ్వర్యంబును, అను గుణములతో గూడినదియై సర్వలోకములకు పితామహుండును, సకల భూతకోటికి కారణభూతుండును, అగు బ్రహ్మదేవుడాయెను. ఈయనయే హిరణ్యాగర్భుడను నామముతో బిలువబడుచున్నాడు. దీనినే "బ్రహ్మము" సమష్టి జీవస్వరూపముతో వివర్తము నొందెనని బృహదార్యోపనిషత్తునందు జెప్పబడినది.

పరమాత్మయే కారణముగాగల యీ బ్రహ్మదేవుడు, సంకల్పముచే మనస్సున గోచరించెడు స్థూల పంచభూత సమ్మేళనమువలన యేర్పడిన స్థూల శరీరమును బొందిన పురుషునివలె స్థూల శరీరమును నది లేక, సూక్ష్మ శరీర మొక్కటియే గలవాడై యున్నాడు. ఆద్యంతరహితమైనట్టియు, చిదాకాశ మాత్రరూపంబు గలిగినట్టిదియును, నగు బ్రహ్మ తత్వమునకు వాస్తవముగా శరీరము లేకపోయినను, చూచువానియొక్క మనస్సునుబట్టి చతుర్ముఖంబులుగల పురుషునివలె యాకసంబున తనంతటతాను గాన్పించుచున్నాడు. ఇటుల నేర్పడిన సమష్టి జీవస్వరూపుండగు బ్రహ్మ తానే పూర్వ వాసనలనుబట్టి విరాడ్భావంబును (అనగా భువన భావంబును, యందుండు నానావిధంబులగు ప్రాణుల భావంబును) సంకల్పించగా, ఆ సత్య సంకల్పముచే యీ జగద్రూపమగు సంసారము విస్తరించుచున్నది.

ఆకాశమను నది తనంతట తానే నిర్మల జలమునందు ప్రతిఫలించి వేరుగా దోచినట్లు, నిష్క్రియత్వాది లక్షణములుగల యీ పరమాత్మ, ఆకాశాది పంచ మహాభూతములచే యేర్పడిన లింగశరీరమందు బ్రవేశించినవాడై, తాను యితరునివలె యందు ప్రకాశించుచు, తన సంకల్పముచే ప్రాణులకు ప్రాణధారణ నిమిత్తం స్థూల దేహ మేర్పడిన పిదప, దానియందు బ్రవేశించి, త్రిపుటియందు వ్యాపించి, త్రిపుటుని ప్రకాశింపజేయుచు, సాక్షి చిన్మాత్రుడను పేర బరగుచు ప్రకాశించుచున్నవాడాయెను. ఈ సాక్షి చిన్మాత్రుడే యీ శరీరమందలి ప్రాణములను ధరించినందువలన నిత్సితార్థముగల జీవుడను పేరుతో వ్యవహరింపబడుచు, జీవత్వమును బొందిన వానివలె భ్రాంతి దృష్టికి గనుబడుచున్నాడేగాని, వాస్తవముచే యట్టిజీవత్వమును బొందుట లేదని యెరుంగునది. అది యెట్లులో విరళముగా యీక్రింద దెలిపెదను.

లోగడ, బ్రహ్మము సంకల్పముతో గూడిన తదుపరి, ఆ కలయిక వలన బ్రహ్మముయొక్క నిశ్చలత్వ లక్షణమును, సంకల్పముయొక్క చాంచల్య లక్షణమునుగూడ గలిగినదగు 'మనస్సు' యను నది యుదుండి గలిగినదనియు, యీ మనస్సు సంకల్పమువలెనే బ్రహ్మముకంటె వేరుగాదనియు, యీ మనస్సునకు చలన మనునది

సంకల్ప సంబంధమైన చిచ్ఛక్తి వలన కలుగుచుండుననియు మనస్సన గా చలనము గలుగకుండ నిశ్చలత్వ స్థితిలో నుండునంతవరకు (చిదాత్మకమగు మనస్సు) బ్రహ్మము అనియు, చలించిన స్థితిలో చిదాత్మకమగు చిత్తము అని యెఱుంగబడుచుండు ననియు, లోగడ దెలిపియుంటినిగదా ! దానినే పాఠకుల జ్ఞప్తికి దెచ్చుటకై యిచ్చట తిరిగి దెలిపియుంటిని. ఈ సందర్భములోనే మరియొక చిన్న యంశమును గూడ దెలుపుచున్నాను. మనస్సు, చిత్తము అనునవి సంకల్పమువలెనే జడపదార్థములని యెఱుంగునది. అనగా యితర సహాయములేనిది పనిచేయలేని పదార్థములని భావము. ఈ జడపదార్థము లన్నియు బ్రహ్మము యొక్క సాన్నిధ్య స్థిత సహాయములేనిదే పనిచేయ లేవని యెఱుంగునది. అనగా, స్థూల శరీరములో బ్రహ్మము ప్రాణములను ధరించియుండునంతవరకు జడ పదార్థములైన యింద్రియములు వాటివాటి పనుల నెరవేర్చుటకు సమర్థత గలవియై యుండి బ్రహ్మము యా స్థూల శరీరమునుండి బయలు వెడలిపోగానే యా యింద్రియములు తిరిగి జడత్వమును బొంది కదలికలేక బడి యుండునట్లు, బ్రహ్మము సాన్నిధ్యమున నుండిననే యీ సంకల్పము, మనస్సు, చిత్తము అనునవి వాటివాటి స్వభావలక్షణముల జూపుచు పనిచేయుగల సమర్థతను బొందునని యెఱుంగునది. కాన బ్రహ్మముకు వీటియొక్క నడకల సంబంధములో సాధన సాన్నిధ్య కర్తృత్వమును గలిగియుండునని స్పష్టపడుచున్నది. ఇటుల నెఱింగినవారలై బ్రహ్మము స్థూల శరీరమందు వ్యాపించి ప్రాణముల ధరించిన పిదప అందు జగద్వ్యాపార నిర్వాహక స్థితి యెటుల జరుగుచున్నదో దానిని దెలిపెద.

ప్రాణములు అనునవి సంకల్ప సంబంధమైన చలనాత్మకత్వమును బొందినవియై యున్నవి. అట్టి ప్రాణములను బ్రహ్మము ధరించినాడనగా, అట్టి చలన స్వభావ లక్షణమును గలిగిన మనోరూపమును ధరించినాడని యర్థము. అనగా చలన స్వభావ లక్షణముతో గూడిన చిత్త స్థితిని బొందిన మనస్సును ధరించిన వాడాయెనని యెఱుంగునది. ఇట్లు ధరించుటవలన తాను జ్ఞాన స్వరూపుడగుటచే తన కేమియు యుపద్రవము గలుగుటకు సావకాశము లేకపోయినను, తాను జీవత్వమును

బొందినాడను వాడుక తనకు రాగలదని యెఱింగియు స్వేచ్ఛతో ధరించెనని లోగడ దెల్పియున్న యంశమును నిచ్చట జ్ఞప్తికి దెచ్చుకొనుడు. ఇట్టి స్థితిలో జీవత్వమును బొందలేదను వాస్తవస్థితి నెఱుంగుటయే జీవునికి జ్ఞానస్థితి యనియు, జీవత్వమును బొందినాడని దలంచుటయే యజ్ఞానస్థితి యనియు నెఱుంగునది. జ్ఞాన స్థితిని సంపాదించుటయే ముక్తికి మార్గమనియు, యజ్ఞాన స్థితిని బొందుటయే సంసారమునబడి బంధముల బొలగుటయనియు యెఱుంగునది. బ్రహ్మము నందలి చిదాత్మ ప్రపంచాతీతమైనను, అట్టి చిదాత్మయందు యీ ప్రపంచ మెట్లు కలిగినదో దానిని గురించి విచారింపదలంచి ముందుగా చిదాత్మయొక్క స్థితిని దెలిపెదను.

ఆకాశమనునది సర్వవస్తువులను తనయందు గలిగియున్నను, నది రూపగహితమగుటవలన యీ స్థితిని దెలిసికొనుటకు సాధ్యముగా నున్నది. అట్లులే చిదాత్మయనునదికూడ సర్వమును దాను బొందియున్నదయ్యును, అవయవ రహితమగుటవలన యీ స్థితిని దెలిసికొనుటకు సావకాశము లేకున్నది. ఇట్టి చిదాత్మకు యేవిధమైన సంకల్పముగాని నామముగాని లేకపోయినను, 'స్వాత్మ' అను మొదలగు పేర్లు బండితులచే పెట్టబడినవి. ఆకాశముకంటె యనేకరెట్లు నిర్మలత్వమును గలదియై నాశరహితమైన స్థితిని బొందియున్నది. ఇది జ్ఞానులయందు నిష్కళంకమగు జ్ఞానరూపముతో యాత్మకంటె వేఱుగానిదైన ప్రకాశము గలదియై ప్రకాశించుచుండును. అజ్ఞానులయందు సకల విధంబులైన భయంకరంబును, దుఃఖకరంబునగు సంసార స్వరూపమును గలదియై యుండి యనుభవముల ననుసరించిన కర్మములను వారిచే జేయించుచు, భోగ్యవస్తువుల ననుభవింపజేయుచు, ప్రవృత్తి హేతువగుచు ప్రకాశించుచున్నది. ఈ చిద్రూపమగు వస్తువు యొక్క చోటుయను నియామకములేక అన్ని చోట్లను బ్రకాశించుచు, యితర వస్తువును భావించుటచేత తన స్వరూపావస్థను విడచిపెట్టి యా వస్తు స్వభావమును గలది యగుచుండునని యెఱుంగునది. ఇటువంటి చిదాత్మయందీ ప్రపంచ మెట్లు కలిగినదో తెలుపుచున్నాడ.

స్థూల శరీరమునందు బ్రవేశించి ప్రాణములను ధరించి మనోభావమును బొందిన బ్రహ్మము, కట్టెలధికమైన కొలదని నిప్పు కణముల కధిక ప్రకాశము బొందునట్లు, అహంకారభావన తనయందు యభివృద్ధి నొందగా (అనగా తానే అహంకారమనుభావన అతిశయించగా) అహంకారావస్థను బొందుచున్నది. అనగా చూచువారికి కనుచూపు పారినంతవరకు, ఆకాశమునకు నీలిరంగు రూపము గాన్పించక, కనుచూపుపారక కనబడని దూరపు స్థలములో భ్రాంతిచే, యాకాశమునందు లేని, భ్రాంతి నీలిరంగు రూపముతో గనుపించునట్లు, తాను జ్ఞాన స్థితిని బొంది తనను తానెరుంగగలిగిన తనయందు అహంకార మనునది గాన్పించక, అట్టి స్థితిని బొందని యజ్ఞాన స్థితిలో యున్న తనయందు నిజముగా లేని యహంకార మనునది తోచుచున్నదని బృహద్వాశిష్టమునందు జెప్పబడియున్నది. ఇటుల తనయందు దోచిన యహంకారమునకే తిరుగ మనోభావన అతిశయించగా, (అనగా తానే మనస్సు యను భావము వృద్ధిబొందగా) చిత్తము, మనస్సు, మాయ, ప్రకృతియను బేర్లు గలిగిన మనస్సు యగుచున్నది. ఇట్లు భ్రాంతిచే యేర్పడిన మనస్సు నీవు, నేను, నీది, నాది, యను భేద, అభిమాన వృత్తులుగల యహంకారావస్థయును, నిశ్చకత్వవృత్తిగల 'బుద్ధి' యవస్థయును, సంశయత్వవృత్తి గలిగిన 'చిత్తా' వస్థయును, సంకల్ప, వికల్ప వృత్తులు గలిగిన 'మనో' యవస్థయును, అను యవస్థాంతరముల బొందుచున్నది. ఇట్టి యవస్థాంతరముల బొందిన బ్రహ్మమే, అహంకారమునందు బ్రవేశించి, పురుషుడు (ప్రమాణీకరించువాడు) అను పేర బరగుచు, ఆయా వృత్తులయందు జొచ్చి, పదార్థ విషయ రూపముల నొందుచు తానె వరుసగా "జ్ఞాతి, జ్ఞానము, జ్ఞేయము" అను మూడు భేదములను తన సంకల్ప శక్తిచే బొందినవాడై చైతన్యముయొక్క నడుమను, బాహ్యేంద్రియముల చేతను మనస్సు చేతను గ్రహింపబడునట్టి విషయముల చేతను, పదార్థములచేతను వ్యాపితంబగు జగద్రూపమును బొందినవాడై, ప్రకాశించుచున్నాడు. కాన యీ యంశములవలన, యిట్లేర్పడిన యీ యసత్య జగదృశ్యమునకు పరమాత్మ నిమిత్తకారణుడుగా దోచుచున్నాడు.

మరియు, "తానెచ్చోట యేరూపముతో వివర్తము నొందునో యచ్చోట తన సంకల్ప శక్తిచే తన స్వభావ లక్షణములలో నొకటి యగు 'సత్తు' వలన యాయా రూపముల నేర్పరుపబడ తానందు బ్రవేశించి యాయా రూపములు 'గలవానివలె' ప్రకాశించుచు న్నాడు" అనుటవలన, పరమాత్మ స్వరూపముకంటె వేరుగాని యీ దృశ్యమునకు పరమాత్మ యుపాదాన కారణుడుగూడ నగు చున్నాడని గ్రహించునది. ఇట్లు తానే నిమిత్త కారణుడును, యుపా దానకారణుడుగ నేర్పడి తన మాయచే నేర్పరుపబడిన యీ అసత్య జగద్రూప దృశ్యము పరమాత్మ స్వరూపమేకాని వేరుగాదని, పై యంశములవల్ల ధృవపడుచున్నది. కాన సుస్థిరమగు సముద్రము నుండి యస్థిరమగు తరంగాదులు గలిగిన చందంబున సుస్థిరమగు పర మాత్మనుండి, చలన స్వభావము గలదై అస్థిరమగు మనస్సు యేర్పడి చిచ్ఛక్తిచే చలింపబడినదై తాను పరమాత్మ నను భావము మరచి నదియై మనస్సుయొక్క ధర్మములగు సంకల్ప వికల్పములు తనవియని తలంచుచుండు మనోభావమును బొంది హిరణ్యగర్భుడను పేరును బడ సిన బ్రహ్మ తానే పూర్వవాసనలనుబట్టి విరాడ్భావము (అనగా భువన భావము, అందలి నానావిధములగు ప్రాణుల భావమును) సంకల్పిం చిన వాడుగాగా ఆ సత్యసంకల్పముచే జగద్రూపమగు ఇంద్రజాల విలాసము విస్తరింపబడుచున్నది.

పరమాత్మవలన గలిగిన యీ జగము ఇంద్రజాల మనబడునెడల దీనికంటె వేరుగాని బ్రహ్మయు మిథ్య గావలసివచ్చుచున్నది. లేదా బ్రహ్మ సత్యముగాన యీ జగముగూడ సత్యము గావలసివచ్చు చున్నది యనిన దెలిపెద వినుము. బంగారముతో చేయబడిన కడి యము బంగారముకంటె వేరుగాదు. త్రాడు యనునది లేక సర్ప భ్రాంతి యనునది గలుగనట్లు బంగారము లేక కడియ మనునది ఏర్ప డదు. కడియ మనునది లేక బంగారముండును. కాన యిచ్చట బంగార మనునది అధిష్ఠాన వస్తువుగాను కడియ మనునది యారోపింపబడు వస్తువుగాను ఎరుంగవలయును. పైన చెప్పబడిన యుదాహరణము వలన ఆరోపింపబడు పదార్థముయొక్క యునికియు ప్రకాశమును నధి

ష్ఠాన వస్తువు నపేక్షించునుగాని, అధిష్ఠాన వస్తువుయొక్క యునికియు, ప్రకాశమును ఆరోపింపబడు వస్తువు నపేక్షింపదు. కాన అధిష్ఠానమగు బ్రహ్మకంటె ఆరోపింపబడు జగము వేరుగాన మిథ్యయు, ఆరోపింపబడు జగముకంటె వేరుగానున్న బ్రహ్మ సత్యముగానగును. తననీడ పిశాచ మను భ్రమను గల్పించినట్లును, ఎండమావులవలన కదలుచున్న తరంగములు నీరయను భ్రమను గల్పించినట్లును, సత్యంబగు బ్రహ్మమునం, దేర్పడిన అసత్యమగు మనస్సుచేత తాను చలించి చిత్త (యద్వ) స్థితిని బొందినదై యేర్పరుపబడిన యీజగద్రూపమగు ఇంద్రజాలము యవిద్యాకార్యముగాన జగము మిథ్యయగుచున్నది.

విద్య (జ్ఞానము) చే బోవుచున్నది గాన యవిద్యయనియు జన్మకు కారణమగుచున్నది గాన సంసృతియనియు, భ్రాంతినిగలిగించు నదిగావున మోహమనియు, అస్వాతంత్ర్యము (స్వాతంత్ర్యములేకుండుటను) గలిగించునదిగాన బంధమనియు, ఉన్నదనియు, లేదనియు నిర్వచించుటకు వీలులేనుగాన మాయయనియు, పాపమూలముగాన మలమనియు, తనరూపమును దెలియనియక యావరించునది గాన తమమనియు, పండితులగువారీ యవిద్యకు నామముల గల్పించిరని "జ్ఞానవాశిష్ఠము" నందు చెప్పబడినది.

చూచుచున్నట్టి ఆత్మకు చూడబడుచున్నట్టి, నీవు, నేను మొదలుగాగల భేదద్వైత ప్రపంచము గాన్పించుచున్నంతవరకు బంధమును గలిగించుచునేయుండును. ఆబంధమునుండి విముక్తిని బొందిన గాని మోక్షములభింపదు. ఎందువల్లననగా, యీ ద్వైత ప్రపంచమందలి విషయభోగములు వాసనారూపమును ధరించినవియై గర్భము నందు అంకుర శక్తిగల బీజములై సూక్ష్మరూపముతో నిలచి దేశకాలముల ననుసరించి వృద్ధిని జెందుచు మోక్షమును సంపాదించు రాజ బాటకు అడ్డంకి గలుగచేయుచుండును. ఆ వాసనయనునది మలినవాసన, శుద్ధవాసన యని రెండు విధములు. మలినవాసననే విషయవాసన యని గూడ జెప్పుచున్నారు. ఈ విషయ వాసనయే యీ-

యసత్య ప్రపంచదృశ్యము. ఈ విషయవాసన యనునది దృఢమైన యజ్ఞానమే స్వరూపముగ గలదియై, (దృఢమగు అహంకారముచే యేర్పడు) పునర్జన్మమునకు కారణరూపమై యుండును. శుద్ధవాసన యనునది పొరటుబోయిన విత్తనమువలె, పునర్జన్మమునకు కారణము లగు అంకురశక్తులు విడచినదియై, దేహస్థితికి మాత్రము కావలశినంత వరకు ధరించినదియై, తత్త్వజ్ఞానముతో గూడినదియై యుండును. ఇట్టి శుద్ధవాసనగల బుద్ధిమంతులు తత్త్వజ్ఞులు, జీవన్ముక్తులు నగుదురని పెద్దల వల్ల తెలియుచున్నది. కాన యిట్టి యసత్యాద్వైత ప్రపంచము గాన రాకుండ జేసుకొని బంధములబారినుండి తప్పించుకొను మార్గము నెరుంగుటకు ప్రయత్నించుటయే తమపరి కర్తవ్యాంశము. కాన దీనికి ఆత్మజ్ఞాన మావశ్యకమని లోగడనే దెలిపియుంటిని.

వివేకము లేనివారు శాస్త్రముల నెరింగినను, అనురాగముగల వారు జ్ఞానమును సంపాదించినను, శాంతిలేనివారికి మనస్సుండియు, ఆత్మజ్ఞానము లేనివారికి శరీరముండినను, బరువుచేటేగాని ప్రయోజనము లేదని పెద్దలు దెలుపుచున్నారు.

ఈ సందర్భములోనే శ్రీరామచంద్రమూర్తి, "విషయ వాసనానుభవము గల మనుజుడు సంసారాగ్నియందు బడి దహింపబడు చుండినను, సముద్రమునందు జలము లేకుండుటయనునది యెన్నటికిని తటస్థించనట్లు సంసారమందు నిర్వ్యాపారత్వమును వహించియుండుట, శక్యముగాదు గాన అట్టి స్థితిలో మోహమును బోగొట్టునట్టియు దుఃఖరాహిత్యమును గలుగజేయునట్టియు యుపాయమునుదెలుపుము" అని వశిష్ఠులవారిని కోరగా, అందులకు "ఇట్టి ప్రశ్నయే శ్రీశుకుల వారు జనకమహారాజు నడుగగా వారు శెలవిచ్చిన యుత్తరమునే" శ్రీరాములవారికి విశ్వామిత్రులవారు దెలిపినట్టు జ్ఞానవాశిష్టమునందు గాన్పించుచున్నది. అది తెలిసికొనదగిన ముఖ్యాంశమైనందువలన యీ వృత్తాంతమునెత్తి చదువరుల కోరకిచ్చట వ్రాయుచున్నాడ.

"మహానుభావులగు శ్రీశుకులవారు తనకు భగవంతునివలన ననుగ్రహింపబడిన వివేకముచే లోకసంసరణనుగురించి విచారణచేసి,

బహుకాల విచారణ పర్యవసానముగా యెయ్యది నిజమో, అట్టి బ్రహ్మ వస్తువును గ్రహించినవాడాయెను. ఇట్లు గ్రహించిన పరవస్తువు నందు మనసు నిలుకడలేక యిదియ పరమాత్మయని మనసునందు నమ్మకము బొందకపోయెను. పిదప, యా శుకునియొక్క చిత్తము చపల స్వభావమును విడచి విస్తారమైన భంగములు గలుగజేయు భోగముల వల్లనుండి విరమించెను. అంతట మేరుపర్వతము మీాద ఒంటరిగానున్న తన తండ్రియగు వ్యాసమహర్షి చెంతకుబోయి "మునీంద్రా! ఈ కనుపడునట్టి సంసారవ్యాప్తి ఎట్లు కలిగినది? ఇది యెట్లుఅడగును? ఇదిఎంత పరిమాణముగలది? ఎవనికిగలిగినది? ఎప్పుడుగలిగినది? చెప్పుము." అని భక్తితో వేడెను. అంత యాత్మతత్వము నెరింగిన యా మహర్షిచే, తన వివేకముచే తానెరింగిన నిజమునే చెప్పబడగా, నేనీయంశమును పూర్వమే ఎరింగితిని అని యెంచి తండ్రియొక్క వాక్యమును తన బుద్ధిచే గొప్పచేయకపోయెను. జ్ఞాన వైరాగ్య సంపన్నుండగు యా వ్యాసమహర్షి కొడుకు యుద్దేశమును గనిపెట్టి "నేను యదార్థమును గుర్తెరుంగనని" కుమారునితో తిరిగి బలికెను. అట్లు పలికి, "యీాభూమి యందు జనకుడను రాజుగలడు. ఆతడు తెలసికొననగు నంశమును నిజముగా నెరుంగును. అతనివలన సమస్తమును తెలిసికొనగలవు." అనియు జెప్పెను. ఇట్లు చెప్పబడినవాడై శుకుండు ఆ మేరుపర్వతము నుండి బయలుదేరినవాడై యా రాజు పాలించు మిధిలానగరమునకు బోయెను. తనరాక విషయము ద్వారపాలకుల వలన నెరింగినవాడై ఆమహారాజు శుకుని యంతఃపురమునకు రప్పించి చూచి నమస్కరించెను. తదుపరి "మహానుభావా! నీదుకోరికయేమి యని ప్రశ్నించెను." అందులకు శుకుడు "గురువా యీా సంసారము యొక్క వేగిర పాటు ఎట్లు పొడమినది? ఇది యెట్లు అడంగును? దీని నిజము శీఘ్రముగా నాకు చెప్పుము" అని వేడగా మున్ను శుకుని తండ్రియగు వ్యాసమహర్షిచే జెప్పబడిన దానినే యా జనకుడు జెప్పినవాడాయెను. అంత,

శుకమహర్షి :— "మున్ను నాయంతటనేనే నా వివేకమువలన యీ యర్థము తెలిసికొనగలిగితిని. నాతండ్రిని యడుగగా వారును యీ యర్థమునే చెప్పిరి. జనక మహారాజా నీచేతను యీ యర్థమే చెప్పబడినది. ఈ యర్థము శాస్త్రములయందును చూడబడుచున్నది. సారములేని యీ వ్యర్థసంసారము ఎట్లు తనదు వికల్పముచే బాడమినదో అట్లు తనదు వికల్పమడంగుటచేతనడంగుననుట నిజము. గావున స్థిరముగా నిజమెద్దియో దానిని జెప్పుము. భ్రమించుచున్న చిత్తముచే తోచిన జగము నీ వల్లనుండి నాశమును బొందుగాక" అనెను.

జనకమహారాజు :—"శుకమునీంద్రా! నీయంతటనీచే తెలిసికొనబడియె. మరల గురువువలనను వినబడియెను. దీనికంటె వేరగునిశ్చయ మింకొకటిలేదు. అఖండమగు జ్ఞానమే రూపముగాగల యొక పురుషుడు గలడు. ఇంతికంటె యితరవస్తువెద్దియు లేదు. అతడు తనదు సంకల్పముచే సంసారబంధము కలవాడాయెను. సంకల్పమును విడచెనేని యీ బంధమునుండి విముక్తుడగును. మహానుభావుడవగుయే నీకు సమస్త భోగములవల్లనుండియు, సమస్త ప్రపంచమువల్లనుండియు, విరక్తి గలిగెనో అట్టి నీచేత తెలిసికొనదగు వస్తువు స్పష్టముగా తెలిసికొనబడియెను. నిండు మనసుగల నీచే పొందదగిన సమస్తమును బొందబడియె. కావున నీవు ముక్తి నొందితివి. ఇంక నెద్దియో కలదను భ్రాంతిని విడువుము అనిచెప్పెను.

అంత శుక మహర్షి యిట్లు జనక మహారాజుచే నాజ్ఞాపింపబడినవాడై నిశ్చలమగు పరవస్తువునందు విశ్రమించెను. అందువలన శోకము,

భయము, ఆయాసము, వీనిని విడచి సంకల్పరహితుడై సర్వ సందేహములు నివర్తిమై, సమాధి కొరకు మేరుపర్వతముయొక్క శిఖరమును గూర్చి చని అక్కడ పదివేల సంవత్సరములు నిర్వికల్ప సమాధియం దుండి పిదప పరమాత్మయందు చమురులేని దీపముబోలె శమించెను." అని విశ్వామిత్రుడు శ్రీరామచంద్రమూర్తికి శుక ప్రశ్నయు, జనకోత్తరమును దెలిపి, "సంపూర్ణములగు భోగజాలములు రుచింపకుండుట యేది గలదో, అది తత్వము నెరింగిన మనసునకు విశేష లక్షణ మగును. అసత్య జగదృశ్యమువలన బొడమినట్టి బంధము, భోగములయందలి తలంపుచే దార్ఢ్యమును బొందును. విషయముల ననుభవించవలెనను తలంపు అడంగెనేని, సంసార బంధము నాశనము బొందును. రామచంద్రా! విషయవాసన లడంగుటయే మోక్షమనియు, విషయవాసన దృఢమగుటయే బంధమనియు, పండితులచే జెప్పబడుచున్నది. కీర్తి, లాభము మొదలగు కారణము లేకయే, ఎవనికొరకు భోగములు రుచింపవో, వాడు జీవన్ముక్తుడని చెప్పబడును." అని బోధించెను.

ఇంతవరకు పై యంశములవలన దెలుపబడిన, పదార్థ సముదాయముచేతను, విషయములచేతను, విషయ భోగములచేతను వ్యాపితంబగు యీ అసత్య ప్రపంచ దృశ్యమునకు ప్రభువు ఆత్మ, మంత్రి మనస్సు, ఆ ప్రభువు యేకాంతమున స్వస్థుడై, నిర్వ్యాపారుడైయుండ, మంత్రియగు మనస్సు ఆ ప్రభువుయొక్క సంకల్పముతో సంబంధించిన కార్యములు యావత్తును నిర్వహించుచున్నది. మంత్రి పదవికి యేర్పరుపబడిన మానవుడా పదవిని చేబట్టకమునుపు సామాన్యపు మనిషియై యుండిన స్థితిలో ప్రభువు కార్యములు నిర్వహింప నసమర్థుడై యున్నను, యీ కార్యనిర్వాహణకు గావలశిన ప్రభు ముద్రాధికారముల బడసినవాడై, ఆ పదవిని బొందిన పిదప కార్యనిర్వాహకత్వమును నిరాటంకముగా జరుపగలవాడగు చందంబున, మనస్సనునది జడమగుటచే కార్యముల నిర్వహింపజాలకపోయినను, పరమాత్మయొక్క సంకల్ప జ్ఞానాంశమను ముద్రాధికారమును తనయందుంచ బడినందువలన, పరమాత్మ సంకల్పానుసారముగ గావలశిన కార్య

నిర్వాహణకు సమర్థతను బొందినదై, సకల కార్యముల నిర్వహించుచున్నది. మనస్సు నిశ్చల స్థితిలో యున్నంతవరకు జ్ఞానస్వరూపమగు 'బ్రహ్మమే' యైనను, చలించిన స్థితిలో అవిద్యచే నావరింపబడినదై, తాను సర్వశక్తులు గలదను అంశమును మరిచి, ఆ స్థితిలో ఆ యజ్ఞానావరణలో నుండి చేశిన కార్యములన్నియు అవిద్యాకార్యములనియు, ఆ స్థితి అజ్ఞానస్థితి యనియు చెప్పబడుచున్నది. ఈ అవిద్యాకార్యములన్నియు మనస్సుచే జేయబడుచున్నను, ఆత్మ సాన్నిధ్య సాధన కర్తృత్వమును వహించినందువలన, మనస్సుచే జేయబడు యీ అజ్ఞానకార్యములన్నియు, ఆత్మ జీవత్వమును బొందినదై చేయుచున్నదని అజ్ఞానులు చెప్పుచు, ఆత్మను జీవుడని బిలచుచున్నారేగాని, వాస్తవ స్థితిలో మనస్సునం దుంచబడిన జ్ఞానస్వరూపమగు ఆత్మవలన యట్టి అజ్ఞాన కార్యము లెన్నటికిని జరుగబడుచుండుట లేదని గ్రహించునది.

తదుపరి, యీ అసత్య దృశ్య ప్రపంచ సృష్టిసంబంధములో పదార్థ సముదాయ మేర్పరుపబడినప్పుడు వేర్వేరు స్వరూపములతో నున్నను, ప్రతి పదార్థ స్వరూపమును బ్రహ్మ స్వరూపముగా చెప్పబడుచుండెను గాని రాయి, కర్ర, గోడ మొదలగు నామములతో బిలువబడుచుండుట లేదు. మనస్సు, ఇట్లు జీవస్థితిని బొందినప్పుడు, జీవుని యుపయోగార్థం జీవుని వలన ఇది రాయి, ఇది కర్ర, ఇది గోడ, ఇది గుండ్రముగా నున్నది, ఇది పొడుగుగా నున్నది, ఇది పొట్టిగా నున్నది, ఇది లావుగా నున్నది అను నామములును, రూపములును, జీవునిచే కల్పింపబడినవి. అజ్ఞాన దశలోనున్న జీవునిచే యీ నామరూపములు కల్పింపబడకమునుపు, యీ పదార్థ సముదాయము యేమిగానున్నదని విచారించినయెడల, యేమియు చెప్పలేకపోవుస్థితిలో నుండును. అనగా అవాఙ్మానస గోచరముగానుండును. అనగా వాక్కుతో యిటువంటిదని చెప్పుటకుగాని, మనస్సుచే యిటువంటిదని యూహించుటకుగాని, సావకాశములేని స్థితిలో నుండును. ఈ స్థితి, పరమాత్మ స్థితియని ఉపనిషత్తులయందు చెప్పబడుచున్నది. అట్టి స్థితిలోయున్న ఆ పదార్థమును యేమిగా చెప్పవలశి యుండునన, "ఉన్నది, ప్రకాశించుచున్నది, సుఖదుఃఖములేక ఆనందముగా

నున్నది" అని చెప్పబడుచున్నది. వీటినే సత్తు చిత్తు, ఆనందమను లక్షణములుగా జెప్పుచున్నారు. సత్తు అనగా ఉనికి స్వభావము గలది. అనగా మూడు కాలములయందు ఉండునదియనియు, చిత్తు అనగా సహజ స్వరూపముతో ప్రకాశించునదియనియు, ఆనంద మనగా సుఖ దుఃఖములు లేకయుండునదియనియు యర్థము. గాన యీమూడు లక్షణ ములు గలది ఆత్మ. ఈ మూడు లక్షణములు ప్రతి పదార్థమందును గనిపించుచున్నవి. గాన ప్రతి పదార్థమును ఆత్మ స్వరూపమనియు "సత్యజ్ఞానమనంత మానందం బ్రహ్మ" మను వచన ప్రకారం ఆత్మయే బ్రహ్మముగాన, ప్రతి పదార్థమును బ్రహ్మ స్వరూపమనియే యెరుంగ వలెను. ఈ సత్తు, చిత్తు, ఆనందములనే "అస్తి, భాతి, ప్రియం" అను పదములచే వాడబడుచున్నవి. ఈ ప్రపంచమందలి యే పదార్థ మును గురించి, విచారణ చేసినను, ప్రతి పదార్థమును, అస్తి, భాతి, ప్రియం, నామం, రూపం అను అయిదు లక్షణములతో గాన్పించును. ఇందులో మొదటి మూడును (పరమాత్మ) బ్రహ్మముయొక్క లక్ష ణములనియు, చివర రెండును ప్రపంచ లక్షణములనియు నెరుంగునది. వీటిలో చివర రెండును కల్పిత లక్షణములు. బంగారమునుండి కడి యము పుట్టునది. కడియము పుట్టుటకు పూర్వము బంగారమున్నది. అట్లు పుట్టిన కడియమును చెడగొట్టుటవలన కడియము నశించిన తర్వాతగూడ బంగారమున్నది. కాన బంగార మనునది నశింపులేక ఎప్పటికిని యున్నది. అట్టి బంగారమునుండి కడియం పుట్టినదని భ్రాంతిచే దలంచుటయేగాని, బంగారమునుండి కడియం యెప్పటికిని పుట్టనేలేదు. ఎందువల్ల ననగా కడియ మనునది మూడు కాలముల యందుండునది కాదు. కాన దానికి పుట్టుక చెప్పగూడదు. కాన యింక పుట్టున వేవన, "కడియం" అను నామమును, "గుండ్రముగా నున్నది" యను రూపమును పుట్టునవి. ఈనామ రూపములు రెండును, అజ్ఞాన దశయందున్న జీవునిచే వ్యవహార యుపయోగార్థం కల్పింప బడినవి. జీవుడు తన యెదుటనున్నది, త్రికాలములయందుండు బంగా రమే అయియున్నను, ఆ బంగారమునందు కడియ మనునది లేకపోయి నను, దానినుండి పుట్టుకబోయినను, కడియం అను వేరొక వస్తువుగా

భావించి, బంగారమని చెప్పుటకు బదులుగా కడియమను అసత్య నామముతో బిలచుచున్నారు. అటుల బిలచుటవలన మూడు కాలములయందుండు సద్రూపమగు బంగారమను వస్తువును కల్పిత నామరూపములు కప్పివేయుచున్నవి. గాన బంగారముయొక్క నిజ స్వరూపము గానిపించుటలేదు. ఈ కల్పిత నామరూపముల తోసివేసినయెడల కడియం మొదలుగాగల కల్పిత నామముల పుట్టుకవలన అసలు పదార్థమునకు పెట్టిన వ్యవహారిక నామమగు "బంగారముతో" నిమిత్తం లేకుండా దాని నిజరూపము బయలుపడుచున్నది. అటులనే యీ జగద్వ్యాప్తమైన పదార్థ సముదాయమునకు అజ్ఞాన స్థితిలోనున్న జీవుని వలన కల్పింపబడిన నామరూపములను తోసివేసి విచారించినయెడల ప్రతి వస్తువును సచ్చిదానంద లక్షణములుగల బ్రహ్మ స్వరూపముగా గుర్తెరుంగగలవార మగుచున్నాము. అట్టి స్థితిలో అంతా సచ్చిదానంద స్వరూపమైనపుడు, ప్రపంచమనునదియే యుండదు. కాన విస్తారంబగు యీ జగంబంతయు బ్రహ్మ స్వరూపమనియు, విషయములు, విషయ భోగములు, నామరూప సముదాయము, నేనువేరు, యీ జగమువేరు అను ద్వైతభావన మొదలుగాగల అవిద్యా కార్యములన్నియు నసత్యంబులని నెరింగినవారలై యీ జగద్భ్రాంతిని వదలవలయును.

ఈ సంసారమునబడిన దేహధారులు మోక్షమును సంపాదించవలెనన్న, ఆ మంత్రియగు మనస్సును యుక్తిచే బట్టినయెడల క్షణములో స్వాధీనమగును. లేనియెడల కొట్టబడిన సర్పములవలె యెదురు తిరిగినదై, అజ్ఞానావరణలో బడద్రోసి బంధముల పాలుచేసును. ఆ యుక్తి యెద్దియన, పైనచెప్పిన విధముగా జగద్భ్రాంతిని వదలినవారలై, యవిద్యాకార్యముల చెంతజేరక, వాటియం దాసక్తిని వదలినవారలై, "సర్వంఖల్విదంబ్రహ్మ, ఏకమేవా ద్వితీయంబ్రహ్మ, నేహనానా స్తికించనా" అను వాక్యార్థములగు "సమస్తము బ్రహ్మ స్వరూపమే, బ్రహ్మముతప్ప రెండవ వస్తువేలేదు, ఆ బ్రహ్మముకాని కించిత్తు వేరుపదార్థ మేదియులేదు" అని మదిని బదిలపర్చుకొని శ్రీశుకులవారికి జనకమహారాజుచే చెప్పబడిన సారాంశములను

గ్రహించి, సదా బ్రహ్మభావనగలవారలై చిదాకాశమం దేవిధమైన సంకల్పములు లేక స్థిరమైన నిలకడను బొందినయెడల మనస్సున కే విధమైన వాసనయు లేనిదై, చేయునది యేమియు లేక స్వాధీనమగును. అప్పుడు యీ నిరంతర బ్రహ్మభావనానుచరణవలన, క్రమేపి సమాధి స్థితినిబొంది జీవన్ముక్తుడవుకాగా, పరమాత్మయం దేకముగాజేయును. అప్పుడు పరమాత్మతో కలసి సమస్తమగు భూతములను జూడకుండును. దీనినే సర్వవ్యాపకమగు బ్రహ్మపదమును పొందుటయని పెద్దలు వచించుచున్నారు. అప్పుడు కేవలుడు, కైవల్యమును బొందినవాడు, తాను మాత్రము మిగిలినవాడు అని చెప్పబడుచున్నాడు. జగము బొత్తిగాలేదను దృఢనిశ్చయముతో యీ బ్రహ్మపదమును బొందద గును గాని, ఇంకొకవిధమున బొందశక్యముగాదని రూఢిగా నమ్మ వలయును. సదా బ్రహ్మ భావనగలవారగుట యనగా, నిలచుండినను, కూర్చుండినను, నడచుచుండినను, నిద్రింపబోవుచుండినను, ఆహారము భుజించుచుండినను, ఇతరులతో మాటలాడుచుండినను, యే యితర కార్యములు చేయుచుండినను, సదా బ్రహ్మమును తన మానస దృష్టి యందు నిలుపుకొని భావించుచు, సర్వకార్యముల జేయుట యని యెరుంగునది.

జీవన్ముక్తుడగు వాని లక్షణములెట్లుండుననగా :—ప్రపంచము నందు తిరుగుచుండినను, తన యెదుట, కనుబడు యీ జగమును ప్రతి భాస మాత్రముగా (అద్దములో కనుబడు రూపములతో సమముగా) నెంచుచు, సర్వకాల సర్వావస్థలయందును పరమాత్మ భావమును తన మానసదృష్టియందు గలవాడై సంచరించుచుండును. ప్రపంచ వ్యవ హారములయందు సంచరించుచున్నను, రాగద్వేషాదులచే సంతాపము నొందక నిర్మలబుద్ధిగలవాడై, యేదేశమందైనను యే కాలమందైనను తనకేది తటస్థించినను, సుఖము గలిగినపుడు ముఖవికాసము కలిగి యుండుటగాని, దుఃఖముగలిగినపుడు వికాసహీనతగలిగి యుండుటగాని యనునవి లేనివాడై సంతృప్తినిబొందుచు, ఎల్ల వస్తువులయందు సమత్వ బుద్ధితో సంచరించుచుండును. ప్రపంచమందు కర్మలు చేయుచుండినను, కర్తృత్వాకర్తృత్వములకు సంబంధపడక, నేను కర్తనను భావములేని

వాడై, కర్మఫలముల నాశించక దైవాధీనము జేయుచు, తాను ప్రపంచ మందలి జనముకు భయమును కలుగజేయక యా జనముకు తాను భయపడక సంచరించుచుండును. ఇతరులకు తాను ప్రారబ్ధమువలన గలిగిన శరీరము గలవానివలె గాన్పించుచున్నను పైన చెప్పిన లక్షణముల తోగూడిన వాడై, ఇంకిపోయిన సముద్రమువలె తాను సంసార బంధములనుండి విముక్తుడై, వాస్తవముగ శరీరము లేనివానివలె యుండును. జీవన్ముక్తుడైనవాడు యీలక్షణములతో నొప్పుచు కొంత కాలముండి, తదుపరి తన భౌతికశరీరము కాలవశమును బొందుచుండగా, వాయువు నిశ్చలత్వమును బొందినట్లు విదేహముక్తిని బొందును.

## ముఖ్యాంశములు.

శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తో । జీవో దేవస్సనాతనః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం । సోహం భావేన పూజయేత్॥
(భగవదుత్తరగీత చతుర్థాధ్యాయము. శ్లో॥ ౨౭.)

దేహము దేవాలయమనియును, జీవుడు సనాతనుండగు దేవుడనియును తెలిసికొని అవివేకమనియెడు నిర్మాల్యమును విడిచిపెట్టి ఆ బ్రహ్మమే నేననియెడు తలంపుచేత పరబ్రహ్మమును పూజింపవలయును.

అవివేకావస్థకు కారణము భేదదృష్టిని కల్పించిన మనస్సు. మనస్సంకల్పమును అరికట్టిన ఆత్మయందైక్యమగును. అట్లు చేయుటకు, బుద్ధిచే ధర్మాధర్మ విచక్షణతో కార్యాకార్యములను తెలిసికొనవలెను. ఈ విధముగ సద్బుద్ధియను ఆంజనేయుని ద్వారా, మనస్సను సీత తత్త్వమును గ్రహించి, ఆత్మయను రాముని యందు నిలచియుండుటే జీవబ్రహ్మైక్యము.

ఈ ప్రపంచములో నున్నవి రెండే. రూపమున్నదొకటి, రూపములేనిదొకటి. కనుబడుచున్న దంతయు నశించునది. కనుబడకున్న దంతయు ఏ మార్పును లేక నిత్యమైయున్నది. ఈ విశ్వాసముతో కనుబడుచున్న యీ ప్రపంచమందు వైరాగ్య భావముగల్గి, కనుబడక

యున్న పదార్థమునందు లక్ష్యభావముంచి, యీవిచక్షణను అనుభవైక వేద్యము చేసికొనుటే జ్ఞానము.

ఈ అనుభవము కలుగుటకే గురువు శిష్యునికొకమాట కుడి చెవిలో చెప్పును. అదియే తారకము. శిష్యుడదివిని మననముచేయుచు, తనలోతాను నిత్యానిత్యములను విచారించుకొనును. అదియేసాంఖ్యము లక్ష్యపదార్థమందు మనస్సు నిల్పును. అదియే నిధిధ్యాస యనబడును, అదియే అమనస్కయోగము. ఇదియేరాజయోగము, ఇట్టి అనుభవము నెల్లరునుబొంది, సుఖులై, ఆపరమాత్మను యెల్లరును తెలిసికొని, ఏయుపద్రవములు లేక, ఎవరును దుఃఖమును పొందకుందురనియే శ్రీ ఆంజనేయ సద్గురు బోధామృతసార సంగ్రహము.

ఈ గ్రంథమునందలి ప్రకరణములు కూడ యీ భావమును యీ క్రిందివిధమున సూచించుచున్నవి.



## ముగింపు.

శ్రీ సద్గురు మహాప్రభువువారి యొక్క యనుగ్రహమువలన స్వల్పవ్యక్తినైన నాచే లిఖింపబడిన యీ చిన్న పొత్తము యెక్కువ జ్ఞానబోధను చేయగలిగిన సమర్థతగలది గాకపోయినను, మహామహులచే నీయబడు జ్ఞానబోధ నొక్కసారిగా అందుకొని గ్రహించగల జ్ఞాన పునాది లేని నావంటి పూర్తి అజ్ఞానదశలోయున్న వారికి అట్టి పునాది జ్ఞానమును కలుగజేసి, మహామహుల బోధలను సులభముగా గ్రహించ గల సమర్థతనైన గలుగజేయునను నమ్మికతో నిదర్శినిగా యుండునటుల మహామహులు యాశీర్వదించి అజ్ఞాని సముదాయమునంతయు కృతార్థుల జేయుదురుగాకయని ప్రార్థించుచున్నాడ. ఈ స్వల్పవ్యక్తిచే నీ పుస్తకము లిఖింపజేసిన యా సద్గురు మహాప్రభువు యొక్క కరుణను జూచి నాకు గలిగిన యానందమును వెల్లడిజేసి, అందులకు కృతజ్ఞతాభి వందనముల నొనరించి, మంగళంబులబాడి, ఇట్లు గలుగజేసిన యాపరమాత్మను గొనియాడి, సర్వబుధ జనావళికి నమస్కరించుచు విరమించుచున్నాడ.

### కీర్తన,

ఆనంద మానంద మాయెను । సద్గురు యనుగ్రహము మెండాయెను॥

౧. ఆరంభమందున ఆటకోటితనమును । అనంతరమందు ఆసక్తిలేక పోయిన॥ ఆ॥

౨. నేర్పదలచినపుడు నిర్లక్ష్యమైనను । నేర్చుకోదలచినంత నేప్రాప్తిలేకపోయిన॥ ఆ॥

3. చిగిలింతైశ్వర్యము పగిది । చిన్నవయసునెకాయ విచ్ఛిత్తునుబొంది మము చింతల పాల్జేసిన॥ ఆ॥

౪. సూక్ష్మశరీరివై కటాక్షతుంపరలు । ప్రోక్షించి కృపనుపలక్షించితివి దగ॥ ఆ॥

౫. చింతలన్నియుదీర్చి సంతసమగునటుల । పొత్తము ముగింపజేసి వింత గల్పించితివి॥ ఆ॥

## నమస్కృతులు.

ఆంజనేయగురో నమోనమో । ఆశ్రితవత్సల నమోనమో॥
౧. అవ్యక్తాయ నమోనమో । అనాధరక్షక నమోనమో॥ ఆం॥
౨. సద్గురువర్యా నమోనమో । సాధుపోషకా నమోనమో॥ ఆం॥
౩. దీనదయాళో నమోనమో । తేజోరూపా నమోనమో॥ ఆం॥
౪. నిర్వికల్పా నమోనమో । నిస్సంగాయ నమోనమో॥ ఆం॥
౫. తత్వబోధకా నమోనమో । దయాసముద్రా నమోనమో॥ ఆం॥

## జేజేలు.

ఆంజనేయగురు మహారాజుకుజై । అమ్మాలక్ష్మీకాంతకుజైజై
మాతా సీతారామకు జైజై । పితజోగీశ్వరశర్మకుజైజై॥
౧. రాజయోగ అవధూత । సరస్వతిస్వామి సద్గురు మహా
రాజద్యుమణియోగంజిల్లు । రాధాకృష్ణ స్వరూపుండా॥ ఆ॥
౨. చిదానంద స్వరూపునకుజై । సదా తారక స్మరణునకుజై
ఆదిమధ్యాంత రహితునకుజై । వేదాంతవేద్యునకుజైజై॥ ఆం॥
౩. కాషాయాంబరధారికిజైజై । కరుణాపూరిత హృదయునకుజై
దోషతతిధ్వంసునకుజైజై । విషయారతి రహితునకుజైజై॥ ఆం॥
౪. పాపారణ్య దవానలునకుజై । భవబంధ విమోచనునకుజైజై
ఆపదోద్ధారకునకుజైజై । అగణితజన సేవితునకుజైజై॥ ఆం॥

## పరాకులు.

౧. అజ్ఞానతిమిర ప్రచండ మార్తాండా బహుపరాకు॥
౨. అపరిమితానంద సాగర శశాంకా బహుపరాకు॥
౩. సాధుజనదుస్తర భవాంబోధి భయాపహరణా బహుపరాకు॥
౪. నిత్య నిర్మలానంద జలధిమగ్న పరిపూర్ణా బహుపరాకు॥
౫. దురితజాలారణ్య దవానలా బహుపరాకు॥
౬. ఆశ్రితజన మనోరధ సస్యపరిపాలనా బహుపరాకు॥

## మంగళహారతులు.

౧

ఆంజనేయగురు మహారాజా నీ । కారతి నిచ్చెదగైకొను దేవా॥
ఉ॥ ప॥ అంజలితో శరణన్న వారి వెను । కంజవేయకను దరిజేర్చు శ్రీ ఆం

౧. నిరుపమ కరుణాపూరిత హృదయుడవు । నిరతము తారకస్మరణా
వ్రతుడవు ।
దురితజాలముల పారద్రోలు య । దారకీర్తి విశారదుండవగు॥ ఆం॥
౨. మొదలు తుదయులేక మోహాభ్రాంతుల । ముంచు యీజగము
నందున ।
యిదిసత్యం బిదియసత్యమనిదెల్పి । మదిచలనంబును మాన్పు
ధీరుడౌ॥ ఆం॥
౩. తాపత్రియముల ధాటినిజంపి । పాప తాపముల భయములడంచు ।
తాపసవరదుడ దయామయుడ పరి । తాపదగ్ధుడవు
దైవ సమానుడౌ॥ ఆం॥
౪. యెక్కడ జూచిన నిక్కంబగుయా । యెక్కపదార్థంబేకంబ్రహ్మం ।
దక్కయితరము ధరలోలేదను । అక్కజమగుత్రోవ గ్రక్కున
జూపు॥ ఆం॥

౨

జయమంగళం । నిత్య శుభమంగళం
జయా జయమంగళం । నిత్య శుభమంగళం॥

౧. మంగళము జోగీశతనయాయ శాశ్వతే ।
మంగళము సీతరామాత్మజాయ ।
మంగళం మహాతు శ్రీ ఆంజనేయాయ తే !
మంగళం మహాలక్ష్మి కాంతాపతే॥ జ॥

౨. ధర జననమొంది భూపతనంబుగాగనే ।
తెరిపిలేనియట్టి మరుపుగలిగించు ।
మెరుకనే తెరను విడబరచి తిరమానట్టి ।
పరమపదమును జూపు గురువరాయ॥ జ॥

౩. కంటికగపడు జగము కల్లయనిబోధించు ।
మేటియాజ్ఞానంబు నూటిమెరయ ।
పాటించిభవజలధి దాటించునట్టి యా ।
కోటి కందర్ప సుందరాయ॥ జ॥

౪. అండపిండ బ్రహ్మాండంబులందు యా। ఖండమానట్లుగా నిండియుండు। పండువెన్నెలలోను అండబాయకయుండు। పరబ్రహ్మమునుజూపు పరాత్పరాయ॥ జ॥

౫. చంచలులకగుపడని పంచభూతంబుల। మించుయాజ్యోతిని అంచితముగ। గాంచునట్లు జేశి సంచితంబు ఒడంచు। పంచకోశాతీత లక్షణాయ॥ జ॥

3

నీనామ రూపములకు। నిత్యజయమంగళం॥

౧. జోగీశ సీతమాంబల। కొగి నుదయించినట్టి॥ నీ॥

౨. సమీరనందనాఖ్యను। నరసత వెలుగుచున్న॥ నీ॥

3. అతులమానసిలక్ష్మి। కాంతా మనోహరుండా॥ నీ॥

౪. వలనొప్ప కనకచాయ। గలమేని సుప్రకాశ॥ నీ॥

౫. తాపసవేషధారీ। కౌపీనాంబరధారీ॥ నీ॥

౬. మాయాప్రపంచమున కన। మాన నాట్యవినోదా॥ నీ॥

౭. నిరతము నీదువాక్కున। తారకము వెలయుచున్న॥ నీ॥

౮. ఆశ్రితపక్షపాతా। అకలంక తేజుడా॥ నీ॥

౯. అపరోక్షజ్ఞానమందిర। ఆనందరూపుడా॥ నీ॥

౧౦. శిష్యగణావశీకర। చిన్మయాకారగురుడా॥ నీ॥

## కృష్ణస్తుతి.

౧

కృష్ణజనార్దన ముకుందమాధవ। కేశవమురారి పరమాత్మా
కృతాంజలినైనేనీపదములకెరగితిబ్రోవుమి కృపతో శ్రీపతి॥

౧. విలాసార్థమై ప్రపంచేచ్ఛతో। మూలప్రకృతౌ నీదుశక్తిని
వెలయించి బ్రహ్మాండభాండములు। మెల్లనతృటిలో సృజింపజేశిన॥

౨. పరాంబజేశిన సృష్టిలోమానవ। పశుపక్షి క్రిమి కీటకాదులను
ప్రాణులు యెనుబదినాల్గులక్షలకు పరగ తనువులేర్పరపించినయో॥

3. తనువులన్నిటిలోనీదు అంశను । జొనిపి క్రమముగ జీవరాసులు
అన్నియునీదు వివిధరూపులే । యను అంశము ప్రకటన జేశినయో॥
౪. పరబ్రహ్మ వౌనీదు అంశలను । ప్రపంచ సృష్టి స్థితిలయంబుల
పరిపాలనకై బ్రహ్మవిష్ణు యీ । శ్వరులుగసృజించినియమించినయో॥
౫. మనుజులలోనిను జీవభ్రాంతితో । గనుగొననేరని పామరులా
జనులకుజ్ఞానంబిడి బోధచుట్టకై చక్కగ పెక్కదైవములసృజించిన కృ॥
౬. భేదకర్మలా మనుజులీభువిని । బొందుగతమతమ కర్మఫలంబుల
నొదవజేయతనయిష్టదైవముని । యుపాసింప నియమించినయో॥
౭. ఇన్నిచిత్రముల బన్నుగజేయుచు । గ్రన్నన ప్రపంచవిముఖుడవై
యున్నతరిమరల లయము జేతువే । లననాలీలనిబల్కుచుండుయో॥
౮. వైరులైన నీపేరుయొకపరియు । కారణముగనైనను వచియించిన
వారలకరుణతో దరికిజేర్చియు । పరమునిత్తువటయో ప్రద్యుమ్నా॥
౯. దీనపాలకా దిక్కునీవని । తిరముగనమ్మిన దీనుల మొరవిని
కనికరించుమయో కారుణ్యనిధీ । జనార్దనాయో నారాయణా॥ కృ॥
౧౦. శరణాగతులకు శరణ్యుండవని । పెరలవలననే పెద్దగవిని నీ
శరణుజొచ్చితిని బిరుదునిల్పుము । పురుషోత్తమయో పురాణ
పురుషా॥ కృ॥
౧౧. పుండరీకాక్షా దండమిదిగో నీ । యండజేరితిని దండిగనిడుమీ
నిండుపూర్వస్మృతి నిరతమువదశేవ । యొండుగోరనో యండజ
వాహన॥ కృ॥
౧౨. రామా, కృష్ణా, గోవిందా. నీ । రాంజనేయముఖసకలంబౌ
నామరూప పరమాత్మా నీ । ప్రేమజూపినన్ కృతార్థుజేయుము॥

౨

కృష్ణా కృష్ణా కృష్ణా యో । కృపాజలనిధే కృష్ణా ।
కృపాజలనిధే కృష్ణా నీకు । కృతానేకాభి వందనంబులు॥
౧. పండరివాసా కృష్ణా । ఓ పాపవినాశా కృష్ణా ।
పతీతపావన కృష్ణా । ఓ భవాబ్ధితరణా కృష్ణా॥ కృ॥
౨. ద్వారకినాధా కృష్ణా । ఓ దయార్ద్రహృదయా కృష్ణా ।
దానవభంజన కృష్ణా । ఓ దీనదయాపర కృష్ణా॥ కృ॥

3. వసుదేవాత్మజ కృష్ణా । ఓ వాసవవందిత కృష్ణా ।
దేవకీగర్భజ కృష్ణా ! ఓ పావనహృదయా కృష్ణా॥ కృ॥
౪. నందనందనా కృష్ణా । ఓ యాదవభూషణ కృష్ణా ।
యశోదతనయా కృష్ణా । ఓ శిశుపాలాంతక కృష్ణా॥ కృ॥
౫. ముచికుందపాలక కృష్ణా । ఓ శచీనాథస్తుత కృష్ణా ।
కుబ్జరక్షకా కృష్ణా । ఓ అబ్జదళానేత్ర కృష్ణా॥ కృ॥
౬. పాండవపక్షా కృష్ణా । ఓ పుండరీకాక్షా కృష్ణా ।
అండజవాహన కృష్ణా । ఓ అర్జునసఖా కృష్ణా॥ కృ॥
౭. కంసహంతకా కృష్ణా । ఓ కాళిందీపతే కృష్ణా ।
ఖగరాడ్వాహన కృష్ణా । ఓ జగత్త్రియగురో కృ॥

3

వందనమిదె యందుమియో । ఇందిరాపతే ।
అందుయిందు నెందుగానని । పదవినొందించుమియా॥
౧. ఖగరాడ్వాహననీదు కరుణగోరితి। అంగజజనకా నన్నాదరింపుమియా॥
౨. పండరివాసానీ యండజేరితి । పుండరికాక్షానను నీ నిండుదయతో బ్రోవుమియా॥ వం॥
3. శ్రీవత్సకౌస్తుభధరచిన్మయరూపా । శ్రీకృష్ణానీదాసునిజేరదీయుమియా॥
౪. పరమాత్మా నీపాదము బట్టినాడ నీ । పాలబడితి వేగమెనన్ పాలనజేయుమియా॥ వం॥
౫. నీవుతప్పనన్ను బ్రోవ నితరులెవరులేరయా । దేవకీతనయా నా భవసాగరనౌకవు॥ వం॥

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగమ్ । జితేంద్రియంబుద్ధిమతాంవరిష్టమ్
వాతాత్మజంవానరయూథముఖ్యం। శ్రీరామదూతంశిరసానమామి॥
శ్లో॥ కృష్ణానందముకుందమురారె । వామనమాధవ గోవిందా ।
శ్రీధరకేశవరాఘవవిష్ణో । లక్ష్మీనాయకనరసింహా॥
శ్లో॥ హరినారాయణ దురితనివారణ । పరమానంద సదాశివశంకర ।
భక్తజనప్రియ పంకజలోచన । హరినారాయణ దాసోహం॥
శ్లో॥ స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం । న్యాయేనమార్గే మహీంమహీశాః ।
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తునిత్యం। లోకాస్సమస్తాస్సుఖినోభవంతు॥

శ్లో॥ కాయేన వాచా మనసైంద్రియైర్వా । బుధ్యాత్మనావా
ప్రకృతే స్వభావాత్ ।
కరోమియద్య త్సకలంపరస్మై ? నారాయణాయేతి సమర్పయామి॥

కం॥ నీపాదకమల సేవయు । నీపాదార్చకులతోడి నెయ్యము నిత్యాం
తాపార భూతదయయును । తాపసమందారనాకు దయసేయగదే॥

శ్లో॥ ఆపదా మప హర్తారం । దాతారం సర్వసంపదాం ।
లోకాభిరామం శ్రీరామం । భూయో భూయో నమామ్యహం॥

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు । ర్గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ । తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ గురురేవ పరందైవం । గురురేవ పరంతపః ।
గురురేవ పరంధ్యానం । నగురోరధికంభువి॥

నగురోరధికం – నగురోరధికం – నగురోరధికం.

"గురోః ఆపన్నివారణ భవతరణా"

సర్వం సద్గురు చరణార విందార్పణమస్తు.

ఓంతత్సత్

పరబ్రహ్మార్పణమస్తు.

సర్వ విఘ్న ప్రశాంతి * శ్శాంతి * శ్శాంతిః.

శ్రీ ఆంజనేయ సద్గురు బోధామృతసారము సర్వము
సంపూర్ణము.

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు.

ఓం

శ్రీ సద్గురుభ్యోన్నమః

# నగురోరధికం.

## కీర్తన.

పల్లవి॥ రామా రామా రామా రామా । రామ రామ రమరామా ।
రామనామతారకము జపించిన । రయమునకృతార్థులగుదురు భువిని॥
హరిదాసులారా వినుడీ । మన వాసుదేవకృప గనుడీ॥

౧. పరబ్రహ్మమని పలుకబడుచుండు । భగవంతుండొక్కండేగలడు ।
నిర్గుణసగుణస్థితులని రెండా । పరబ్రహ్మముకు స్థితులుగలవట॥ రా॥

౨. నిర్గుణస్థితిలో నద్వితీయుడై । నిర్వికారుడై తానొక్కండే ।
పరమెద్దియులేక స్వప్రకాశుడై । ప్రకాశించుచుండునాబ్రహ్మము॥

3 నిర్గుణస్థితిలో నుండునంతవర । కేప్రపంచమును నదియేలేదు ।
నిర్గుణస్థితివదలి సగుణుడై । నీజగమును సృజియింపదలచెను॥ రా॥

౪. తనకంటెను వేరుగానిమాయ । యనునొకదాని నడ్డముంచుకొని ।
దానిచేత సృజియింపజేసెనీ । కనుబడుజగము జీవరాసులతో॥ రా॥

౫. జీవుల శరీరములలో మాయా । తత్త్వములాయా బుద్ధ్యహంకార।
చిత్తముమనములతాబొందగనవి । యంతపదార్థవిషయరూపులై॥

౬. జీవులభ్రమియింపంగ జేయగనె । జీవులుమోహితులై విషయాను
భవములబొందుచునుండందుండును।తావీక్షించుచుసాక్షిమాత్రుడై॥

౭. జ్ఞాతజ్ఞానముజ్ఞేయముతానై । కొంతకాలమటు లానందించి ।
నంతప్రపంచవిముఖుడైమరల । నత్తరి నిర్గుణస్థితినిబొందును॥ రా॥

౮. దీనినెరుంగలేక పామరులు । దేహమెయాత్మని సదాదలచుచు ।
జననమరణ సాగరమునగిలగిల । తన్నుకొనుచుందురిధారిగానకను॥

౯. కరచరణాది యింద్రియంబులను । కలిగి సప్తధాతుమయంబై ।
కనుబడునీదేహము సతతంబును । తుదరమనిమదిలోనమ్మండీ॥

౧౦. అనిత్యంబగు యీ దేహంబునె । ఆత్మగనెన్నడు దలపకుడీ ।
ఆత్మనిత్యమై వేరుగనున్నది । అనుభవముచె నిదియెరుగండీ॥ రా॥

౧౧. రామకృష్ణాది సర్వదైవములు । రామకృష్ణులెయని యెరుగండీ ।
రాముడెకృష్ణుడు కృష్ణుడెరాముడు । రామకృష్ణులు వేరనకండీ॥

౧౨. వీరలెల్ల పరబ్రహ్మసగుణా । కారదైవంబులని యెరుగండీ ।
వీరలముందు కొంతికాలము । గురిగలవారై ధ్యానపూజలతో॥

౧౩. పామరజనములు సేవింపంగ । పరమపురుషుడో యొకసద్గురుని ।
ప్రియత్నమేమియు లేకనెజూపి । పరమజ్ఞానమునొసంగచేయును॥

౧౪. పరమోత్కృష్టంబౌ యీజ్ఞానము । పరగనొసంగి జ్ఞానులజేశి ।
వరమోక్షంబుకు దారిజూపి కృ । తార్థులజేశి కడదేర్చునుభువి॥

౧౫. పామరులారా యీవాక్యంబులు । పరిశోధించి నమ్మికగలిగిన ।
భక్తిశ్రద్ధలతో యామోదించి । ప్రయత్నించిఫలమును బొందండి॥

౧౬. ప్రేమతో కంభమ్మెట్టు సోమ । బ్రహ్మదాసుని బ్రోచురీతిని ।
మిమ్మెల్లర కరుణతోడ యీపర । మాత్మయెబ్రోచుచు
నుండును గాత॥ రా॥

కంభమ్మెట్టు సోమబ్రహ్మానంద రావు,
ఏలూరు.

# తప్పొప్పులపట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| i | 17 | జోగిశ్వర | జోగీశ్వర |
| | 20 | పెరు | పేరు |
| | 21 | చిన్నామ్మాయి | చిన్నమ్మాయి |
| ii | 19 | పడిన | బడిన |
| iii | 13 | అనుకూలమయ్యె | అనుకూలమయ్యే |
| | 16 | ౨౦ | 20 |
| iv | 1 | ధనమున | ధనమును |
| v | 5 | సరిపూర్ణ | పరిపూర్ణ |
| | 18 | ఆత్మబొధ | ఆత్మబోధ |
| ix | 12 | తటస్థిచినది | తటస్థించినది |
| | 17 | దుఃఖపుచు | దుఃఖింపుచు |
| | 18 | నునందరిలో | మనందరిలో |
| xi | 13 | వయస్సు | మనస్సు |
| P | | పేజీలు 2, 1 | 1 (అ), 1 (ఆ) |
| 1 (ఆ) | 3 | అభవందన | అభివందన |
| 2 | 4 | గలిగియాత్మ | గలిగాత్మ |
| 3 | 6 | దారక | తారక |
| 6 | 10 | నిక్కంచిది | నిక్కంబిది |
| 20 | 2 | జూచి | జూచు |
| 22 | 8 | దెలిసినను | దెలిపినను |
| | 12 | విషయమున | విషయమును |
| 28 | 13 | నుండి | నిలచి |
| | 15 | మొదలిడక | మొదలిడిన |
| 31 | 17 | నేయుండ | నేనుండ |
| 32 | 13 | ఛేయుటం | చేయుట |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 32 | 20 | పుప్పముివిడచి | పుష్పమునువిడిచి |
| | 26 | నవలంభించి | నవలంబించి |
| 33 | 17 | జేసికుని | జేసికొని |
| 36 | 3 | ‘ ఓ ’ | (ఓ) |
| 37 | 7 | రాగానే | కాగానే |
| | 9 | తనయదు | తనయందు |
| 38 | 22 | పంచమ | పంచ |
| 39 | 20 | సూక్ష్మావస్థలో | సూక్ష్మావస్థను |
| 41 | 7 | మహాతు | మహాత్తు |
| | 19 | పరమావు | పరమాణువు |
| 42 | 10 | మొనను | మైనను |
| | 18 | జనితబు | జనితంబు |
| | 25 | వృతులను | వృత్తులను |
| 43 | 12 | ప్రాణంబులను | ప్రాణంబులును |
| | 10 | తన్మాత్రులతో | తన్మాత్రలతో |
| 44 | 3 | వాలములు | ఘాలములు |
| | 7 | ఛిచ్ఛక్తి | చిచ్ఛక్తి |
| 45 | 13 | పాయువ | పాయువు |
| 47 | 4 | పంచకరణము | పంచీకరణము |
| 48 | 2 | జ్ఞాతి | జ్ఞాత |
| | 14 | సూల | స్థూల |
| 50 | 3 | ఇట్టు | ఇట్టి |
| 52 | 9 | శరీనవ | శరీరమని |
| 53 | 9 | నెరుంగుటయేయని | నెరుంగుటయే జాగ్రతయని |
| 54 | 18 | నిది | నిధి |
| 58 | 14 | సిద్ధిని | సిద్ధికై |
| 61 | 4 | నెతగా | నెంతగా |
| 62 | 26 | శ్రేష్టమైన | శ్రేష్ఠమైన |
| 67 | 1 | అద్వీతీయుడు | అద్వితీయుడు |
| 70 | 13 | మందుండుండునది | మందుండునది |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 72 | 23 | ఆంద్రికర్త | ఆంధ్రీకర్త |
| 76 | 16 | వాస్తమస్తకం | హాస్తమస్తకం |
| 80 | 6 | ఆనదము | ఆనందము |
| | 28 | నిఅ | అని |
| 82 | 16 | లకా్యర్థము | లక్ష్యార్థము |
| 84 | 27 | పరామర్స్మః | పరామర్శ్యః |
| 86 | 6 | లక్ష్యార్ధము | లక్ష్యార్థము |
| | 7 | లక్ష్యములైన | లక్షణములైన |
| 87 | 8 | విద్య | అవిద్య |
| 89 | 4 | విక్షీపము | విక్షేపము |
| | 28 | సద్దు | సద్గు |
| 90 | 9 | ప్రికరఅను | ప్రికరణాను |
| | 21 | నిష | నిష్ఠ |
| | 24 | ష్థానమును | పానమును |
| 92 | 2 | కర్మరను | కర్మలను |
| 95 | 13 | యశేములను | యంశేములను |
| 101 | 19 | త్రిపుటుని | త్రిపుటిని |
| 102 | 12 | వదకు | వరకు |
| 104 | 3 | కణములకధిక | కణములధిక |
| 105 | 24 | సర్వ | సర్ప |
| 110 | 10 | సంహార | సంసార |
| | 12 | దృధమగు | దృఢమగు |
| 112 | 8 | సత్స్జ్ఞానా | సత్యజ్ఞానా |
| | 29 | ఫుట్టుక | పుట్టక |
| 113 | 5 | తోశివేశిన | త్రోసివేసిన |
| 115 | 21 | మనస్సును | మనస్సను |
| 117 | 6 | దృష్ట్వము | దృష్టము |
| 122 | 8 | తన | తమ |
| 123 | 27 | మార్గే | మార్గేణ |

